# అపరాధ పరిశోధన

రు. 3 మే '78

సప్లిమెంట్



అపరాధ పరిశోధన సప్లిమెంట్—53
మే, 1978
వెల : 3_00 రూపాయలు
ఏడాది చందా 39 రూపాయలు
జీవిత చందా 250 రూపాయలు



కార్యాలయం :
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు_29
ఫోన్_36959

ముద్రణ :
క్రాంతి ప్రెస్,
12, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు_1.

గుడ్డి రంగారావు

# హత్య = ఐదు హత్యలు!!

ఎస్. ఎస్. శాస్త్రి

రవి నాచేయి పట్టుకుని వున్నాడు. ఇద్దరం రోడ్డుకు పక్కగా నడుస్తున్నాము.

చుట్టూ చీకటిగా వుందని నాకు తెల్సు. ఈ చీకటి ఒక్క రాత్రిపూటే వుంటుందనీ తెల్సు. కాని నా కళ్ళ ముందు మాత్రం ఎప్పుడూ కటిక చీకటే.

...కారణం నేను గుడ్డివాణ్ని!!

రవి నా కొడుకు. వాడికి పధ్నాలుగేళ్ళుంటాయి. నేను గుడ్డివాణ్ణయినా రవివలన నాకా కొరత అంతగా లేదు. వాడు చాలా చురుకైనవాడు. చిన్నవాడైనా పెద్ద వాళ్ళ మనస్తత్వం, వాళ్ళలోని ఆలోచనా శక్తి వీడికుంది.

ఇద్దరం అనుకోకుండా సెకండ్ షో సినిమా చూసి వస్తున్నాం.

"అయినా రవీ! నీ మొండితనమే గాని సెకండ్ షో ఏమిట్రా?" అంత నిశ్శబ్దం చుట్టూ రాజ్యం ఏలటం ఇష్టం లేక అన్నాను.

"వాట్ డాడీ! 'బ్లైండ్ టెర్రర్' ఏం పిక్చరు నిజంగా! అలాంటి పిక్చర్స్ సెకండ్ షో చూస్తేనే థ్రిల్లింగ్ గా వుంటుంది. మీకు కథ చెప్పాగా?" అన్నాడు రవి.

నవ్వుకున్నాను. నాలాంటి గుడ్డి వాళ్ళకి 'గుడ్డివాని' సినిమా ఏం కనుపిస్తుంది? థియేటర్ దగ్గరగానే వుంది కాబట్టి రవిని తీసుకెళ్ళేను.

రవి ఆ సినిమాలో 'బ్లైండ్'గా యాక్టుచేసిన హీరోయిన్ గురించి ఏదో చెప్తున్నాడు.

"డాడీ! ఇల్లు దగ్గర పడింది!" అన్నాడు రవి.

మలుపు తిరిగి వీధిలోకి ఎంటరయ్యేం.

"డాడీ మన వీధి చాలా చీకటిగా వుంది." అన్నాడు రవి.

నా కళ్ళ కెప్పుడూ చీకటే!

"లైటు ఏమయిందిరా!" అడిగేను.

"ఏమో మరి! వెలగలేదు."

"కరంట్ లేదేమో?" అన్నాను.

"ఊహు...! అదుగో రోడ్డు ఆ చివర్న లైటు వెల్గే వుంది."

మవునంగా వుండిపోయేను. ఆ విషయానికి నా మనస్సంత ప్రాధాన్యత ఇవ్వలేదు.

ఇల్లు మరింత దగ్గర పడిందేమో. రవి అడుగుల వేగం పెరిగింది. నా వేగంకూడా పెంచేను.

ఉన్నట్టుండి 'పట పట' మన్న శబ్దం చిన్నగా వినిపించింది. రవి ఆగేడు. నేనూ ఆగాల్సి వచ్చింది.

"రవీ! ఏమిట్రా ఆ చప్పుడు?" అడిగే వరం కాక.

"గాజు పెంకులు!" ఓ క్షణం తర్వాత అన్నాడు రవి.

ఆశ్చర్య పోయేను. "గాజు పెంకులా? ఎలా వచ్చేయి?"

"డాడీ! ఇదిగో కరంట్ పోల్. ఎవరో బల్బు బద్దలు గొట్టేసేరు. అందుకే వెల్గి లేదు. పోనీ గానీ... పదండి..." అని ముందుకు నడిచేడు.

ఈ వీధికి పక్కనే 'మురికి కాలనీ' ఒటుంది. అక్కడి ఇళ్ళన్నీ గుడిశెలే. అక్కడి పిల్లలు తరుచు ఇక్కడకు వస్తుంటారు ఆడు కోటానికి సాయంత్రపు వేళల్లో. వారిలో ఎవరో చేసుండొచ్చు ఈ పని."

"డాడీ ఇల్లు వచ్చేసింది..." రవి మాటలతో ఇంకా నడవబోతూ ఆగిపోయేను. ఆ కరంట్ పోల్ కి పక్కనే వుంది మా ఇల్లు. పెద్ద బంగళా కాకపోయినా అందంగా కన్పిస్తుంది చూపరులకి. చుట్టు కర్ర ఫెన్సింగ్ వుంది. చిన్న పోర్టికో!

"రవీ తలుపు తాళం తియ్. ఆ...అన్నట్టు బాబా యొచ్చేడా...?" అన్నాను.

"ఉ...హు వచ్చినట్టు లేదు. తాళం అలాగే వుంది. మరి రాదేమో!" రవి ఫెన్సింగ్ గేటు గొళ్ళెం తీస్తూ అన్నాడు.

చిన్నగా నిట్టూర్చేను.

"రా డాడీ!" అంటూ రవి తలుపుతాళం తీయటానికి

వెళ్ళేడు.

చేతికర్రని నేలమీద తాటిస్తూ ఫెన్సింగ్ గేటు తోసుకుని లోని కెళ్ళేను.

తిరిగి గొళ్ళెం తగిలించటానికి కొంచెంకంగి తడుము సాగాను.

గొళ్ళెం తగల్లేదు చేతికి. విసుక్కుని స్టిక్ని గేటు కాన్చి మరికొంచెం వంగి రెండు చేతులతో తడిమేను. గొళ్ళెం తగిలింది.

దాన్ని కొక్కానికి తగిల్చి తడిమి స్టిక్ అందుకో బోయేను. కాని అది జారి నేలపై బడినట్టు చిన్న శబ్ద మయింది.

మరింత విసుక్కుని బాగా వంగి నేలపై తడుము సాగాను...

కాని వులిక్కి పడ్డాను నాకు తెలియకుండానే.

ఎందుకో చెవులు రిక్కించేను...కారణం, ఎక్కడ నుంచో ఏదో శబ్దం గాల్లో తేల్తూ వచ్చి నా చెవుల అంతరాంతరాల్లోకి దూరింది. ఆ శబ్దం ఏమిటో తెల్సుకో టానికి ఒక్క క్షణం మాత్రమే పట్టింది.

ఎవరో ఏదో తన్నుకుని పడబోయి నిల దొక్కుకున్న శబ్దం అది. ఆ వస్తువు పక్కకు పడినట్టుగాని మరి శబ్దం విన్పించలేదు. అంటే ఆ వస్తువును పూర్తిగా తన్న లేదన్నమాట. కేవలం జరిగినట్టుమాత్రమే విన్పించింది.

కాని ఈ శబ్దం అతి చిన్నగా విన్పించింది. కాని మరీ దూరంనుంచి కాదని అనిపించింది.

వెనుకనుండి రవి తాళం తీస్తున్న చప్పుడు అతి చిన్నగా విన్పిస్తోంది.

నిజానికి ఇలాటి చిన్న శబ్దాలు మామూలు మనుషులకు అంటే కళ్ళున్నవారికి వినిపించవు. విన్పించవు అంటే మైండ్ గ్రహించదన్నమాట. కారణం కళ్ళున్నప్పుడు మైండ్ మరింత ఎక్కువగా ఆలోచిస్తుంటుంది.

కాని నాలాటి వారికి చూచే భాగ్యంలేదు కనుక చెవులకే ఎక్కువ పనివుంటుంది. చూచే ప్రసక్తే లేదు కనుక ఏ చిన్న శబ్దం అయినా మైండ్ వెంటనే గ్రహిస్తుంటుంది.

నా ఆలోచనలకి నవ్వుకుని హాండ్ స్టిక్ అందుకుని నిలబడ్డాను.

కాని మళ్ళీ వులిక్కిపడ్డాను!!

ఎక్కడో కారుడోర్ లాగినట్టుగా 'బర్...' మని శబ్దం! ఆ మరుక్షణమే డోర్ మూసినట్టు 'దబ్' మని చప్పుడు.

ఆ 'దబ్' మనే శబ్దంతోపాటు 'కిళింగ్...గ్' మనే మరో వింత ధ్వని. ఈ చప్పుళ్ళన్నీ అంచెలంచెలుగా గాలిలో తేలివచ్చి నా హృదయాంతరాల్లోకి దూరేయి.

అదే క్షణంలో కారు స్టార్టయి వెళ్ళిపోయిన శబ్దం!

ఈ శబ్దాలన్నిటికీ మధ్య కాలం పది సెకండ్లు కూడా ఉండదేమో?

అనుకోకుండా నా కుడిచేయి ఎడమ చేతికున్న వాచీ మీదకు వెళ్ళింది మెల్లగా.

నాలాటి వారికి కైం తెలుపగల వాచీ అది. పెద్ద ముల్లు, చిన్నముల్లు పన్నెండు మీద వున్నట్టు గ్రహించేను. అంటే సరిగ్గా పన్నెండుగంట లయిందన్నమాట! అంటే అర్ధరాత్రి!!

"డాడీ! ఏం చేస్తున్నావక్కడ?" రవి గొంతు విన్పట్టంతో వులిక్కిపడి నడిచేను హాండ్ స్టిక్‌తో నేల మీద తడుతూ.

"రవీ...!" అన్నాను.

"వాట్ డాడీ...?"

"చీకటి ఎలా వుందిరా?"

రవి ఆశ్చర్యంగా చూసుంటాడీ ప్రశ్నకు నా వేపు.

"ఎందుకు? చీకటి చాలా నేవుంది. ముందేముందో కన్పించనంత చీకటి!" అన్నాడు.

"హాల్లో లైటు వేసేవా?"

"ఆ...!!"

"ఎంత సేపయింది...?"

"జస్ట్...ఇప్పుడే...!"

"అద్సరే రవీ! నీ కిందాక రోడ్డు మీద ఎక్కడైనా కారు ఆగివుండి కనుపించిందా?" అడిగేను.

"ఉహు... లేదే...!" అన్నాడు.

అయితే అది బ్లాక్ కారయి వుండవచ్చు అనుకున్నాను.

"పోనీ కారు స్టార్టయి వెళ్ళిన శబ్దమయినా విన్పించిందా?" అడిగేను.

రవి మాట్లాడలేదు. ఆలోచిస్తూండి వుంటాడు.

వాడికీ విన్పించివుంటుంది. కాని పట్టించుకుని వుండడు.

"డాడీ! దేనికివ్వన్నీ అడుగుతున్నారు?" అర్థంకానట్టడిగేడు రవి.

అవును! ఎందుకు నా కివ్వన్నీ? రోడ్డుమీద కారు స్టార్టయితే అందులో వింతేమిటి?

"ఏం లేదులే... పద!" అని నడిచేను లోనికి.

టవల్ తో ముఖం తుడుచుకుంటూ టైమెంతయిందో చూచుకున్నాను.

ఎనిమిదిన్నర.

ఈ రోజు కొద్దిగా ఆలస్యంగా లేచేను.

గదిలోనున్న మంచంవద్దకు నడిచి దాని పక్కనే వున్న టీపాయ్ కి ఆనించబడివున్న హాండ్ స్టిక్ ని అందుకున్నాను. తర్వాత జేబులోవున్న 'కూలింగ్ గ్లాసెస్'ని తీసి కళ్ళకు తగిలించుకున్నాను. వాటిని ఎప్పుడూ కళ్ళకీ వుంచుకోవటం నాకలవాటు. నా గుడ్డి కళ్ళ కడ్డుగా అవి లేకపోతే ఏదోలా అనిపిస్తుంది నాకు.

"రవీ...!" కేకేసేను.

"యస్...డాడీ!" రవి గొంతు కీచుగా విన్పించింది కిందనుంచి!

"ఏంచేస్తున్నావ్...? అసలెక్కడున్నావ్ ?" అన్నాను.

"కిచెన్ రూంలోవున్నా. కాఫీ చేస్తున్నాను...!" రవి గట్టిగా అరిచాడు.

"అయితే నాయర్ రాలేదన్నమాట!" నాలో నేనే విసుక్కుంటూ హాండ్ స్టిక్ తో మెల్లగా నడుస్తూ బాల్కనీలో కొచ్చి నిలబడ్డాను.

సూర్యకాంతి కొద్దిగా తగిలినట్టనిపించింది శరీరానికి.

సిగరెట్ తీసి వెల్గించుకున్నాను. వాతావరణం ప్రశాంతంగా వున్నట్టుంది.

"డాడీ! కాఫీ...!" రవి గొంతు వినిపించింది వెనుకనుంచి.

వాడందించిన కాఫీ కప్పు అందుకని మెల్లగా సిప్ చేయసాగాను.

"రవీ! చంద్రం బాబాయొచ్చాడా?" అడిగేను.

"ఊహు...!" రవి మామూలుగా అన్నాడు.

చంద్రం! నా తమ్ముడు. సాధారణంగా ఇంటిపట్టున వుండడు. ఎక్కువగా త్రాగుతూ ఎక్కడెక్కడో గడపటం వాడి కలవాటు. కాని ఇవన్నీ రాత్రి వేళల్లో మాత్రమే. నా బాధ నర్థం చేసుకోలేని స్థితిలో వున్నాడు.

ఇంకా సాగబోయిన నా ఆలోచనల్ని ఖండిస్తూ ఏవో వాహనాల చప్పుడు వినిపించింది. అవి దగ్గరలోనే ఆగినట్టు వాటి ఇంజన్లు ఆగిపోయేయి.

"రవీ...! ఏమిట్రా...?" అడిగేను.

"డాడీ! అంబులెంస్, పోలీస్ జీపు వచ్చినవి. పోలీసులు మన ఎదురిల్లు... బ్యాంక్ మేనేజర్ రంగనాథంగారింట్లో కెళ్తున్నారు."

అలాగే వుండిపోయా నాశ్చర్యంతో! మనసులో రకరకాల ఆలోచనలు...అస్పష్ట దృశ్యాలు కదిలిపోతున్నయ్. ఏదో అర్థమయినట్టనిపిస్తోంది.

కాని ఏం జరిగిందీ వూహకు అందీ అందటంలేదు.

"రవీ!..." పిలిచేను.

రవి పలుకలేదు. బహుశా కింద కెళ్ళిపోయుంటాడు.

రెండు క్షణాలాలోచించి, గబగబ నడిచేను కిందకి. మెట్లు దిగి హాల్లోకొచ్చేసరికి రవి అప్పుడే వచ్చిన నాయర్ని కారణం అడుగుతున్నాడు. ఇంత ఆలస్యంగా వచ్చినందుకు.

"రవీ...!" అన్నాను.

"ఎస్...! వాట్ డాడీ...?"

"రవీ...మనం ఒకసారి రంగనాథంగారింటికి వెళ్ళాలి పద!" అన్నాను ఎడమచేయి ముందుకు చాస్తూ.

రవి నా చేయి అందుకున్నాడు.

నాయర్‌ని పన్ను చూసుకోమని చెప్పి, బయటకు నడిచేము.

"రవీ! బయట జనం ఎవరేనా వున్నారా?" అన్నాను త్వరత్వరగా అడుగులు వేస్తూ.

"నో! ఎవరూ లేరు. పోలీసులందరు లోనికెళ్ళారు. అయినా వాళ్లెందుకొచ్చారు డాడీ!"

నేనేమీ మాట్లాడలేదు.

ఇద్దరం ఆ యింటికి చుట్టూవున్న ఫెన్సింగు కర్ర గేటు తెరుచుకుని లోనికెళ్ళాము. ఆ యింటి హాల్లో కడుగు పెట్టేము...

"డాడీ!..." రవి ఆగిపోయేడు. నా చేతిని పట్టుకున్న వాడి చేయి కంపిస్తున్నట్టు గ్రహించేను.

"వాట్ రవీ!...ఏమయిందిః?" అడిగేనాత్రుతగా!

"డాడీ! రంగనాథంగారు...సోఫాలో వెనక్కి పడిపోయున్నారు. ఆయన గుండెల్లో కత్తి దిగబడి వుంది. రక్తం అంతా కారి..." రవి మాటలు భయంగా ఆగిపోయాయి.

అంతే! అదిరిపడ్డాను!! మనసు మొద్దుబారినట్టనిపించింది.

# 3

"రవీ...! హాల్లోని పరిస్థితంతా వివరంగా చెప్పు!" అన్నాను.

"ఎస్ డాడీ! ఎవరో...ఇన్‌స్పెక్టరుగారు కాబోలు... సోఫా దగ్గర నిలబడి 'ఆయన' శవాన్ని పరీక్షగా చూస్తున్నాడు. మరొకతను ఏదో చల్లుతున్నాడు అన్నిచోట్లా. ఇంకొకతను దగ్గరనుండి రంగనాధంగారి శవానికి ఫోటోలు తీస్తున్నాడు. డాడీ! రంగనాధంగారి నవుకరు వున్నాడిక్కడే!..." ఇంకా ఏదో అంటున్నాడు రవి.

"రవీ...!రంగనాధంగారున్న సోఫా ఎదుట టీపాయ్ వుందా...?" అడిగేను సాలోచనగా...

"వుంది డాడీ..." అన్నాడు రవి.

"రవి జాగ్రత్తగా చూసి చెప్పు. ఆ టీపాయ్ 'తిన్నగా' వుండాల్సిన విధంగా లేదు కదూ! ఎవరో జరిపినట్లు పక్కకి తిరిగినట్లు వుందికదూ!" అన్నాను.

ఓ క్షణం ఆగి, "అవును డాడీ! మీ కెలా తెల్సు? ఆ టీపాయ్‌మీద చంద్రం బాబాయివద్ద వుండేలాటి సీసాగూడా వుంది. పక్కనే గ్లాసు వుంది." చెప్పాడు రవి.

"డాడీ!" మెల్లగా అన్నాడు రవి. "ఆ ఇన్స్‌పెక్టరుగారు నన్ను చూసేరు. మనవయిపే వస్తున్నారు!"

నేనూ అందుకే ఎదురుచూస్తున్నాను!

ఇన్స్‌పెక్టర్ దగ్గరవ వచ్చినట్లు బూట్ల శబ్దమయింది.

నా చేయి రవిచేతిలో వుండటం, నా కళ్ళవున్న నల్ల కళ్ళద్దాలు, చేతిలోని స్టిక్కూ చూసి తెలుసుకునుంటాడు ఇనస్పెక్టరు నా లోపాన్ని.

"అయాం సారి.. అయాం ఇన్స్‌పెక్టర్ వినోద్! మీరూ...!" అంటూ ఆగాడు.

"నా పేరు కృష్ణమోహన్! ఈ ఇంటి ఎదురిల్లు

మాంది!'' అన్నాను.

''ఐసీ...! బైదిబై బ్యాంక్ మానేజర్ రంగనాథం గారు హత్యచేయబడ్డారు. ఈ విషయం మీకెలా తెల్సిందో చెప్పండి!'' అన్నాడిన స్పెక్టరు.

''మీ పోలీసు జీపు, అంబులెంస్ మా రవి చూసేడు. విషయమేమో తెల్సుకొందామని వచ్చేను,'' అన్నాను.

''అద్సరే! రంగనాథంగారు హత్యకాబట్టం మీకు ఆశ్చర్యం కల్గిస్తోందా?''

ఇన్స్పెక్టరు తెలివయినవాడని ఆ ప్రశ్నతో గ్రహించేను. ఆ ప్రశ్నతో మరెన్నో ప్రశ్నలు ముడివడివున్నాయి.

''ఇన్స్పెక్టర్! నేను కొంత చెప్పాలనే వచ్చాను. కాని ముందు మీ పన్లు అన్నీ ముగించండి! నేనంతవరకూ వుంటాను. ఆ తర్వాత మా ఇంటికి వెళ్దాం...!'' నా మాటలకి ఇన్స్పెక్టరు చాలా ఆశ్చర్యపోయుంటాడు.

''దట్సాల్ రైట్! కాని చిన్న ప్రశ్న! రంగనాథం గారితో మీకు మాగా పరిచయం వుందా?'' అన్నాడు.

''నో...అంతపరిచయంలేదు. ఎప్పుడేనా ఎదురుపడితే విష్ చేసుకుంటాము. అంతే!'' అన్నాను.

ఇన్స్పెక్టర్ మరేమనలేదు. అతను కదిలినట్టుగా బూట్ల శబ్దమయింది. అతను రంగనాథం ఇంటి నవుకరు వద్దకు వెళ్ళాడని వూహించేను.

''నువ్వేకదూ ఈ ఇంటి నవుకరువి?'' ఇన్స్పెక్టరు వినోద్ గొంతు గంభీరంగా విన్పించింది.

''అవునండి. నాపేరు మహావీర్. అన్నిపన్లూ నేనే చేస్తుంటాను.'' అన్నాడు నవుకరు మహావీర్.

''అలాగా నువ్వు వుదయం ఎన్ని గంటలకు వస్తుం

టాప్...?''

''నేను రోజూ వుదయం ఆరుకల్లా వచ్చేవాడినండి. గాని 'అమ్మగారు' వారంరోజుల క్రితం పుట్టింటికి వెళ్లే రండి. అయ్యగారు పొద్దెక్కి గాని లేవరు. అందువల్ల ఆలస్యంగా వస్తున్నాను. ఈరోజు అలాగే వచ్చేనండి. గాని వీధితలుపులు చేరేసున్నాయండి. అయ్యగారు రాత్రి తలుపేసుకోవటం మరచిపోయేరేమో ననుకున్నాను. ఇంతకు క్రితం రెండుసార్లిలానే జరిగింది. కాని లోపల ఇలా చచ్చి పడివున్నారండి!''

నేను ఓ పక్క ఏదో ఆలోచిస్తూనే ఈ సంభాషణ వింటున్నాను గాని ఆలోచనల్లో ఏమీ తలకెక్కటంలే! రవి ఏదో మాట్లాడుతున్నాడు...

''ఆ... మహావీర్... నిన్నరాత్రి ఎన్ని గంటలవరకు వున్నావు?'' ఇన్స్పెక్టర్ ప్రశ్న...

''నిన్న తొమ్మిదిన్నర వరకు వున్నానండి. అయ్యగారు కారులో వచ్చేరు. భోజనం పెట్టేయమంటారేమోనని అడిగేను. కాని ఆయన ఈరోజు భోజనం చేయాలని లేదని వెళ్ళిపొమ్మని అన్నారు. ఆయన సాధారణంగా క్లబ్బు నుంచి ఇంటికి వచ్చేక భోజనం చేయరు. నేను తలుపులన్నీ వేసేసి, వీధి తలుపులేసుకొండని చెప్పి వెళ్ళిపోయానండి'' చెప్పేడు నవుకరు మహావీర్.

''నీ యిల్లెక్కడ?''

చెప్పేడు మహావీర్.

ఇన్స్పెక్టరు మరేం మాట్లాడలేదు. బహుశా ఆలోచనల్లో పడివుంటాడు.

''ఇన్స్పెక్టర్! హత్య రాత్రి పదకొండు, పన్నెండు

గంటలమధ్య జరిగి వుంటుంది. నోరు సగం తెరిచి వుంచేడు హాతుడు. అంటే కత్తి చాలా బలంగా, సూటిగా దిగబడింది గుండెల్లోకి. అందుకే అరుపురాకముందే ప్రాణం పోయింది..."

బహూశ ఆ చెప్పేది పోలీస్ డాక్టరయుంటాడు.

"మిగతా తతంగాలన్నీ ముగిసేయి. అప్పటికి చాలా లైమయింది.

ఇన్స్పెక్టర్ వినోద్ అలోగా సార్జంట్ చేత సూరత్ బ్యాంకు స్టాఫ్ అందరకు కబురు పెట్టించేడు. అందరు వచ్చేరు. అందరూ ఆశ్చర్యపడ్డారు ఈ హత్యవార్త విని.

ఛీఫ్ కాషియర్ లోకనాధం, అకవుంటెంట్ సునీత ఈరోజు సెలవు పెట్టింది అని, కాని ఆమె ఇంటిలో ఫోను వుందని ఇన్స్పెక్టరుకు చెప్పి, రంగనాథం ఇంటిలోనున్న ఫోన్ద్వారా ఆమె 'కా విషయం' తెలిపి రప్పించాడు.

మరో పది నిమిషాలనంతరం బైట కారాగిన శబ్దమయింది. కాని నా మనసులో ఏవో ఆలోచనలు సుళ్ళు తిరుగుతున్నాయ్. నిన్న రాత్రి నాకు వినిపించిన శబ్దాలు హంతకుడి చేసని అర్థమవుతోంది. హంతకుడు కారులోనే వుండి వుండవచ్చు...

ఇన్స్పెక్టర్, ఛీఫ్ కాషియర్ని మరెవరెవర్నో ఏవో ప్రశ్నిస్తున్నాడు. వారందరిలో నన్ను ఒకే గొంతు ఆకర్షించింది.

అది అకవుంటెంటు సునీతది. ఆమె మాటలు వింటూనే ఆమె వేషం గ్రహించేను.

రవి వర్ణించిందాన్ని బట్టి ఆమె మాడర్న్ స్టయిల్ లో వుంది.

అందరూ తమతమ విచారాన్ని వ్యక్తం చేసేరు.

ఇన్స్పెక్టరు ఇక అందరినీ వెళ్ళిపోవచ్చని చెప్పి, అందరివద్దా వారివారి ఇండ్ల అడ్రస్లుగూడా తీసుకున్నాడు. అందరు మెల్లగా కదిలేరు గుసగుసలతో.

అప్పుడే 'హత్య' విషయం బయటకు పాకిపోయిందేమో ఎవరెవరో రాసాగారు.

ఇన్స్పెక్టర్ వినోద్, నన్ను మా ఇంటిలో వుండమని, శవాన్ని పోస్టుమార్టమ్కు పంపి, సార్జంట్ కి కొన్ని ఇన్స్ట్రిక్షన్స్ ఇచ్చివస్తానని అన్నాడు.

అలాగేనని నేను, రవి రోడ్డుమీదకు వచ్చేము. ఎవరో స్కూటర్ స్టార్ట్ చేసిన ధ్వని విన్పించింది. అపుడు గుర్తు వచ్చింది అకౌంటెంట్ సునీత కారులో వచ్చిందని.

"రవీ! ఆ సునీత కారులో ఎక్కలేదా ఇంకా?" అడిగేను.

"ఇదిగో...ఇప్పుడే ఎక్కుతోంది కార్లో... ఆవిడ కారూ మన కారులాగే పాతగా..." రవి మాటలు పూర్తవకముందే దగ్గరలో 'బర్' మని మన కారుడోర్ లాగిన ధ్వని విన్పించింది.

ఆ మరుక్షణం "దబ్.." మని డోర్ మూసిన ధ్వని.

ఆ ధ్వనితోనే "కళింగ్...గ్..." మనే మరో చిన్న వింత ధ్వని...

అదిరిపడుతూ ఆగేను టక్కున!!

"వాట్ డాడీ...ఆగారేం..." రవి అడుగుతున్నాడు.

అప్పుడే కారు స్టార్టయి కదిలింది!

"రవి ... చూడు...ఆవిడ కారు కలర్ ఏమిటి?" ఆత్రంగా అడిగేను...

"బ్లాక్ కలరు..."

అలాగే వుండిపోయేను రెండు క్షణాలు. రవి చేయి పట్టుకు లాగడంతో నడిచేను.

"డాడీ! బాబాయొచ్చినట్టుంది. పోర్టికోలో మన కారుంది...!"

రవి అన్నమాటలు తలలోకెక్కటంలేదు!

మనసులో ఏదో...ఏదో గందరగోళం!!

## 4

"ఎస్...కృష్ణమోహన్ గారు...మీరు చెప్పేది నింపాదిగా చెప్పండి. ముందు మీ గురించి చెప్పండి...!" అన్నాడిన్స్పెక్టర్.

అతడి వుద్దేశ్యం అర్థమయింది నాకు.

"ఆల్ రైట్ ఇన్స్పెక్టర్. ఈ ఇంటిలో వుండేది నేను, నా తమ్ముడు చంద్రం, రవి! మా ఇల్లు, మా కున్న పాత కారు చూసి, అందరూ ధనవంతులనుకునే అవకాశ ముంది.కాని మాకున్న దేమీలేదు. మా చంద్రం ఉద్యోగం చేస్తున్నాడు. అదీగాక.. నా ఫ్రెండ్ వినయభూషణ్, కంపెనీలో నాకు చిన్న 'షేర్' ఇచ్చేడు, నాపై తనకి వున్న అభిమానంతో..." అన్నాను.

రెండుక్షణాలాగి అన్నాను.

"బైదిబై ఇన్స్పెక్టర్! ఇపుడు నేను మీకు అందిస్తున్న సమాచారం డైరక్టుగా హంతకుణ్ని పట్టివ్వగలదని నా నమ్మకం...".

"వ్వాట్...ఏంటిటి మీరనేది?" ఇన్స్పెక్టర్ అత్యాశ్చర్యంగా అన్నాడు.

"... ఇన్‌స్పెక్టర్! మీరు ఆశ్చర్యపోవటంలో ఆశ్చర్యంలేదు, ఇక నేను చెప్పేది!..." అని అతడికి అంతా వివరంగా చెప్పేను.

"ఇన్‌స్పెక్టర్! ఇది కాకతాళీయంగా జరిగింది. అంతే గాని హంతకుడు మరే 'క్లూ' వదిలిపెట్టలేదు. కాని హంతకుడు చేసిన పొరపాటు కారులో రావటమే..." అన్నాను.

"మీరన్నది ఆశ్చర్యం కలిగిస్తోంది. మీ వుద్దేశ్యం ప్రకారం హంతకుడు అకౌంటెంటు సునీత కారులో వచ్చేడు. దీనివలన హంతకుడికి, సునీతకి సంబంధం వుందని యెలా చెప్పగలం? అంతేకాదు. హంతకుడికి సునీతల కార్లడోర్స్ మూసినపుడు వచ్చిన మరో ప్రత్యేకమైన శబ్దం ఒకటేనని గ్యారంటీ యేమిటి?" ఇన్‌స్పెక్టర్ వినోద్ సాలోచనగా అన్నాడు.

నవ్వి అన్నాను.

"డియరిన‌స్పెక్టర్! మీ అనుమానాలు సహజంగా వున్నాయి. మొదట నాకూ అదే సంశయాలు వచ్చేయి. హంతకుడికి సునీతకి సంబంధంలేకపోవచ్చు. కాని ఒకటి! నేను విన్న రెండు శబ్దాలు ఒకే కారునుండి వచ్చినవని ఖచ్చితంగా చెప్పగలను. బహుశా ఆ కారు పాతదై వుంటుంది. దాని ఫ్రంట్‌డోర్ కొంత 'డిసీజ్'లో వుండొచ్చు. ఆ డామేజివలన డోర్ మూసినపుడు 'కిళింగ్' మనే మరో ధ్వని ప్రత్యేకంగా వచ్చింది.

హత్య సరిగ్గా రాత్రి పన్నెండు గంటలకు జరిగి వుంటుంది. అయితే హంతకు డదృష్టవంతుడు కాకపోవటంతో నేను రవి దగ్గరలోనే వుండటం జరిగింది..."అని

ఆగి అన్నాను.

"ఇన్‌స్పెక్టర్! నిన్నరాత్రి హంతకుడు నన్ను చూచే వాడే. కాని అదృష్టవశాత్తు నా హాండ్‌స్టిక్ పడిపోవటంతో నేను బ్రతికున్నాను. మా రవి కన్పడటానికెలాగూ అవకాశం లేదులెండి. హంతకుడు హత్యచేసి బయటికొచ్చి చుట్టూ చూసివుంటాడు. తర్వాతనే వెళ్ళిపోయేడు."

ఇన్‌స్పెక్టర్ లేచిన శబ్దమయింది.

"బెదిబె...! మీ ఊహ సహజంగా వుంది. హంతకుడు సునీత కార్ను ఆమెకు తెలీకుండా ఉపయోగించుకుని వుండవచ్చు. లేకపోతే వాళ్ళిద్దరికీ ఏదో సంబంధం వుండివుండవచ్చు. ఇప్పుడే వెళ్ళి ఆమె నిన్నరాత్రి యెక్కడ గడిపిందో మొదలైన వివరాలన్నీ రాబట్టుతాను...ఆమెపై వేయి కళ్ళు వుంచుతాను..." అన్నాడు.

ఇన్‌స్పెక్టర్ వినోద్ వస్తానని చెప్పి, వెళ్ళిపోయాడు. తిరిగి ఆలోచనల్లో పడ్డాను.

నిన్నరాత్రి అనుకోకుండా రవితో సెకండ్‌షో పిక్చరుకెళ్ళకపోయుంటే ఈ మాత్రం పరిశోధనకు కూడా తావుండేది కాదేమో! అయితే హంతకుడికి ఈ వీధి గురించి క్షుణ్ణంగా తెల్సుండాలి. ఈ వీధి రాత్రి తొమ్మిది గంటలకే నిశ్శబ్దం నిర్జనం అయిపోతుంది. ఇక్కడున్న యిళ్ళన్నీ యించుమించు డాబా యిళ్ళే...చాలామంది రాత్రిళ్లు మేడలపైనే పడుకుంటారు...దానివలన...

ఆలోచనల్లో ఉలిక్కిపడ్డాను. కరెక్టు...అవును. అందుకే హంతకుడు...

# 5

"డాడీ! ఇన్‌స్పెక్టర్ గారు వస్తున్నారు!" రవి గొంతు యెక్కడ్నుంచో వినిపించింది.

ఇన్‌స్పెక్టర్ బూట్ల శబ్దం దగ్గరలో వినపడింది.

"ఇన్‌స్పెక్టర్! అలా కూచోండి" అన్నాను. కూర్చున్నా డిన్‌స్పెక్టర్.

"ఇన్‌స్పెక్టర్! వాట్ హాపెండ్, ఏమయినా హంతకుడి సమాచారం తెలియటానికి అవకాశముందా సునీత వల్ల?" అడిగేను. నా గొంతులో కొంత ఆత్రుత వుంది.

"నో... కృష్ణమోహన్ గారూ! అస్సలు వీలులేదు!" అన్నా డిన్‌స్పెక్టర్ విచారంగా.

"పోనీ, ఆమె నిన్నరాత్రి యెక్కడ వుందో కనుకున్నారా?" అన్నాను. అయితే హంతకుడు ఆమె కారును నిన్నరాత్రి ఓ అరగంటపాటు ఉపయోగించు కునుంటాడు.

"అయాం సారీ... నేను మీకు సరిగా చెప్పలేదు. నేను వెళ్ళేసరికి అక్కాంటెంటు సునీత హత్య చేయబడింది!!"

అదిరిపడ్డాను! సునీత హత్య చేయబడిందా?!

"వాట్ ఇన్స్... పె... క్టర్! నిజమేనా?"

"పూర్తి నిజం. నేనూ వూహించని షాక్ తిన్నాను!" అన్నా డిన్‌స్పెక్టర్.

"ఇన్‌స్పెక్టర్! అంతా వివరంగా చెప్పండి!" అడిగాను సాలోచనగా.

"...ఏముంది చెప్పటానికి! నేను హంతకుడి సమాచారం తప్పక బయటపడుతుంది అన్న నమ్మకంతో వెళ్ళేను. కాని ఆమె అప్పటికే చంపబడుంది. కత్తితో

చంపబడింది. హంతకుడు వేలిముద్రలు వదిలేంత మూర్ఖుడనుకోను. మా సిబ్బంది పనులన్నీ పూర్తి అయాక ఇక్కడకు వచ్చాను. హత్య జరిగి, నేను వెళ్ళేటప్పటికి ఓ పావుగంటకూడా అయుండదు!..." అన్నాడినస్పెక్టర్ క్లుప్తంగా.

"మీరు సునీత గురించి తెల్సుకున్న వివరాలేమిటి?" అడిగా నాలోచిస్తూ.

"ఆ సునీత వంటరిది. ఆమెకు ఆ స్త్రీమీ లేదు. కాని డబ్బున్నదాన్లా కన్పడుతుంది. అందరికన్నా మాడర్న్‌గా వుండాలని మహా తాపత్రయపడిపోతూ వుంటుంది. రాత్రిళ్లు క్లబ్బులకు తిరుగుతుంటుంది. మీవూహ పూర్తిగా నిజమయింది. ఆమెకు ఓ పాత కారుంది. మీరన్నట్టే దాని ఫ్రంటు డోర్ డామేజిలోవుంది. ఇక హత్య జరిగిన రాత్రి అంటే నిన్న రాత్రి ఆమె 'బ్లూస్టార్' నైట్ క్లబ్బులో వుంది అని తెలిసింది. అంతేకాదు, మరో ముఖ్య విషయం" అన్నాడు ఇన్‌స్పెక్టరు.

"ఏమిటి?" అన్నాను.

"హతుడు అయిన రంగనాథం అదే క్లబ్బుకి వెడుతూంటాడు."

రెండుక్షణాలాలోచించి అన్నాను.

"ఇన్‌స్పెక్టర్! ఈ విషయంలో ఎంత 'ఇంపార్టెన్స్' వుందో మనకు తెలీదు. ఏదేమయినా హంతకుడు సునీతను చంపటంతో...ఆమెకు, అతడికి యేదో సంబంధం వున్నదన్న విషయం నిజం అయింది! ఆమె కారు స్టీరింగుమీద హంతకుడి వేలిముద్రలున్నాయేమో గమనించారా?" అన్నాను.

"నాకూ ఆ అనుమానం వచ్చింది. కాని 'హంతకుడు' ఢక్కా మొక్కీ తిన్న రకంలా వున్నాడు. ఏ చిన్న సాక్ష్యం వదలలేదు."

నిశ్శబ్దంగా నవ్వాను.

"నో...ఇన్‌స్పెక్టర్ హంతకుడు మనము, తనుగూడా వూహించలేని సాక్ష్యం వదిలేసాడు!!" అన్నాను.

"వాట్! సాక్ష్యమా?..." ఇన్‌స్పెక్టర్ నమ్మనట్లు అన్నాడు.

నవ్వి అన్నాను.

"ఎస్ ఇన్‌స్పెక్టర్! కాని ఇదంతా నా వూహ మాత్రమే"అన్నాను.

ఇన్‌స్పెక్టర్ నవ్వేడు!

"మీ మొదటి వూహ నిజమే అయింది, కమాన్... చెప్పండి వివరంగా!"

"అలాగే ఇన్‌స్పెక్టర్! మీకు గుర్తుందిగా. హత్య జరిగిన్నాటి రాత్రి నేను రవి సెకండ్‌షో సినిమానుంచి తిరిగివస్తున్నప్పుడు మా యింటి సమీపంలో....రవి బూట్సులక్రింద గాజు పెంకులు పడ్డాయని చెప్పాను.కాని నేను సామాన్య విషయమైనట్లు చెప్పటంలో మీరా విషయాన్ని పట్టించుకోలేదు. కాని చూడగా అక్కడే వుంది పాయింటు" క్షణం ఆగి అన్నాడు.

"ఈ వీధిలో రెండే రెండు. 'స్ట్రీట్ లైట్స్' వున్నాయి. ఒకటి ఇటుచివర. మరోటి ఆ చివర. ఈ చివర మా ఇల్లు, రంగనాథం యిల్లు ఎదురెదురుగా వున్నాయి. అంటే లైటు మా యింటికి సమీపంలో వుంది. కాబట్టి ఈ ప్రదేశమంతా కాంతివంతంగా

వుంటుంది. అదీగా వుంచి ఈ వీధిలోని ఇళ్ళన్నీ డాబా యిళ్ళు యించుమించు. చాలామంది తమతమ డాబాల మీద నే పడుకుంటారు రాత్రి. 'హంతకుడు' రాత్రి రంగనాథాన్ని చంపటానికి వచ్చేడు. అలాటప్పుడు దురదృష్టవశాత్తూ యెవరయినా చూడటానికి అవకాశముంది. ఇక్కడే లైటు వలన వెలుతురు వుంది కాబట్టి యెవరి దృష్టినయినా పడవచ్చు. ఈవిషయమై హంతకుడు భయపడ్డాడు. అందుకని..."

"ఆ...అందుకని?" రెట్టించే డిన్స్పెక్టర్.

"అందుకని...ఇక్కడి 'బల్బు' హత్య జరిగిననాటి సాయంత్రం పగులగొట్టించేడు హంతకుడు!! అఫ్కోర్స్ వీధి 'ఆ చివర' నున్న లైటునేం చేయలేడు...దాని వలన తనకేం ప్రమాదం లేదని. ఆ లైటు దూరంలో వుంది కూడా!"

ఓ క్షణం తర్వాత అన్నాడు ఇన్స్పెక్టర్.

"అఫ్కోర్స్! మీ వూహా చాలా సమంజసంగా వుంది· కాని ఆ బల్బు బద్దలు గొట్టించటానికి ఈ హంతకుడు యెవర్నో నియమించేడన్నది నిజం! ఆ కొట్టించెవడో మనకెలా తెలుస్తుంది?" అన్నాడు.

"నో...నో...నేనింకా పూర్తిగా చెప్పలేదు. ఇక్కడికి దగ్గరలోనే వో చిన్న లేబర్ కాలనీ వుంది. అక్కడున్న ఇళ్ళన్నీ యించుమించు గుడిశెలే. అక్కడి పిల్లలు కొందరు యీ వీధికి సాధారణంగా సాయంత్రపు వేళల్లో వస్తూంటారని నాకు తెల్సు. నా అనుమానం ప్రకారం హత్య జరిగిననాటి సాయంత్రం హంతకుడు ఆ పిల్లల్లోనే యెవరో ఒకరిని ఈ బల్బు బ్రద్దలుగొట్టేపనికి నియమించి

వుంటాడు. డబ్బులిస్తే పిల్లలు లొంగిపోవటంలో వింత లేదుకదా!'' అన్నాను.

''ఎస్! కరెక్టు! మీరన్నదీ నిజమే...ఈ పని కొంత కష్టమయినా ఫలితం వుంటుందనే నా నమ్మకం! తక్షణం బయలుదేరుతాను'' ఉత్సాహంగా లేచాడు ఇన్‌స్పెక్టర్ వినోద్.

''ఇన్‌స్పెక్టర్... నేనూ రావాలనుకుంటున్నాను!'' మెల్లగా అన్నాను.

''వాట్! శ్రమ. అనవ...''

నవ్వేను. ''నో! ఇన్‌స్పెక్టర్'' ఇంకా యేదో అనబోతుండగా అన్నాడు ఇన్‌స్పెక్టర్.

''దట్సాల్‌రైట్! ఈ కేసులో మీకున్న ఇంట్రస్టుకి మీ సునిశిత పరిశీలనాశక్తికి నా అభినందనలు... పదండి.''

''రవీ!'' కేకేసేను.

రవి వచ్చి నా చేయి అందుకున్నాడు!!

''చంద్రం బాబాయి వున్నాడా యింట్లో?''అడిగేను రవిని.

''లేడు. ఇంతకుక్రితమే బయటికి వెళ్ళాడు'' చెప్పాడు రవి.

# 6

జీపు ఆగింది.

''ఇన్స్పెక్టర్ వినోద్ కిందకు దిగేడు.

''ఇన్స్పెక్టర్! ఇక్కడ చాలామంది పిల్లలుండొచ్చు! మీ పని చాలా కష్టమవుతుందనుకుంటాను. మీ సిబ్బందికి ఫోన్ చేయాల్సింది!'' విచారంగా అంటూ జీప్ దిగేను.

"ఫలితం వుండేదే! కాని 'హంతకుడు' లేకుండా చేసాడు" గొణిగినట్లన్నాడు ఇన్స్పెక్టర్!

ఉలిక్కిపడ్డాను!!

"వాట్ ఇన్స్పెక్టర్! ఏవిఁటి మీరనేది?" అన్నాను తికమకగా. ఎక్కడనుంచో ఏదో 'అలజడి' వినిపించినట్టయింది.

"నేనన్నది నిజమే! ఆ కన్పిస్తున్న ఇంటిముఁదు జనం వున్నారు, పదండి వెళ్దాం! హంతకుడీ సాక్ష్యాన్ని గూడా నాశనం చేసేడు."

ముగ్గురం గబగబా అటు నడిచేము. గుంపులో కల్సేము. ఇన్స్పెక్టర్ అన్నదే నిజమయింది!!

ఎవరిదో స్త్రీ గొంతు గోలుగోలున ఏడుస్తూ విన్పిస్తోంది ఎవరో ఓదారుస్తున్న మాటలు మెల్లగా విన్పిస్తున్నాయి

నిట్టూర్చాను. గుండె నెవరో పిండినట్టయింది.

"కృష్ణమోహన్ గారూ! హంతకుడెంతటి రాక్షసుడో ఇప్పుడే అర్థమవుతోంది నాకు. వాణ్ని వదలకూడదు" ఇన్స్పెక్టర్ ఆవేశంగా అన్నాడు.

"ఇన్స్పెక్టర్! అదెలాగు జరగక తప్పదు. కాని ముందిక్కడి పరిస్థితి చూడండి! ఆ కుర్రాడెలా చంపబడ్డాడు? వయసెంతుంటుంది? క్రమంగా కాకపోతే చెప్పండి?" అన్నాను.

"ఒంటికి చిరిగిన నిక్కరు తప్ప మరేం లేదు. వయసు పదమూడేళ్ళుంటుంది. ఈ గుడిసె గుమ్మానికి లోపలగా పడున్నాడు తడక తలుపువద్ద. కత్తితో చంపబడ్డాడు హత్యకాబడి పది నిముషాలు దాటుండదేమో! హత్యాకి యుధం లేదు. ఆ పక్కనే వున్న చిత్తు కాగితాని.

అంటివున్న నెత్తురు చూస్తుంటే, హంతకుడు కత్తిని దానికి తుడిచి పట్టుకుపోయుంటాడనిపిస్తోంది'' చెప్పేడు ఇన్స్పెక్టర్.

''ఇన్స్పెక్టర్! హంతకుడు చాలా నేర్పుగలవాడిలా వున్నాడు. ముందు మీ సిబ్బందికి కబురు చేస్తే బాగుంటుందేమో!'' అన్నాను.

ఇన్స్పెక్టర్ అలాగేనని వెళ్ళి ఐదునిముషాల్లో తిరిగొచ్చేడు.

అంతవరకు ఆలోచిస్తుండిపోయేను. అప్పుడు ప్రశ్నలు వేయటం మొదలుపెట్టేడు ఇన్స్పెక్టర్.

''చూడమ్మా! నీ కొడుకు పేరేమిటి?''

''సుబ్బడు బాబూ...'' ఏడుస్తూ చెప్పింది కుర్రాడి తల్లి.

''నీ కొడుకు నెవరు హత్య చేసేరు? ఆ సమయంలో నువ్వెక్కడున్నావు?'' అడిగా డిన్స్పెక్టర్.

''ఆ ఎదురింటి అప్పాయమ్మతో ఏదో మాట్లాడ్డాని కెళ్ళేను బాబు. నేనొచ్చేవరకు సుబ్బణ్ణి ఇంట్లోనే వుండమని సెప్పే ఎల్లేనండి. అయినా ఈణ్ణి సంపాల్సి నవుసరమెవురకుంది బాబూ?''

''అక్కడ ఎంత సేపున్నావు?''

''ఓ పదినిమిసాలేనండి.''

''అలాగా! ఈ యింటి పక్కిళ్ళవారికి ఏదైనా కేక లాంటిది వినిపించిందా?'' అడిగా ఇన్స్పెక్టర్ జనాన్నుద్దేశించి.

ఎవరూ మాటాడలేదు.

''పోనీ మీలో యెవరయినా యీ ప్రాంతాల్లో ఖరీ

దైన బట్టలు వేసుకునున్న మనిషిని చూసేరా?''

తిరిగి ఎవరూ పలకలేదు.

ఆలోచనల్లోంచి బయటపడి ఇన్‌స్పెక్టర్‌తో అన్నాను.

''ఇన్‌స్పెక్టర్! ఇక్కడ ఎంతమంది పిల్లలున్నారు?'' అన్నాను.

వెంటనే ఇన్‌స్పెక్టర్ నా వుద్దేశ్యం గ్రహించి వుంటాడు.

ఇక్కడున్న పిల్లల్లో సుబ్బడి ఫ్రెండ్సు వుండవచ్చు. వాళ్ళు హత్యజరిగిననాటి సాయంత్రం సుబ్బడితోనే వుంటే వారికి హంతకుడిని చూచే అవకాశం వుందని నా ఆశ.

ఇన్‌స్పెక్టర్ అడిగి చూసేడు.

వారిలో హత్యకాబడిన సుబ్బడి ఫ్రెండున్న మాట నిజమే. కాని యేమీ చెప్పలేకపోయేరు.

ఇంతలో పోలీసు సిబ్బంది వచ్చి, తమ తమ పనులు చకచక కానివ్వసాగారు.

''ఇన్‌స్పెక్టర్! హంతకుడు ఈ సుబ్బణ్ని ఉపయోగించుకున్నాడని తెలిపోయింది. అంతేకాదు, హంతకుడు చాలా జాగ్రత్తగలవాడు...'' అన్నాను.

''అవును. చాలా అలర్టుగా వుంటున్నాడు హంతకుడు. దట్సాల్ రైట్ మీరు, రవి వెళ్ళి జీప్‌లో కూర్చోండి'' అన్నా డిన్‌స్పెక్టర్.

అలాగేనని నేను, రవి అటు నడిచేం.

''ఛీ! బురద!'' అన్నాడు రవి వున్నట్టుండి.

''ఎందుకు ముట్లేవ్?'' అన్నాను సాలోచనగా,

"కొద్దిగా వుంది. చూసుకోలేదు" రని ఏదో అంటు న్నాడు.

ఉలిక్కిపడ్డాను!! బురద!...బురద...!! ఆలోచనలు గిర్రుమన్నాయి.

"ఇన్‌స్పెక్టర్!" కటిగా కేకేసేను.

"ఎస్! ఇక పదండి! శవాన్నాంబులెన్స్‌లోకి ఎక్కించేయటమయింది."

"నో! అదికాదిన్‌స్పెక్టర్! హంతకుడు'క్లూ'వదిలేసేడు" అన్నాను.

"మైగాడ్! నో! థాంక్ గాడ్!! చెప్పండి ఎక్కడ?" అన్నాడిన్‌స్పెక్టరు సంభ్రమంగా.

"అహ...ఖచ్చితంగా చెప్పలేను. ఇదీ వూహే! మీరు గమనించేరో లేదో యిక్కడి సందు చాలా ఇరుకయినా నేరుగా జీపులో యింతవరకు వచ్చేము. మెయిన్‌రోడ్ నుంచి ఈ పేటలోకి రావాలంటే ఈ ఇరుకు వీధినుంచే దారి. మరో విషయం. మనం జీపులో వస్తున్నప్పుడు యిరుకుసందు మొదట్లో చాలా బురదగా వున్నట్టు చప్పుడుబట్టి గ్రహించేను.

అయితే హంతకుడు మనలా యింతవరకూ కారులో రావటానికి తెగించడు. అది చాలా ప్రమాదం. కాబట్టి తన కారుని మెయిన్‌రోడ్‌లో దూరంగా అపి నడిచి వచ్చేడు. అలాటప్పుడు అతని జోళ్ళగుర్తులు దొరికే అవకాశముంది బురదలో. అతను రోడ్డుకు మధ్యలో నడిచుంటే మన వాహనాల చక్రాలవలన అవి చెరిగిపోయే అవకాశంలేదు. బైదిబై 'ఈ పన్లన్నీ' యింత క్విక్‌గా చేస్తున్నాడంటే అతనికి వో కారు వుందని నా అభి

ప్రాయం...'' ముగించేను చెప్పటం.

ఇన్ స్పెక్టర్ పరుగా తేడు సిబ్బందివద్దకు.

ఆత్రుతతో వుండిపోయానలాగే.

పది నిమిషాల అనంతరం ఇన్ స్పెక్టరు కేక ఆనందంగా వినిపించింది.

# 7

''కూర్చోండి ఇన్ స్పెక్టర్! ఏమైంది?'' ఆతురతగా ప్రశ్నించేను.

ఇన్ స్పెక్టర్ వినోద్ ఉస్సురంటూ కూర్చున్నాడు.

నా ఆలోచన ప్రకారమే ఇన్ స్పెక్టర్ కి అక్కడి బురదలో ఒకచోట ఒక బూటుముద్ర దొరికింది. అది ఫుల్ గా వుంది.

ఇంకా రెండుమూడుచోట్ల అటువంటివే బూట్సు ముద్రలు దొరికేయి. కాని అవి ఫుల్ గా లేవు. కారణం పోలీస్ జీపు అంబులెన్స్ వాటిపైనుంచే నడిచేయి. అందుచేతనే అవి 'కట్' అయిపోయేయి.

ఫుల్ గా దొరికిన బూటు ప్రింటుకి ఫోటోలు,కొలతలు తీయించేడు ఇన్ స్పెక్టర్. దాని ప్రింటు లోతుగా, క్లియర్ గా వుంది. చూస్తుంటే కొత్తబూటు అని అనిపిస్తోందన్నాడు ఇన్ స్పెక్టర్.

ఆ బూటు ముద్ర తప్పకుండా 'హంతకుడి'దే అయ్యుంటుందన్న నమ్మకం మాకుంది.

''ఇన్ స్పెక్టర్! ఏమయిందో చెప్పండి!'' అన్నాను.

ఇన్ స్పెక్టర్ చెప్పటం మొదలుపెట్టేడు.

''అంతా క్షుణ్ణంగా కనుక్కున్నాను. ఆ మోడల్ బూట్సు ఈ వూరిలో ఒక్క ''విజయా షూ మార్టు''

నుండి విడుదలయ్యేయి. అవి కొత్తమోడల్ బూట్సు. మనకు దొరికిన ప్రింటునుబట్టి హంతకుడు కొత్తబూట్లు కొని ఒక వారంకన్న యెక్కువయుండదని తెలుస్తోంది.

రెండు నెలలక్రితం ఆ రకం బూట్సు ఆ షాపుకి వారి కంపెనీనుండి చాలా వచ్చాయి. అయితే వచ్చిన పదో రోజు లోపలే అన్నీ అమ్ముడయ్యేయి. కాని ఒక్క జత మాత్రం అమ్ముడవ లేదుట. వాటిని షో కేసులో వుంచే కారుట. ఆ జత ఏడెనిమిది రోజుల క్రితమే అమ్ముడ యింది. ఆ జత కొన్నవాడే హంతకుడు....!!" తాపీగా అన్నాడు ఇన్‌స్పెక్టర్ వినోద్.

ఆశ్చర్యంగా అన్నాను.

"డియర్ యిన్‌స్పెక్టర్! అవి కొన్నతనే హంతకుడని స్పష్టమేమిటి? చాలా బూట్సు అమ్ముడయ్యేయి. వాటి లోదే అవ్వవచ్చుగదా ఈ ప్రింటు. అన్నీ అమ్ముడయి రెండునెల్లవలేదన్నారు. కాబట్టి వాటి ప్రింటు 'కొత్త బూట్సు' ప్రింటులాగే అవవచ్చు."

వినోద్ చిన్నగా నవ్వాడు.

"నో! మనకు దొరికిన బూటుముద్ర హంతకుడిదేనని, అంటే వారం రోజులక్రితం అమ్ముడయిన 'బూటు' అని రుజావుచేయగలను. నేను షాపతన్నడిగి ఆ మోడల్ బూట్సుల 'పిక్చర్' అడిగి తీసుకున్నాను. ఇదిగో ఆ కాగితం..." అని జేబునుంచి ఓ కాగితంతీసి టీపాయ్ మీదుంచేడు యిన్‌స్పెక్టర్.

"యీ మోడల్ బూట్సుల మడమ అంటే హీల్సు మీదన్నమాట...రెండేసి రబ్బర్ "బొడిపెలు" సూదిగా వుంటాయి. అయితే ఇక్కడే వుంది పాయింటు! కంపెనీ

నుండి షాపుకి ఆ బూట్సు సరిగా రెండు నెలల క్రితమే వచ్చేయి. అంటే అరవై రోజుల క్రితం అన్నమాట. వచ్చిన పదోరోజుకే ఒకే ఒక జతతప్ప అన్నీ అమ్ముడయి పోయేయి. ఆ మిగిలిన జత వారం రోజుల క్రితమే యెవరికో అమ్ముడయింది.

అంటే మిగతా బూట్సు అన్నీ సుమారు రెండు నెలలు ఉపయోగింపబడ్డాయన్నమాట. రెండు నెలలు ఉపయోగిస్తే ఈ మోడల్ బూట్సు 'హీల్స్' మీదున్న ఆ రెండు రబ్బర్ 'బొడిపెలు' అరిగిపోవటం ఖాయం. కాని మనకు దొరికిన ప్రింటుమీద ఆ రబ్బర్ బొడిపెలు స్పష్టంగా, అచ్చుగుద్దినట్లు వున్నాయి. అవి నేలలో సూదిగా లోతుగా వున్నాయి. సో...!" అన్నాడు వినోద్.

ఆలోచిస్తూ వుండిపోయేను.

"ఆ షాపులో గణేశ్ అని ఒక పనివాడున్నాడు. అతనే వారంరోజుల క్రితం 'ఆ బూట్సు' సైజ్ చూసి, పాక్ చేసి ఇచ్చాడు. అతను 'హంతకుడి'ని గుర్తుపట్ట గలడు" అన్నాడు ఇన్ స్పెక్టరు.

"కాని దానివలన మనకున్న లాభం ఏమిటి?" అడిగేను.

"అఫ్ కోర్స్ ... కాని హంతకుడిని గుర్తించగల సాక్ష్యం ఒకటుంది. ఎప్పటికయినా ఆ గణేశ్ కంట పడకమానడు హంతకుడు."

నవ్వేను.

"సారీ...ఇన్స్పెక్టర్...మీ వూహ విచిత్రంగావుంది. ఈ మోడల్ బూట్స్ యీ వూళ్లోనే అమ్ముడవు

తాయా? వారం రోజుల క్రితం మరే వూరిలోనూ ఆ బూట్సు కొనుక్కొని ఇక్కడకు వచ్చి వుండొచ్చుగదా ...అలాటప్పుడు...!" అంటూ ఆపేసాను.

"మీ వూహ కరక్టే. నాకూ తెల్సావిషయం! కాని తమవద్ద వారం రోజుల క్రితం 'ఆ జత' కొన్నమనిషి గణేశ్ కంటపడితే అతణ్ని వెన్నాడి జాడ కనుక్కుంటాడు. అప్పుడు మనం వల వేస్తాం. 'అతడు' నిజంగా హంతకుడయితే వలలో చిక్కుకుంటాడు" నవ్వి అన్నాడినస్పెక్టరు.

ఇనస్పెక్టరన్నది నిజమేననిపించింది.

"అయినా ఈ కేసు రానురాను విసుగుపుట్టిస్తోంది. ఆ సూరత్ బ్యాంకు మానేజరు రంగనాధం తన చావును తనే కొనితెచ్చుకున్నాడు!" అన్నాడినస్పెక్టరు వినోద్ విసుగ్గా.

ఆశ్చర్యపడ్డాను.

"అదెలా ఇన్ స్పెక్టర్?" అన్నాను.

"అవునండీ! అంతేమరి. ఆ రాత్రి రంగనాధం తాగుడు మైకంలో వీధి తలుపేసుకోవటం మర్చిపోయేడు. లేకపోతే హంతకుడు రావటానికి మరో దారి ఛస్తే లేదు. పెరడు తలుపువున్నా చాలా బలమయినది."

అదిరిపడ్డాను ఆ మాటలతో.!!

"ఇనస్పెక్టర్! అలా అని ఎవరు చెప్పేరు మీతో?"

"నవుకరు మహావీర్!"

"ఇన్స్పెక్టర్! మీరు పొరబడ్డారు. ఒక విషయం ఆలోచించేరా?"

"ఏమిటది?"

"రంగనాథం తలుపేసుకోవటం మర్చిపోయేదే అను కుందాం! మరి ఆ విషయం హంతకుడికెలా తెల్సి హత్యకు వచ్చేడు? ఎలా వూహించగలడు? పోనీ ఏదో కాకతాళీ యంగా జరిగిందనుకుందాం. కాని ఆ రాత్రి రంగనాథం తలుపులు వేసుకున్నాడు!!" అన్నాను స్థిరంగా.

షాక్ తినుంటూ డిన స్పెక్టరు.

"మైగాడ్, మీకెలా తెల్సు?" అన్నా డాశ్చర్యంగా. గంభీరంగా తల పంకించేను.

"అవును! ఆదేరాత్రి నేను రవి సెకండ్ షో కెళ్ళా మన్న విషయం మీకు తెల్సు. ఆనాటి సాయంత్రం నా హాండ్ స్టిక్కు బాల్కనీలో వదిలేసేను. రవి నన్ను సడన్ గా సినిమాకు లేవదీసాడు. అపుడు డ్రస్ మార్చు కుని బాల్కనీలోకి వెళ్ళేను హాండ్ స్టిక్ కోసం. రవి కూడా నా వెంట వున్నాడు. అప్పుడే రంగనాథం తలుపు వేసిన శబ్దం నేను స్పష్టంగా విన్నాను..."

"యస్ ఇన్స్పెక్టర్! రంగనాథంగారితో నవుకరు మహావీర్ ఏదో అంటూ ఫెన్సింగ్ గేటు వేసుకుని వెళ్ళి పోవటంగూడా నేను చూసేను." అన్నాడు అక్కడే వున్న రవి.

"రంగనాథం నిజానికి జాగ్రత్తగలవాడే! రెండు మూడుసార్లుఅతనలా తలుపులేసుకోవటం నేనెరుగున్నాను. నేను రాత్రి పదివరకు నిద్రపోను. బాల్కనీలో ఎక్కువ సమయం గడపటం నా కలవాటు" అన్నాను.

"మరి ఆ విషయం మీరు, నేను నవుకరు మహావీర్ ని ప్రశ్నిస్తున్నపుడే ఎందుకు చెప్పలేదు?" అడిగేడు ఇన్స్పెక్టరు.

''అయాంసారి ఇన్స్పెక్టర్! ఆ సమయంలో నేనాలో చనల్లో వుండివుంటాను. అయినా హంతకుడు మన చేతుల్లో పడ్డట్టే! బహుశా, హంతకుడు తను రంగనాథం ఇంటిలో దూరలేనని గ్రహించివుంటాడు. అందుకే మహవీర్ ని డబ్బులో వల్లో వేసుకునుంటాడు.

కాబట్టి, ఆ రాత్రి మహవీర్ ఇంటివెనక తలుపు గడియ తీసే వుంచేడు. అతనే వెళ్ళిపోయే ముందు తలుపులన్నీ వేస్తాడు కాబట్టి, రంగనాథం మహవీర్ పోయాక వీధి తలుపులు వేసేసుకుని తాగటానికుపక్రమించేడు. మేము సినిమానుంచి తిరిగి వచ్చే సమయంలో హంతకుడు వెనుక మహవీర్ గడియ తీసివుంచిన ద్వారంగుండా వచ్చి ఆ తలుపు గడియ పెట్టేసి, రంగనాథాన్ని హత్యజేసి, వీధి తలుపులు తెరుచుకుని వెళ్ళిపోయేడు'' అన్నాను.

''వచ్చిన దారినుంచే పోవచ్చుగదా?''

''నో, అలా చేస్తే పోలీసులకు తప్పక మహవీర్ మీద అనుమానం వస్తుంది. కాబట్టే ఇలా చేసేడు. కాని రంగనాథం తలుపులేసుకోవటం మాకు తెల్సని 'అతనికి' తెలీదు'' అన్నాను.

''థాంక్ గాడ్! కృష్ణమోహన్ గారూ, ఇంత కేసూ మీ వలనే నడిచింది. ఇక హంతకుడు దొరికినట్టే. ఇప్పుడే వెళ్ళి మహవీర్ గాణ్ణుంచి వివరాలు కక్కిస్తాను. బైదిబై మీరూ రాకూడదూ'' అన్నాడిన స్పెక్టరు వినోద్ వుత్సాహంగా లేచి.

నవ్వేను.

''నేనూ అదే అడుగుదామనుకుంటున్నాను. పదండి! రవీ!'' రవినిపిల్చి హాండ్ స్టిక్ అందుకున్నాను.

# 8

జీపు ఆగింది!

కైమ్ తడువుకున్నాను! సాయంత్రం ఆరయింది. శీతా కాలం అవటంతో చల్లని గాలి మెల్లగా వీస్తోంది.

"ఇన్ స్పెక్టర్! ఇక్కడ జనసంచారం ఏమాత్రం వుంది?" అన్నాను జీపు దిగుతూ. రవి నా చేయి పట్టుకు తనూ దిగేడు.

ఇన్ స్పెక్టర్ వినోద్ క్రిందకు దిగేడు. చుట్టూ పరిశీలించి చూసేడేమో క్షణం తర్వాత అన్నాడు.

"జనసంచారం అంతగా లేదు. మనం దిగిన రోడ్డు చాలా ఇరుగ్గా వుంది. ఇళ్ళన్నీ దగ్గరదగ్గరగా వున్నాయి. కొన్ని ఖరీదైన మేడలుగూడా కనుపిస్తున్నాయ్. రండి అదుగో అదే మహావీర్ యిల్లు అయివుంటుంది. వాడింట్లో వున్నాడో, లేడో!" ఇన్ స్పెక్టర్ నడుస్తున్న శబ్దమయింది.

రవితో మెల్లగా నడవసాగాను.

ఇన్ స్పెక్టర్ రెండు మూడు మెట్లు ఎక్కినట్టు బూట్ల శబ్దమయింది.

"నాన్నా! మెట్లు ఎక్కండి" రవి మాటలు వినిపించాయి.

తడువుకుని మెట్లెక్కేను!

"మహావీర్ !!" ఇన్ స్పెక్టర్ కేక విన్పించింది.

చుట్టూ నిశ్శబ్దం!

నో రెస్పాన్స్!!

"మహావీర్!" మళ్ళీ పిల్చేడు ఇన్ స్పెక్టర్.

మళ్ళీ సమాధానం లేదు.

క్షణం నిశ్శబ్దం. తర్వాత ఇన్ స్పెక్టర్ తలుపుమీద తట్టాడేమో! టక్...టక్ మని శబ్దమయింది.

మరో క్షణం తర్వాత కిర్రుమని శబ్దమయింది.

"మై... గా... డ్... బాడ్... లక్..." ఇన్ స్పెక్టర్ గొంతు నీరసంగా వినవచ్చింది.

ఉలిక్కి పడ్డాను! టూ లేట్ అయిందా?

"వాట్ ఇన్ స్పెక్టర్?"

"ఇంకేముంది? హత్య!! గదిలోని మంచంలో చచ్చి పడున్నాడు మహావీర్! కత్తితో చంపబడ్డాడు! హత్యా యుధం లేదు! రక్తం యింకా కింతవ స్రవిస్తూనే వుంది. బహుశ, హత్య కాబడి పది నిమిషాలు గూడా అయుండదు!!"

అదిరిపడ్డాను!! తల తిరిగినట్టయింది.

"కృష్ణమోహన్ గారూ! నాకేమీ అర్థం కాకుండా పోతోంది. ఎవరా హంతకుడు? అసలీ హత్యలకు మూల కారణం ఏమిటి? హంతకుడికి ఎలా తెల్సింది మనం మహావీర్ వద్దకు వస్తామని?" అన్నాడు ఇన్ స్పెక్టర్.

అవును. అదే... అదే... ఆ ఒకే ప్రశ్న నాకూ పిచ్చెక్కి నట్టు చేస్తోంది.

ఒకే ఒక ప్రశ్న తలలో గింగుర్లు తిరుగుతూ కుమ్మరి పురుగులా తొలిచేస్తోంది.

ఆ ప్రశ్నకు సమాధానం తప్ప మరే సాక్ష్యం హంత కుడిని పట్టివ్వ లేదు!

"ఇన్ స్పెక్టర్! హంతకుడు తన కారులో వచ్చేడన టంలో సందేహం లేదు. అతన్నిగాని, కారునిగాని ఎవ రైనా చూశారేమో ప్రయత్నించి చూడండి!" అన్నాను నిట్టూరుస్తూ.

మరో పదినిమిషాలకి పోలీస్ సిబ్బంది వచ్చింది.

అన్ని తతంగాలు ముగిసేయి!! అటువైపు కారు ఏదీ

రాలేదని తెలిసింది.

"ఇక బయలుదేరుదాం!" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"ఇన్‌స్పెక్టర్!" గంభీరంగా అన్నాను.

"మీరు వెంటనే బయలుదేరి హంతకుడిని గురుపట్టగల వాడు, చివరి సాక్షి అయిన గణేశ్ వద్దకు వెళ్ళండి. అతనిప్పుడెక్కడుంటాడు?" అడిగేను.

"ఈ సమయంలో యింట్లోనే వుంటాడు. సాయంత్రం ఆరుతోనే తను షాపు విడిచి ఇంటికి పోతానని చెప్పేడు. వైదిబై దేనికి?"

"ఇన్‌స్పెక్టర్! నా అనుమానమే నిజమయితే ఈ పాటికి కతను హత్య చేయబడుంటాడు!" నిట్టూర్చి అన్నాను.

"వాట్? ఏవిఁటి మీరనేది? గణేశ్ హత్య చేయబడుంటాడా?" అత్యాశ్చర్యంతో అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"అవును. అదే జరిగుంటుంది నా వూహ ప్రకారం. క్విక్ మీరు వెళ్ళండి. ఏ విషయం మా యింట్లో ఫోనుంది కాబట్టి ఫోన్ చేయండి" అన్నాను.

ఇన్‌స్పెక్టర్, నన్ను రవిని యింటివద్ద దించేయమని సార్జంటుతో చెప్పి, తను జీప్ వేపు పరుగెత్తేడు.

నా మనసంతా మొద్దుబారినట్టయింది!

# 9

సోఫాలో కూర్చున్నాను. రవి అక్కడేవున్న మరో సోఫాలో కూర్చునున్నాడు. అపుడపుడూ యేదో మాట్టాడుతున్నాడు.

కాని నా మనసంతా నిర్జీవంగా వుంది.

శరీరంలో ఏదో కంపన. పిచ్చివాణ్నవుతానేమోనన్పిస్తోంది.

కాని...కాని...ఇంతవరకు మెదడును తొలిచిన ప్రశ్న ఇపుడు లేదు. కారణం దానికి సమాధానం దొరకటమే!! అదే నిజమయితే హంతకుడు నా యింట్లోనే...

కాని యే కోణంనుండి చూసినా, ఎలా ఆలోచించినా అదే సమాధానం! ఆ సమాధానమే నిజమన్న 'నిజం' నన్ను పిచ్చివాణ్ణి చేస్తోంది!

ఏదో తెలియని నీరసం ఆవరిస్తోంది, క్షణక్షణానికీ.

ట్రింగ్...ట్రింగ్ మని ఫోను మోగిన శబ్దం నన్ను బయటి ప్రపంచంలోకి విసిరేసింది ఆలోచనల్లోంచి.

చటుక్కున ముందుకు వంగి రిసీవర్ అందుకున్నాను.

"హలో...ఇన్స్పెక్టర్...నేనే కృష్ణమోహన్..." అన్నాను.

"ఎస్! పోలీస్ స్టేషన్ నుంచి" అట్నుంచి ఇన్స్పెక్టర్ వినోద్ గొంతు విన్పించింది.

"ఇన్స్పెక్టర్ ఏమయింది?" ఆత్రుతగా అన్నాను. మనసు కంపిస్తోంది.

"చ్చ్!...మీ వూహే నిజమయింది. హంతకుడు గణేశ్ ను చంపేసేడు. నేను వెళ్ళేసరికి హత్య జరిగి పోయింది" ఏదో అంటున్నాడింకా.

జారిపోబోతున్న రిసీవర్ ని గట్టిగా పట్టుకున్నాను.

"ఇన్స్పెక్టర్! మీరు తక్షణం బయలుదేరి ఇక్కడకు రండి. హంతకుడు యింతవరకు సాక్ష్యాలను నాశనం చేసేడు. కాని దానివలననే తనను బయటపెట్టుకున్నాడు. ఇన్స్పెక్టర్! హంతకుడు మరెవరో కాదు..." నేనా మాట పూర్తిచేయకముందే యెవరో చేతిలోని రిసీవర్ ని బలంగా తుళ్ళగొట్టేరు.

పక్కకు పడబోయి నిలదొక్కుకున్నాను. నా హేండ్

స్టిక్ పడిపోయింది.

ఎవరో చిన్నగా నవ్విన శబ్దమయింది.

"నాయర్!!" అన్నాను.

"ఒరేయ్..." రవి గొంతు ఆశ్చర్యంగా విని పించింది.

"షటప్!!" కర్కశంగా అన్నాడు వంటవాడు నాయర్.

"హేయ్, గుడ్డీ! నే చెప్పినట్టు విను. నా చేతిలో కత్తి వుంది. నో టైమ్! ఇన్స్పెక్టర్ వచ్చేస్తాడు లేక పోతే పదండి" నాయర్ నా హాండ్ స్టిక్ అందించి, రవి చేయి పట్టుకుని నడిచేడు.

నన్ను మా కారు బాక్ సీట్లో కూర్చోమని, రవితో ముందు సీట్లో కూర్చున్నాడు తను. కారు బయలు దేరింది.

కారు మూడు నిమిషాలు మాత్రమే ప్రయాణించి ఆగింది. బహుశా, రెండు మూడు వీధుల్లో మాత్రమే ప్రయాణించి వుంటుందని మాత్రమే వూహించేను.

నాయర్, రవి చేయి పట్టుకునే నన్ను మూడు మెట్లు ఎక్కించి, తాళంతీసి, యింట్లో కదుగుపెట్టేడు.

తలుపు గడియపెట్టేసి, మరో గదిలోకి తీసు కెళ్ళాడు.

మౌనంగా అతను చెప్పినట్టు చేస్తున్నాను.

నేను బలహీనుణ్ని కాను. కాని గుడ్డివాణ్ని!

ఆ ఒక్క లోపం నన్ను పూర్తి నిర్వీర్యుణ్ని చేస్తోంది.

"నాయర్! ఈ యిల్లు...?" అన్నాను.

"మీ సమాధి!!" నాయర్ నవ్వేడు.

"నిజానికి నేనిన్ని హత్యలు చేసేవాణ్ని కాదు. మీరే చేయించేరు. ఆ రోజు మీరు సినిమాకు పోవటమే నాకిన్ని చిక్కులు తెచ్చింది. ఎన్నో సాక్ష్యాలు బయట బడ్డాయి. కేవలం ఒక్క హత్యని మాపుకుందుకు యిన్ని హత్యలు చేసేను. కాని గుడ్డివాడివయినా నువ్వు చాలా తెలివైనవాడివి. అందుకే నిన్నో కంట కనిపెడుతూ వున్నాను" అన్నాడు నాయర్.

"మమ్మల్నిప్పుడేం చేస్తావ్?"

"అన్ని సాక్ష్యాల్లానే.. నిర్మూలిస్తాను" నాయర్ నింపాదిగా అన్నాడు.

"మొదటనే నిన్ను చంపేస్తే కథ ఇందాకా వచ్చేది కాదు. నేను సాధించాలనుకున్నదానికి ఎన్ని అడ్డులున్నా తొలగించుకుని సాధిస్తాను. ఇంతటితో అన్ని సాక్ష్యాలు ముగుస్తాయి" నవ్వేడు నాయర్ మళ్ళీ.

నిర్వ్వెరపోయేను. ఈ మాయప్రపంచంలో యింతటి కర్కోటకులుకూడా వుంటారని యిప్పుడే తెలుస్తోంది.

"నాయర్! ఇన్స్పెక్టర్ గారు... ఈసరికి మనింటికి వచ్చేవుంటారు. ఇంకొద్దిసేపట్లో యిక్కడకు వచ్చి నిన్ను పట్టుకుంటారు" అన్నాడు రవి బింకంగా.

పకపక నవ్వేడు నాయర్.

"ఒకే, బుడుంకాయ్! నువ్వు నీ తండ్రి కేమాత్రం తీసిపోవని నాకు తెల్సు. ఇన్స్పెక్టరిక్కడికి రావటం కల్ల... ఈ కత్తితో మిమ్మల్నిక్కడ చంపిపారేస్తే, యింతటితో అన్ని సాక్ష్యాలు నాశనమవుతాయ్. ఇన్స్పెక్టర్ యిక ముందుకు పోలేడు. మిమ్మల్ని చంపేసేనన్న బాధ నా కేమాత్రం వుండదు. నిండా మునిగాక..."

నాయర్ మాటలు పూర్తికాలేదు.

నా చేతిలోని కర్రను బలంగా లేపేను.

ఆ దెబ్బ నాయర్ చేతిమీద తగిలుంటుంది. కత్తి యెగిరిపడిన శబ్దమైంది.

"యూ బ్లడీ...బ్లయిండ్ బాస్టర్డ్..." బాధగా అరిచేడు.

అతను తేరుకోకముందే చేతులు చాస్తూ ముందుకు దూకేను.

నాయర్ శరీరం తగిలింది.

రెండు చేతుల్తోను అతన్ని బలంగా బిగించేను.

నా కళ్ళకున్న గ్లాసెస్ నేలకు జారి శబ్దం జేసేయి.

నా నుదిటిపై బలంగా ఢీ కొట్టేడు నాయర్ గింజు కుంటూ.

గుడ్డివాణ్నయినా కళ్ళముందు చుక్కలు మెరిసి నట్టయింది.

బాధలోనే "ఒరే రవీ, రాస్కెల్! చూస్తావేం? తలుపులు తెరుచుకుని పారిపో" గట్టిగా అరిచేను.

నాయర్ అరుస్తూ, కాళ్ళతో తన్నుతూ, విదిలించ టానికి విశ్వప్రయత్నం చేస్తున్నాడు.

"డాడీ!" రవి భయంగా అరిచేడు.

"నోర్మూయ్! బ్లడీసన్ పారిపో!"

రవి పరిగెత్తిన శబ్దమయింది. ఆ క్షణంలోనే ఎక్కడో దబదబ శబ్దం, తలుపులు తెరిచిన శబ్దం, మరుక్షణం బూట్ల చప్పుడు...

"మిస్టర్, నాయర్! ఇక నీ ప్రయత్నం మాని బుద్ధిగా లొంగిపో. ఇక్కడే కాదు, ఈ యింటిచుట్టూ పోలీసు లున్నారు" ఇన్స్పెక్టర్ వినోద్ గొంతు గట్టిగా విని పించింది.

# 10

నాయర్ పగటిపూట వంటవాడే గాని, రాత్రిపూట ట్రిమ్‌గా తయారై నైట్ క్లబ్‌లకు వెళ్తుంటాడు. అప్పుడే అతనికి సూరత్ బ్యాంకులో అకౌంటెంట్ అయిన సునీతతో పరిచయముయింది. అయితే అతనికి క్లబ్బులలో తిరిగెయ్యటానికి, సునీతతో షికార్లు కొట్టడానికి బాగా డబ్బు కావాలి.

రంగనాథంకి నలభయ్ ఏళ్ళుంటాయి. మంచి ఆస్తిపరుడు. మహావీర్ ద్వారా అతని ఆస్తిపాస్తులు తెలుసుకున్నాడు. ముఖ్యంగా ఆ రోజు రంగనాథం ఏదో పని మీద యాభై వేలు తెచ్చి ఇంట్లో పెట్టాడు.

ఆ రాత్రి...

నాయర్ క్లబ్‌లో వున్న సునీతను అడిగి కారు తీసుకున్నాడు.

క్లబ్ నుండి సునీత కారులో బయలుదేరాడు దొంగతనానికి. కాని రంగనాథం అప్పటికి నిద్రపోకుండా, త్రాగుతూ కూర్చోవటంవల్ల తప్పనిసరిగా అతనిని చంపవలసి వచ్చింది.

అప్పుడే నేను, రవి సెకండ్ షో సినిమానుండి వస్తున్నాం. అప్పుడే నేను కారు శబ్దం వినటం జరిగింది.

మొదటిసారి ఇన్స్‌పెక్టర్ నన్ను కలవటం నాయర్ చూసి ఆశ్చర్యపడ్డాడుకూడా! మా మాటలు విన్నాడు.

ఆ మెకలన కారు తను వాడిన విషయం తప్పక బయటపడుతుందని నాయర్ భయపడ్డాడు. అందుకే సునీతని హత్యచేసేడు.

కాని మరో సాక్ష్యం బయల్పడింది, గాజు పెంకుల వలన. ప్రక్క వీధే కాబట్టి ఇన్స్‌పెక్టర్ కన్నా ముందుగా పోయి ఆ సాక్ష్యాన్ని నిర్మూలించేను.

అప్పటికే నాలో ఒక ప్రశ్న ఉదయించింది. హంతకుడికి నేను, ఇన్స్పెక్టర్ మాట్లాడుకున్నదెలా తెలుస్తుందా అని.

ఎందుకంటే, నేను ఇన్స్పెక్టరు మాట్లాడుకున్నది మా యింట్లో. సునీత కారుశబ్దం, రవి కాళ్ళకింద గాజు పెంకులు పడటం హంతకుడికెలా తెలుస్తుంది? అదే నా కాశ్చర్యం కలిగించింది.

అయితే మహవీర్, గణేశ్ హత్యలతో హంతకుణ్ని నే నూహించేను. నాయర్ యీమధ్యనే కొనుక్కున్న కొత్తబూట్లు మరో సాక్ష్యాన్నిచ్చేయి.

నేనిది వూహిస్తానని నాయర్ గ్రహించి వుంటాడు. అందుకే మిగిలిన చివరిసాక్ష్యాలము మేమేనని మమ్మల్నీ హత్య చేయబోయేడు, తను ముందే ఏర్పాటుచేసిన ఇంట్లో. కాని నా ఫోన్ అందుకున్న ఇన్స్పెక్టర్ వెంటనే వచ్చేడు. అప్పటికి నాయర్ మమ్మల్ను కారులో తీసుకుపోయేడుకాని, అతని దురదృష్టంవలన మా కారుని చూసే ఇన్స్పెక్టర్ వినోద్ అక్కడికి రాగలిగేడు.

ఎంత ప్రయత్నించినా హంతకుడు చట్టంనుండి తప్పించుకోలేకపోయేడు. మహవీర్ చేతులకు బేడీలు పడ్డాయ్.

నాయర్ కు వురిశిక్ష పడింది!!

—: ఐపోయింది :—

# "కసికసిగా చంపాలనుంది!"

## మల్లేశ్వరరావు

"డాక్టర్! మీరు నిజమే చెబుతున్నారా?" ఆందోళనగా అడిగాడు ప్రతాప్.

అతని చేతిలో సిగరెట్టు ఎర్రగా మండుతోంది.

"యస్! అయామ్ టెల్లింగ్ ట్రూ" అన్నాడు డాక్టర్ చంద్రశేఖర్ మెల్లగా.

"మీరు పొరబడుతున్నారేమో!" తన అనుమానాన్ని వ్యక్తం చేసాడు.

"నో! అలా అనుకునే ఒకటికి, రెండుసార్లు పరీక్షించాను."

ప్రతాప్ లేచి నిలబడ్డాడు.

అతని మొహం కళ తప్పింది.

"అయామ్ సారీ!" అన్నాడు డాక్టర్ చంద్రశేఖర్ విచారంగా.

విరక్తిగా నవ్వి, నర్సింగ్ హోమ్‌లోంచి బయట పడ్డాడు ప్రతాప్.

సిగరెట్‌ను ఆఖరి దమ్ము లాగి, నేలకేసి కొట్టి బూటు కాలితో నలిపి ఆర్పాడు ప్రతాప్.

ప్రతాప్‌కి ముప్పై అయిదేళ్ళ వయసు వుంటుంది. ఎత్తుగా, ఛామనఛాయ రంగులో వుంటాడు. కళ్ళు ఎర్రగా, చింతనిప్పుల్లాగ వున్నాయి. జుత్తు అస్తవ్యస్తంగా ముఖంమీద పడివుంది.

అడుగులు మెల్లగా పడుతున్నాయి.

జగమే మాయ...

బ్రతుకే మాయ...

సినిమా బండిలోనుంచి పాట వినిపిస్తోంది ప్రతాప్‌కి. బండి అతని వెనకాలే రాసాగింది.

అతనికి తలనొప్పి అనిపించింది.

చటుక్కున ఆగిపోయాడు.

సినిమా బండి అతన్ని దాటుకుని వెళ్ళిపోయింది.

వేదాంతం అంటే అతనికి నచ్చదు.

ఎవరిదో గొంతు వినిపించి ప్రక్కకి చూసాడు.

చెట్టు నీడలో ఒక వ్యక్తి ఎవరికో జ్యోతిష్యం చెబుతున్నాడు.

ఆ వ్యక్తికి జోతిష్యం చెప్పడం పూర్తయినట్టుంది. అతను లేచి వెళ్ళిపోయాడు.

ప్రతాప్ అటువేపు నడిచాడు.

అతనివేపు చూసాడు.

మెడలో రుద్రాక్షమాల, నుదుటమీద విభూదిరేఖలు, కళ్ళల్లో తేజస్సు, అతని ముందు కొన్ని తాటిరేకులున్నాయి. అవి అన్నీ నేలమీద వరుసగా పేర్చబడి వున్నాయి. ఆ తాటిరేకులకు ఎదురుగా ఓ చిన్న బోనులో చిలక వుంది.

ప్రతాప్ యిదివరకెన్నడూ జోస్యం చెప్పించుకోలేదు. ఈసారి జ్యోతిష్కుడిని కొన్ని ప్రశ్నలు అడగాలనుకుంటున్నాడు.

"ఏం బాబూ! జోస్యం చెప్పించుకుంటారా?" అని అడిగాడు జోతిష్కుడు.

అవునన్నట్టు తలాడించాడు.

"రండి బాబూ!" అని పిలిచాడు. కూర్చోమన్నట్టు సంజ్ఞ చేసాడు.

అతను కూర్చున్నాడు.

"చెయి చూసి చెప్పమంటారా? లేక చిలక జోస్యం అయినా పరవాలేదా?"

"నీ యిష్టం"

"౩ రూపాయి యిటివ్వండి" అన్నాడతడు.

అతను తీసిచ్చాడు. దాన్ని మొలలో దోపుకున్నాడు.

"చెయి యివ్వండి—" అన్నాడతను.

తన కుడిచేతిని జ్యోతిష్కుడి చేతిలో వుంచాడు ప్రతాప్.

ప్రతాప్ చేతిలోనికి చూసాడు తీక్షణంగా. రేఖలు పరికించాడు. ఏవో గుణించుకున్నాడు.

అలా గుణించుకుంటున్న జ్యోతిష్కుడి కనుబొమలు ముడిపడ్డాయి.

అతని ముఖ కవళికలు గమనిస్తున్న ప్రతాప్—

"ఎలా వుంది నా జాతకం?" అని ప్రశ్నించాడు.

జ్యోతిష్కుడు ప్రతాప్ మొహంలోకి అదోలా చూసాడు.

ఆ చూపుకి అర్థం తెలుసుకున్నాడు ప్రతాప్. కాని అతనెందుకలా చూస్తున్నాడో తెలియలేదు ప్రతాప్‌కి.

"చెప్పవేం?" మళ్ళీ అడిగాడు.

"చెప్పలేను"

"ఏం?"

"బాబూ! దయచేసి తమరు యింకెక్కడా జ్యోతిష్యం చెప్పించుకోకండి" అని అన్నాడు అతను ప్రతాప్ చెయ్యి వదిలేస్తూ.

"ఎందువల్ల?"

"అది చెప్పకూడదు"

"రెండు రూపాయలిస్తాను. చెప్పు" ఆశ చూపించేడు.

"రెండు కాదు—పది రూపాయలిచ్చినా ఏ జ్యోతిష్కుడూ చెప్పడు."

అతనెందుకు జోస్యం చెప్పడం లేదో అర్థమైంది ప్రతాప్‌కి.

కాని కారణం అతని నోటివెంట వినాలని అనుకుంటున్నాడు.

"వెళ్ళండి బాబూ!" అన్నాడు అతను తాటిరేకులు సర్దుకుంటూ.

ప్రతాప్ లేచి, మళ్ళీ నడక సాగించాడు.

తనకు జోస్యంమీద నమ్మకం లేదు. కాని అతను జోస్యం చెప్పడం మానుకున్నాడెందుకు? ఎందుకు? అందుకే అవ్వాలి! అంటే జ్యోతిష్కుడికి తెలిసిపోయిందన్నమాట.

అతను రోడ్డుమీద నడుస్తున్నాడు.

ప్రక్కనుండి వాహనాలు దూసుకుపోతున్నాయి.

అతనికేవేం పట్టలేదు.

అతనిలో ఆలోచనలు ఉవ్వెత్తున లేచాయి.

నిజమా? యిది జరిగి తీరుతుందా?

తను మాత్రం నమ్మలేకపోతున్నాడు.

తను ఎన్నో ఆశలు పెట్టుకున్నాడు. కోరికలు పెంచుకున్నాడు. అవన్నీ ఒట్టివేనా?

మరి యిలా జరుగుతుందేమిటి?

యీ ముప్పై అయిదేళ్ళల్లో తను అనుభవించిన సుఖమేమిటి?

చండశాసనుడైన తండ్రికి భయపడి, అందరి పిల్లల్లాగ ఆడుతూ, పాడుతూ కాలం గడిపే దశను అనుభవించలేక పోయాడు. తన తండ్రి ఎంతసేపూ యిల్లూ, స్కూలు తప్ప మరొకటేదీ తెలియనిచ్చేవాడు కాదు. బాల్యం అలా నిస్పృహగా గడిచింది.

పెరిగి పెద్దయ్యేక ఉద్యోగం సద్యోగం లేదంటూ కొన్ని సంవత్సరాలు తల్లి సాధించింది. ఉద్యోగం లేక, సంపాదన లేక కోరికలు చంపుకున్నాడు అప్పుడు. ఆ జీవితం కూడా సుఖమనిపించలేదు.

సుజాత ఎంతో అందంగా ఉంటుందని ప్రేమించేడు. కాని ఆమె తనను ప్రేమించలేదంటూ తిరస్కరించి వెళ్ళిపోయింది.

సుజాత అంతటితో ఆగిపోలేదు. పక్కింటి గోపాలాన్ని పెళ్ళిచేసుకుంది.

అది తన గుండెల్లో మరింత మంటరేపింది. గోపాలానికి తనకూ చుక్కెదురు. పెళ్ళయిన తర్వాత తనవేపు గర్వంగా గోపాలం చూడ్డం గమనించి, తను మనసులోనే బాధపడుతున్నాడు కూడా.

అందుకే పెళ్ళి మానుకున్నాడు.

పెళ్ళి చేసుకుంటే కలిగే ఆనందం అవసరమైనపుడల్లా డబ్బుతో కొనుక్కుంటున్నాడు.

అదే హాయనిపించిందతనికి.

అడుగులు చక చక పడుతున్నాయి.

ఆలోచనలు రగులుతుంటున్నాయి.

యిప్పటివరకూ యిదే తన బ్రతుకు.

యీ పరిస్థితుల్లోనే తను యీ పిడుగులాంటి వార్త వినాల్సి వచ్చింది!

ఏం చేయాలి?

యిప్పటికైనా మించిపోయింది లేదు.

ఏదో చేసేయాలి!

కసిగా నవ్వుకోవాలి!

సుఖాన్ని జుర్రుకోవాలి!

ఆనందాన్ని అనుభవించాలి!

అయితే ఎలా?

జేబులోంచి సిగరెట్ పాకెట్ తీసి, సిగరెట్టు వెలిగించుకున్నాడు. గట్టిగా పొగపీల్చి రింగులుగా వదిలాడు. మస్తిష్కంలో ఆలోచనల వేగం పెరిగింది.

## 2

సాయంత్రం ఆరున్నర అయింది.

"నరేంద్రా!" గట్టిగా పిల్చేడు ప్రతాప్.

రోడ్డుమీద నడుస్తున్న నరేంద్ర వెనుతిరిగి చూసాడు.

గబగబా అడుగులు వేస్తూ నరేంద్రను కలుసుకున్నాడు ప్రతాప్.

"గుడీవినింగ్ నరేంద్రా!" అన్నాడు విష్ చేస్తూ.

"ఏమిటి విశేషాలు?" నడుస్తూ అడిగాడు నరేంద్ర.

"ఏమున్నాయ్ అంతా మామూలే. అన్నట్టు మీ ఆవిడ ఊళ్లో వుందా?" అని అడిగాడు.

"యిప్పుడే శ్రీకాకుళం పంపించి వస్తున్నాను. ఏమన్నా విశేషమా?"

"అదే! మీ యిల్లు ఖాళీగా వున్నట్టేకదా?"

తలాడించాడు.

ఇద్దరూ చిన్నప్పట్నుంచి ఫ్రెండ్స్. నరేంద్ర సదరన్ డ్రగ్ మాన్యుఫేక్చరర్స్ కంపెనీలో కెమికల్ యింజనీరుగా పనిచేస్తున్నాడు. కొత్తగా పెళ్ళయింది. పెళ్ళికి పూర్వం నరేంద్ర గదిలోకి ప్రతాప్ రాత్రివేళలో అమ్మాయిల్ని తెచ్చేవాడు. యిద్దరూ 'ఎంజాయ్' చేసేవారు. పెళ్ళైన తర్వాత రూమ్ ప్రసక్తి రావడం యిదే మొదటిసారి.

"అయితే మనం యీరోజు ఎంజాయ్ చేద్దాం? ఏమంటావ్?" అన్నాడు ప్రతాప్.

"ష్యూర్!" అతని కళ్ళల్లో మెరుపు.

"నువ్వు యింట్లోనే వుండు. తొమ్మిదింటికల్లా వస్తాను. ఒట్టి చేతులతో కాదు బ్రహ్మాండమైన ఫిగర్‌తో" నవ్వేడు ప్రతాప్.

"నిజంగానా? అంత బాగుంటుందా?"

"చూస్తావుగా! సరాసరి నిన్ను స్వర్గానికి తీసుకు వెళుతుంది."

"ఓ! అయామ్ వెరీ లక్కీ" అంటూ ప్రతాప్‌ని కాగిలించుకున్నంత పని చేసాడు.

"ఓ.కే. నేను తొమ్మిదింటికి వస్తాను. నువ్వు అన్నీ సిద్ధంచేసి వుంచు."

తలాడించాడు నరేంద్ర.

యిద్దరూ విడిపోయారు.

ప్రతాప్ పది నిమషాల్లో బీచ్‌కి చేరుకున్నాడు.

బీచ్‌లో జనం పలచగా వున్నారు.

నుదుటమీద చెలరేగుతున్న ముంగురుల్ని చిరాగ్గా సర్దుకుని బీచ్‌లో సిమెంటు బల్లమీద కూర్చున్నాడు ప్రతాప్.

అతని మనసిప్పుడు ఆనందంగా వుంది.

ఎంతో ఆహ్లాదకరంగా వుంది.

ఎన్నాళ్ళనుండో అంతరాంతరాల్లో దాగునివున్న కోరిక కొద్ది సేపట్లో నెరవేరబోతుంది.

అంతే అదే చేయాలి!

అలా చేస్తేగాని తన మనసుకి తృప్తీ, శాంతీ వుండవు. ఆలోచనలతో గంటన్నర గడిచింది.

బెంచీమీద నుండి వొళ్లు విరుచుకుంటూ లేచాడు. జేబులోవున్న వస్తువును తడిమి చూసుకుని తృప్తిగా నిట్టూర్చేడు.

టాక్సీని పిలిచి 'మొదలియార్' వీధి పోనివ్వమన్నాడు

టాక్సీ రోడ్డుమీద పరిగెత్తసాగింది.

# 3

నరేంద్ర వాచీ చూసుకున్నాడు.

తొమ్మిది గంటలు కావస్తూంది.

అతను ప్రతాప్ రాకకోసం ఎదురుచూస్తున్నాడు.

నిముషమొక యుగంలా అనిపిస్తోంది నరేంద్రకి.

ప్రతాప్ తొమ్మిది గంటలకు వస్తానని చెప్పినా, అంతకంటే ముందే వస్తే బాగుణ్ణనిపించింది నరేంద్రకి. ప్రతాప్‌కి అనుకున్న టైముకంటే ముందే రావడం అలవాటు. ప్రతాప్ ఎటి పరిస్థితుల్లోనూ ఎక్కడా ఆలస్యం చేయడని తెలుసు నరేంద్రకి.

గుమ్మం దగ్గర నిల్చుని రోడ్డుమీదకి దృష్టిసారించి వీధి లోకి చూసాడు.

ప్రతాప్ జాడలేదు.

ఎక్కడా టాక్సీ వస్తున్నట్టుకూడా కనిపించలేదు.

యింకా రాడేం?

నరేంద్ర ఆలస్యాన్ని భరించలేకపోతున్నాడు.

కాలుగాలిన పిల్లిలాగ యిల్లంతా తిరగసాగాడు.

నిమషాలు చకచక గడుస్తున్నాయ్.

యింటిముందు టాక్సీ వచ్చి ఆగింది.

టాక్సీలోంచి ప్రతాప్ దిగాడు. ప్రతాప్ మొహం డ్రైవరుకి కనిపించడంలేదు. టాక్సీలోంచి దిగుతూ హేట్‌ని మరింత క్రిందకి లాక్కున్నాడు.

పర్సులోంచి పది రూపాయలు నోటు తీసి డ్రైవరుకి యిచ్చాడు.

డ్రైవరు అయిదు రూపాయల నోటు యిచ్చి, చిల్లర యివ్వబోయాడు.

"అయిదు రూపాయలనోటు అందుకని, చిల్లర వుంచు కోమని చెప్పి, నరేంద్ర యింట్లోకి అడుగుపెట్టాడు.

అప్పటికే నరేంద్ర అన్నీ సిదంచేసి వుంచాడు.

గది మధ్యలో టేబిల్. దానిమీది విస్కీబాటిల్, బీర్‌బాటిల్ రెండు గ్లాసులు, సిగరెట్టు ప్యాకెట్ వున్నాయి. ఒక ప్లేటులో అయిసుముక్కలు వుంచాడు, కాని అవి దాదాపు కరిగిపోయి నీరుగా మారిపోయింది.

"ఏమిటింత ఆలస్యం?"

"దార్లో ఓ చిన్న పని పడింది. అందుకని ఆలస్య మైంది."

చికన్ పులావ్ ప్యాకెట్లు విప్పి టేబిల్‌మీద సర్దేడు.

ప్రతాప్ టేబిల్ మీద వున్నవాటిని చూసి చిన్నగా నవ్వుకుని, కుర్చీలో కూర్చున్నాడు.

"ఫిగర్ ఏదీ?" ఒక్కడే రావడంతో కుతూహలంగా అడిగాడు నరేంద్ర.

"డోంట్ వర్రీ ఫ్రెండ్! కొద్ది సేపట్లో వస్తుంది. అడ్రసు ఇచ్చాను. పిట్ట ఇక్కడికే వచ్చి వాలుతుంది. మొదట ఓ రౌండ్ వేద్దాం" అన్నాడు తెల్లగుర్రం విస్కీ వేపు చూస్తూ.

నరేంద్ర రెండు గ్లాసుల్లో విస్కీని సర్ది, బీర్ బాటిల్ సీలు ఊడదీసి మళ్ళీ రెండుగ్లాసుల్లో నింపేడు.

"చీర్స్!" యిద్దరి గొంతులు కలిసాయి. గొంతులతో పాటు గ్లాసులు!

రెండు గుక్కల్లో గ్లాసు ఖాళీచేసి టేబిల్ మీదుంచేడు ప్రతాప్.

మెల్లగా చిప్ చేస్తున్న నరేంద్రని చూసి మందహాసం చేసాడు.

"మిస్టర్! నరేంద్రా! జీవితం చాలా స్పీడుగా పరిగెత్తుతోంది. దాన్ని అందుకోవాలంటే మనంకూడా స్పీడ్ పెంచాలి. లేకపోతే వెనకబడిపోతాం" తమాషాగా చూస్తూ అన్నాడు.

నరేంద్ర మాట్లాడలేదు.

మందుకొట్టినప్పుడల్లా పిచ్చిపిచ్చిగా ప్రతాప్ వాగడం నరేంద్రకు కొత్తకాదు. అతని ఆలోచనలన్నీ రాబోయే 'ఫిగర్' మీద వున్నాయి. అతని చూపులు గుమ్మంవేపు క్షణక్షణానికీ కదులుతున్నాయి.

"ఏమంటావ్?" అన్నాడు.

"అవునవును. పూర్తిచేస్తున్నాను." అంటూ మిగిలిన

ద్రవాన్ని గొంతులో పోసుకున్నాడు. విస్కీ వెచ్చగా గొంతులో దిగుతోంది. శరీరం తేలిక అయిపోసాగింది నరేంద్రకి.

"ఇంకా రాలేదేం?" మరోసారి గుమ్మంవేపు చూసి అడిగాడు నరేంద్ర.

"వస్తుంది. తొందరపడక."

సీసాలోని విస్కీని తన గ్లాసులోకి కాస్తంత పోసుకుని, బీర్ కలుపుకోకుండానే గటగట త్రాగాడు ప్రతాప్. గొంతు మండుతుంటే ఒక్కక్షణం కళ్ళు మూసుకున్నాడు.

రెండు నిమిషాల తర్వాత కళ్ళు తెరిచాడు.

అతని కళ్ళు ఇప్పుడు చిత్రంగా మెరుస్తున్నాయి.

ప్రతాప్ వేపు చూసి నవ్వేడు నరేంద్ర.

ప్రతాప్ లేచి నిలబడ్డాడు. అతని చెయ్యి పాంటుజేబులోనికి వెళ్ళింది.

"నిలబడ్డావేం?" అంటూండగానే నరేంద్ర దృష్టి ప్రతాప్ చేతిమీద పడింది.

అదిరిపడ్డాడు.

ప్రతాప్ చేతిలో నల్లని పిస్తోలు ప్రత్యక్షమైంది.

నిగనిగలాడుతూ మెరుస్తోంది.

నరేంద్రకు గురిపెట్టాడు ప్రతాప్. అది నరేంద్రవేపు ఆకలిగా చూడసాగింది.

సరదాగా తీసేదేమో అని సరిపెట్టుకోవాలనుకున్నాడు నరేంద్ర.

"మైడియర్ ఫ్రెండ్! ప్లీజ్!..." అంటూ అరిచేడు.

వులిక్కిపడ్డాడు నరేంద్ర. ఈసారి ఇంకా సూటిగా తన గుండెలకు గురిపెట్టబడింది పిస్తోలు.

"వాటీజ్ దిస్?" భయంగా అడిగాడు.

"దీన్ని పిస్తోలని అందరూ అంటారు. ప్రాణాలు తియ్యడానికి దీనిని ఉపయోగిస్తారు." వికటంగా నవ్వుతూ అన్నాడు ప్రతాప్.

ప్రతాప్ మాటలూ, ప్రవర్తన నరేంద్రను అయోమయంలో ముంచెత్తాయి. అతను అయోమయంనుండి తేరుకోక ముందే ప్రతాప్ చేతిలో పిస్తోలు నిప్పులు కురిపించింది.

నరేంద్ర నేల కూలిపోయాడు.

అచేతనంగా పడిపోయిన నరేంద్రను, అతని గుండె నుండి కారుతున్న రక్తాన్ని పిచ్చిగా చూస్తూ సిగరెట్ వెలిగించుకున్నాడు ప్రతాప్.

కుర్చీలో కూర్చుని, సీసాలో మిగిలిన విస్కీని మెల్లగా సిప్ చెయ్యసాగాడు.

హత్య చేసానన్న భయం అతనిలో ఏ కోశానా కనిపించ లేదు.

అది నిర్జనమైన ప్రాంతం. అక్కడికి ఎవరూ రారు. అంతే కాకుండా సైలెన్సర్ పిస్తోలు వుపయోగించినందు వలన పిస్తోలు శబ్దంకూడా చుట్టుపక్కల వినిపించదు. అదే అతని ధైర్యం.

"లెటజ్ సెలబ్రేట్ దిస్ అకేషన్" మెల్లగా తనలో తనే గొణుక్కున్నాడు.

పులావ్ ప్యాకెట్ ముందుకు లాక్కుని టేస్ట్ చేసేడు.

భారంగా కాలం దొర్లిపోయింది.

గంట దాటిన తర్వాత ఫోన్ దగ్గరకు మెల్లగా నడిచాడు. చేతి రుమాలును తీసి, దాంతో జాగ్రత్తగా రిసీవర్ని ఎత్తి పట్టుకుని, నెంబర్ డయల్ చేసాడు.

"హల్లో! పోలీస్ స్టేషన్ ప్లీజ్!"

"యస్! ఇన్‌స్పెక్టర్ మోహన్‌కుమార్ స్పీకింగ్..."

"నమస్తే సార్? నా పేరు నరేంద్ర. నన్నెవరో హత్య చేయడానికి ప్రయత్నిస్తున్నారు."

"వాట్!" అని అదిరిపడి "మీ రెక్కడ్నుంచి మాట్లాడుతున్నారు" అడిగాడు ఆశ్చర్యంగా.

"చెప్పడానికి వ్యవధిలేదు ఇన్‌స్పెక్టరుగారూ! మీరు వెంటనే మొదలియార్ స్ట్రీట్‌లో పదవనంబరు ఇంటికి రావాలి. లేకపోతే నా ప్రాణాలు పోతాయి" భయంగా అన్నాడు ప్రతాప్.

"యస్! ఇప్పుడే వస్తాను."

ఫోన్ డిస్కనెక్టయింది.

గర్వంగా నవ్వుకున్నాడు ప్రతాప్. ఫోన్‌లో భయాన్ని అంతబాగా నటించినందుకు తనను తనే మెచ్చుకున్నాడు.

"తెలివిగా పోలీసుల్ని ముప్పతిప్పలు పెడతాను. ఈ కేసును 'సాల్వ్' చేయలేక పోలీసులు తలలు పగలకొట్టుకో వలసిందే" అనుకుంటూ తల పంకించాడు.

వీధి తలుపు తెరుచుకుని చీకట్లో కలిసిపోయాడు ప్రతాప్.

## 4

"నగరంలో నాలుగురోజులలో మొత్తం నాలుగు హత్యలు జరిగాయి. మొదటిహత్య—హతుని పేరు నరేంద్ర. సదరన్ డ్రగ్ మేన్యుఫేక్చర్స్ కంపెనీలో కెమికల్ యింజనీర్‌గా పనిచేస్తున్నాడు. తన నెవరో హత్య చేయాలనుకుంటున్నారనీ హతుడు ఫోన్ చేసిన మీదట నేను వెంటనే వెళ్ళేను. నాకు అతని శవం దర్శనం యిచ్చింది. హంతకుడు ఆధారాంలేమీ వదిలి పెట్ట

లేదు. వేలిముద్రలు దొరకలేదు.

హతుడి కళ్ళలో ఆశ్చర్యాన్నిబట్టి హంతకుడు అతనికి తెలిసినవాడే అయ్యుండాలని భావించేను.అంతేగాకుండా ఆ రోజు పార్టీ చేసుకున్నట్టుగా అక్కడున్న విస్కీ బాటిల్, పులావ్ ప్యాకెట్లు, కాల్చేసిన సిగరెట్లు,రెండు గ్లాసులు తెలియజేస్తున్నాయి..." చెప్పటం ఆపి డిటెక్టివ్ అరుణ్ కుమార్ ముఖంలోకి చూశాడు ఇన్ స్పెక్టర్ మోహన్ కుమార్.

"అయితే ఆ రోజు పార్టీలో పాల్గొన్న వ్యక్తులెవరో తెలిసిందా?" అడిగాడు అరుణ్ కుమార్ సాలోచనగా.

"తెలుసుకోలేదు."

"వెంటనే ఆ యేర్పాట్లు చూడు. అతనికి డైరీ రాసే అలవాటుందేమో, వెతికి చూడు. ఇంట్లో వస్తువులన్నీ మరోసారి చెక్ చెయ్" చకచక ఆదేశాలిచ్చేడు.

"ఇకపోతే రెండవది—హతుడు బిజినెస్ మాగ్నెట్ రంగనాధరావుగారు. అతను బ్యాంకునుంచి లక్షరూపాయల క్యాష్, తీసుకువస్తుండగా అతన్ని దోచుకుని హత్య చేయడం జరిగింది. అతని శవం ఊరి చివర పబ్లిక్ బూత్ దగ్గర దొరికింది.ఇతనుకూడా చనిపోయేముందు తననెవరో చంపాలని ప్రయత్నిస్తున్నట్టు ఫోన్ లో చెప్పాడు. అయితే మేం వెళ్ళేసరికి మళ్ళీ శవం కనిపించింది."

మిగతా రెండు హత్యల గురించికూడా వివరించి చెప్పేడు మోహన్ కుమార్.

"హత్య జరిగే తీరునుబట్టి, హంతకుడు ఒకడేనని తెలుస్తోంది. హత్యాయుధం నాలుగు హత్యలకి ఒకే పిస్తోలు. హత్యచేసిన ప్రతిసారీ నాకు ఫోన్ కాల్ వచ్చేది."

"ప్రతిసారీ హతుడినుండే ఫోన్ కాల్ వచ్చేదా?"

పాలోచనగా చూస్తూ అడిగాడు.

"అవును. హతుడే ఫోన్ చేసేవాడు."

నొసలు చిట్లించేడు అరుణ్‌కుమార్.

"ఇదెలా సాధ్యం?"

"అంతేకాదు. ఇంకో విచిత్రం వుంది. హత్య జరిగిన తర్వాత హతుడు ఫోన్ చేసినట్లుగా పోస్టుమార్టమ్ రిపోర్టువలన తేలింది."

"నాన్సెన్స్! హత్య జరిగిన తర్వాత హతుడు ఫోన్ చేయడమేమిటి? చచ్చినవాళ్లెక్కడయినా ఫోన్ చేస్తారా?" విసుగ్గా అన్నాడు అరుణ్‌కుమార్.

"యస్! మిస్టర్ అరుణ్‌కుమార్! ఇటీజ్ ట్రూ. పది గంటలప్పుడు తనను ఎవరో హత్య చేయబోతున్నట్లుగా, వెంటనే వచ్చి కాపాడమంటూ ఫోను వచ్చేది. తీరా వెళ్ళేక అతని శవం దర్శనమిచ్చేది. పోస్ట్‌మార్టమ్ రిపోర్టులో హతుడు ఎనిమిది గంటలకే చనిపోయినట్లుగా ధృవపరచబడివుంది. నాలుగుసార్లు కూడా యిలాగే జరిగింది."

మోహన్‌కుమార్ చెప్పిందంతా జాగ్రత్తగా విన్నాడు డిటెక్టివ్ అరుణ్‌కుమార్. అతని మస్తిష్కం ఆలోచనలతో వేడెక్కింది.

"నో! ఇటీజ్ యింపాజిబుల్. హత్య జరిగిన తర్వాత హతుడు ఫోను చెయ్యగలగడం దుర్లభం. ఇందులో ఏదో మోసం వుంది. ఫోనుమీద వేలిముద్రలున్నాయా?" అడిగాడు.

"లేవు!"

"ఐ. సి. హంతకుడు తెలివిగానే ప్రవర్తిస్తున్నాడు. కాని ఫోన్‌కాల్స్‌లోని మిస్టరీ అర్థమైపోయింది."

సిగరెట్ తీసి వెలిగించుకున్నాడు డిటెక్టివ్ అరుణ్ కుమార్.

“ఫోన్ కాల్స్ మిస్టరీ ఏమిటి?”

“ఏంలేదు. హత్యచేసిన తర్వాత హంతకుడే ఆ విధంగా ఫోను చేస్తున్నాడు.”

“ఈజిట్!” ఆశ్చర్యపోయేడు.

“అవును. అందుకే టెలిఫోన్ మీద తన వేలిముద్రలు తుడిచిపెడుతున్నాడు. హతుడు తన వేలిముద్రల్ని తుడిచేసే అవసరం లేదుకదా?” అన్నాడు అరుణ్ కుమార్.

అంత సింపుల్ విషయం తన బుర్రకి తోచనందుకు తినను తను తిట్టుకున్నాడు మోహన్ కుమార్.

“మరి యీ మర్డర్స్ మిస్టరీ ఏమిటి?”

“అది యింతవరకు అంతుబట్టడంలేదు. నువ్వోపని చెయ్. హతులందరికీ మధ్య యేదన్నా సంబంధం వుందేమో చూడు. ఏదన్నా వుందనుకుంటే ఈ కేసు ముందుకి సాగే అవకాశముంటుంది. హతులకు శత్రువు లెవరన్నా వున్నారేమో ఎంక్వయిరీ చేయించు. మొత్తం వివరాలు నాకు వెంటనే అందించు.”

తలాడించేడు యిన్స్పెక్టర్ మోహన్ కుమార్. లేచి నిలబడ్డాడు.

మోటార్ సైకిలు స్టార్టయి వెళ్ళిపోయిన శబ్దం వినిపించింది డిటెక్టివ్ అరుణ్ కుమార్ కి.

## 5

ఎర్రరంగు చెవర్లెట్ కారు రివ్వున దూసుకుపోసాగింది.

బస్టాపుదగ్గర సడన్ బ్రేకు పడింది కారుకి.

దానికార్కారణం—

బస్టాపులో ఓ అందమయిన అమ్మాయి వుండడమే!

కారులోని వ్యక్తి ఆమెను చూశాడు.

అతని కళ్ళు మెరిసాయి.

గులాబీరంగు ఛాయ, చక్రాల్లాంటి కళ్ళు, పొడవైన ఎత్తు, మగాడిలోని మగతనాన్ని సవాలు చేసే బలిష్టమైన రొమ్ములు, దివినుంచి భువికి దిగివచ్చిన అప్సరసలా వుందామె.

తెల్లటి నైలాన్ చీర, అదే రంగు జాకెట్.

ఆమె జుట్టు పిరుదులు దాటి వేలాడుతోంది. సగం వరకు అల్లి, ఆ తర్వాత జుట్టును వదులుగా వదిలేసింది. చేతులు లేని జాకెట్టు ధరించినందువల్ల ఆమె జబ్బలు ముద్దొచ్చేలా అగుపిస్తున్నాయి. పల్చటి చీరలోనుంచి మెడలో మంగళసూత్రాలు కనిపిస్తున్నాయి.

పెదవులకు ఎర్రటి లిప్‌స్టిక్.

"గుడ్! బ్యూటిఫుల్ ఫిగర్!"

అతను లోలోన గొణుక్కుంటూ, తన చెవర్లెట్ కారు స్లో చేసి ఆమె ప్రక్కనే ఆపుజేశాడు.

"మేడమ్! యిప్పుడే బస్సు వెళ్ళింది. మరో అరగంట దాకా రాదు. మీకు అభ్యంతరం లేకపోతే నా కారు యెక్కండి" అన్నాడు వినయంగా.

ఆ యువతి క్షణం ఆలోచించింది. ఆమె ఆలోచన కళ్ళల్లోనే కనిపించిందతనికి.

"సందేహించకండి. మీకు అభ్యంతరమైతే వెళ్ళిపోతాను."

ఈసారి అతను వేసిన అస్త్రం పనిచేసింది.

కారెక్కడానికి సిద్ధపడిందామె.

బాక్‌డోర్ తెరిచేడతను.

ఆ యువతి కారు ఎక్కింది.

మెత్తగా రోడ్డుమీద దూసుకుపోతోంది ఎర్రరంగు చెవర్లెట్ కారు.

"ఎక్కడకు వెళ్ళాలి?" అని అడిగేడతను.

ఆ యువతి ఎడ్రసు చెప్పింది.

"మీ పేరు?"

"సుజాత!" అని చెప్పింది.

"బ్యూటిఫుల్ నేమ్!" కామెంట్ చేశాడు.

అతను అలా అనడం ఆమెకి నచ్చలేదు. అతని వేపు అదోలా చూసింది.

అతను ఆమె వేపు దొంగచూపులు చూస్తున్నాడు. పళ్ళు కొరుకుతున్నాడు.

అతని ప్రవర్తన ఆమెకు భయం కలిగించింది.

అతని దృష్టి రోడ్డుమీద వున్నా మనసుమాత్రం ఆ యువతిమీదే వుంది.

ఆమె అందం అతన్ని ఆకట్టుకున్నట్టుంది. అతను కసిగా నవ్వుకున్నాడు. అప్రయత్నంగా అతని నవ్వు బయటికి వినిపించింది.

ఆమె అదిరిపడింది.

ఇంతలో చెవర్లెట్ కారు మలుపు తిరిగింది.

"మా ఇల్లు అటుకాదు" అరిచిందామె.

"ఆ సంగతి నాకు తెలుసు. నోరు మూసుకుని పడి వుండు" గదమాయించాడు.

ఆమె గుండె ఆగినంత పనయింది.

అంతలోనే ఆమె ముక్కుపుటాలకు క్లోరోఫారమ్ వాసన సోకింది. అతను క్లోరోఫారమ్ ముంచిన రుమాలును ఆమె ముక్కుకి అదిమిపెట్టాడు.

ఆమె తల వాల్చేసింది.

పది నిమషాల్లో ఒక చిన్న పెంకుటింటి ముందు ఆ పేడు కారుని.

# 6

సుజాతకి స్పృహ వచ్చింది.

గది మధ్యలో మంచంమీద పడి వుందామె. చటుక్కున లేచి మంచంమీద కూర్చుంది. చుట్టు చూసింది. తలుపులన్నీ బిగించి వున్నాయి.

తను ప్రమాదంలో యిరుక్కున్నట్లు తెలుసుకుంది.

ఆమె కళ్ళల్లో నీరు తిరిగింది.

కార్లో అతను కసిగా నవ్వుకోవడం, తనవేపు దొంగ చూపులు చూడ్డం గుర్తుకొచ్చేయి సుజాతకి. దాంతో అతనేం చేయబోతున్నాడో తెలిసి గుండెలు దడదడ లాడేయి.

గబుక్కున లేచి తలుపులన్నీ తట్టి చూసింది. ఒక్క తలుపూ తెరుచుకోలేదు.

ఏడుపు వచ్చేసింది సుజాతకి. చెంపలమీదుగా కన్నీళ్లు ధారలు కారుతున్నాయి.

తనిక్కడికొచ్చి ఎంతసేపయ్యిందో? ఇంటి దగ్గర ఆయన తన రాకకోసం ఎదురు చూస్తూంటారు. ఆమె దుఃఖం గుండెల్లోంచి పొంగుకొచ్చింది. వెక్కి వెక్కి ఏడ్వసాగింది.

ఏడుస్తున్న ఆమె వులిక్కిపడింది. ఎవరో నడిచి వస్తున్న బూట్ల చప్పుడు!

బూట్ల చప్పుడు క్రమంగా తనకు దగ్గరౌతుంది.

వచ్చేదెవరు? చెవర్లెట్ కార్లో మనిషేనా?

తలుపుల దగ్గర ఆ శబ్దం ఆగిపోయింది.

తలుపులు తెరుచుకుంటున్నట్లు కిర్రుమని చప్పుడైంది.

ఆతృతగా తల తిప్పి గుమ్మంవేపు చూసింది.

తలుపులు తెరుచుకున్నయ్.

గుమ్మంలో ఓ మనిషి ప్రత్యక్షమయ్యేడు. అతను చెవ ర్లెట్ కార్లో మనిషే!

పకపకమని నవ్వేడతను.

సుజాత గుండెలు చెదిరిపోయేయి ఆ నవ్వుకి.

"మోసపోయేవని బాధగా వుందా?"

ఆమె గొంతు పెగలడంలేదు. అతనివేపు బిత్తర చూపులు చూడసాగింది.

అతను ఆమెకి దగ్గరగా రాసాగాడు. సుజాత బెదిరి వెనక్కి అడుగేసింది.

"భయంగా వుందా?"

"నన్నెందుకు తీసుకు వచ్చావ్ యిక్కడికి? నేను నీకు ఏం అపకారం చేసాను?" గుండె దిటవు చేసుకుని అడిగింది.

"ఒక ఆడదాన్ని, మగాడు ఎందుకు చెరబడతాడు. అందుకే నిన్ను తీసుకొచ్చాను. నువ్వు చాలా అందంగా వున్నావ్" నవ్వాడతను.

"అంటే...నన్ను...?" అంది గుండెలమీద భయంగా చేయివేసుకొని.

"ఆ! నీ అందం పీల్చి పిప్పి చేస్తాను"

ఆమె ఎండుటాకులా గజగజ వణికిపోయింది.

"రా! మజా చేసుకుందాం" అన్నాడు మరో అడుగు ముందుకేసి.

"ప్లీజ్! నన్ను వదిలేయ్. నేను వివాహితను. నీకిది

ధర్మంకాదు."

"పెళ్లైనదానవయితే యింకా మజాగా వుంటుంది. రా!"

అంతలోనే ఆమెలో ఏదో ధైర్యం ఆవహించింది.

"షటప్! నా బొందిలో ప్రాణముండగా నీ వశం కాను" కోపంగా అంది.

అతను వికటంగా నవ్వి "ఇంతకుముందు ఎందరో ఈ మాట చెప్పారు. ఆఖరికి నాకు లొంగిపోక తప్పలేదు."

"ఇంపాజిబుల్! నా ప్రాణం పోయినా నేను నీకు లొంగను" అరిచిందామె ఆవేశంగా.

"నీ ప్రాణం ఎలాగూ తీస్తాను. అందుకే ఆ ప్రాణం తీసేలోగానే నీ అందం పీల్చి పిప్పిచేస్తాను" అంటూ పరిహాసంగా నవ్వి, చటుక్కున నవ్వాపి "కమ్ హియర్ డార్లింగ్" అన్నాడు కౌగిట్లోకి ఆహ్వానిస్తూ.

అతనికి దూరమౌతూ గోడవేపు పరిగెత్తింది సుజాత.

"ఎంతదూరం పరిగెట్టినా తప్పించుకోలేవు సుజాతా!"

ఒక్కొక్క అడుగు ఆమెవేపు వేస్తున్నాడతను.

"వద్దు. నా మాట విను. ప్లీజ్! నన్ను విడిచిపెట్టు. లీవ్ మీ" ప్రాధేయపడుతోందామె.

కర్కశంగా నవ్వేడతను.

సుజాత గోడకు అనుకుని భయవిహ్వలయై చూసిందతన్ని.

మృత్యుహస్తంలా అతని చెయ్యి ఆమె జాకెట్టుమీద పడింది.

కెవ్వుమని అరిచింది సుజాత.

"రాక్షసుడా! నన్ను విడిచిపెట్టు"అరుస్తోంది సుజాత.

ఆమె ఆక్రందన అరణ్యరోదనే అయింది.

"వదలడమా? నిన్నేకాదు అందంగా కనిపించే ఏ ఆడదాన్నీ వదలను. నిన్ను కసిదీరా... కరువుదీరా అనుభవించి..." వికటంగా నవ్వేడు.

అతను నవ్వు సుజాత చెవుల్ని చిల్లులు పెడుతోంది.

గుండెలు జలదరిస్తున్నాయా నవ్వుకి.

"అన్నయ్యా! నీ చెల్లెలు లాంటిదాన్ని...నన్ను వదిలేయ్" రెండు చేతులెత్తి దండం పెట్టింది.

"చట్! అన్నయ్యా అని పిలిచినంతమాత్రాన వదిలేస్తానని అనుకున్నావా? నిన్ను అనుభవించనిదే నేను నిద్రపోలేను."

గబుక్కున ఆమె పైటచెంగు అందుకుని గట్టిగా గుంజాడు.

మొత్తం చీర అతని చేతిలోకి ఊడి వచ్చింది.

సుజాత జాకెట్, లంగాతో నిల్చుంది. రెండు చేతులతో గుండెల్ని కప్పుకుంది. అతను ఒక్కో అడుగు ముందుకేస్తున్నాడు.

సుజాత యింకా వెనక్కు వెళ్ళాలని ప్రయత్నించింది. వెనుక గోడ వెక్కిరిస్తూ అడ్డువచ్చింది.

సుజాతలో ధైర్యం సన్నగిల్లుతోంది.

అతను సుజాత రెండు భుజాలు గట్టిగా పట్టుకుని తన గుండెలకి హత్తుకున్నాడు.

తన శక్తినంతా కూడదీసుకుని రెండు చేతుల్ని అతని మొహంమీదకు విసురుతూ, అతన్ని వెనక్కి నెట్టింది సుజాత.

అతను తూలిపడ్డాడు వెనక్కి. మొహాన వున్న 'మాస్క్' వూడిపడింది.

అతన్ని చూసి సుజాత ఆశ్చర్యపోయింది.

"నువ్వా?"

"అవును–నేనే" అంటూనే చటుక్కున లేచి, ఆమె జాకెట్ పై చేయివేసి గుంజాడు.

జాకెట్ చిరిగి పీలికలై అతని చేతిలోకి వచ్చింది.

బ్రాసరీలోంచి బయటకు ఉరకాలని చూస్తున్నాయి సుజాత వక్షోజాలు.

అతని కళ్ళు మెరిసాయి.

అంతే! అతను సింహంలా ఆమెపైకి విజృంభించాడు.

## 7

"ఇన్ స్పెక్టర్ గారూ! నిన్నట్నుంచి నా భార్య కనిపించడం లేదు" అన్నాడతను లోనికి రాగానే.

అతన్ని కూర్చోమని చెప్పి "ఎవరింటికేనా వెళ్ళిందేమో కనుక్కున్నారా?" అని అడిగాడు ఇన్ స్పెక్టర్ మోహన్ కుమార్.

"మొదట నేనూ అలానే అనుకుని రాత్రివరకూ ఆగాను. రాత్రి పది గంటలు దాటిపోతున్నా రాకపోవడంతో, ఆమె గురించి స్నేహితుల యిళ్ళల్లోనూ, యితర ముఖ్యస్థలాల్లోను ఎంక్వయిరీ చేసాను. అసలామె నిన్నంతా ఎవరికీ కనిపించనే లేదట."

"ఆమె బయటకి వెళ్ళిన కారణం తెలుసా?"

"ఆ! షాపింగ్ కని బయల్దేరింది. తెలిసిన షాపులన్నింట్లోను అడిగాను. అసలక్కడికి రాలేదని చెప్పారు."

యింతలో ఫోన్ మ్రోగింది.

మోహన్ కుమార్ రిసీవరెత్తి "ఇన్ స్పెక్టర్ స్పీకింగ్" అన్నాడు.

"నన్ను చంపేస్తున్నారు ఇన్ స్పెక్టర్ గారూ!"

హృదయ విదారకమైన గొంతు వినిపించింది ఫోన్‌లో.

అదిరిపడ్డాడు ఇన్‌స్పెక్టర్ మోహన్‌కుమార్.

ఆ గొంతు ఆడో, మగో అర్థం కావేదతనికి.

"మీ రెవరు? ఎక్కడ్నుంచి మాట్లాడుతున్నారు?" సిబ్బందిని రెడీకమ్మని కళ్ళతోనే ఆదేశాలిచ్చాడు మోహన్ కుమార్.

"నా పేరు సుజాత. అడయార్ బీచ్ నుంచి..."

ఫోన్ డిస్కనెక్టయింది.

టైమ్ చూసుకున్నాడు మోహన్‌కుమార్.

ఉదయం తొమ్మిది గంటలు కావస్తూంది.

"ప్రభాకర్ గారూ! సుజాత..."

"ఆమె నా భార్య."

"ప్లీజ్! ఫాలో మీ" అని చెప్పి, డిటెక్టివ్ అరుణ్ కుమార్‌కి ఈ విషయం తెలియజేసే పని టూనాట్ ఫోర్‌కి అప్పగించి, బయల్దేరాడు ఇన్‌స్పెక్టర్ మోహన్‌కుమార్.

అయిదు నిమిషాల్లో పోలీస్ జీపు అడయార్ బీచ్ దగ్గర ఆగింది.

దూరంగా యిసుకలో మనుషుల గుంపు కనిపించింది.

అటువేపు నడిచాడు మోహన్‌కుమార్. మిగిలినవాళ్ళు అనుసరించారు.

జనం చుట్టూ గుమిగూడి వున్నారు.

మళ్ళా తనకు శవమే దర్శనమిస్తుందని అర్థమైంది మోహన్‌కుమార్‌కి.

జనాన్ని తప్పించుకుని లోపలకు వెళ్ళాడు ఇన్‌స్పెక్టర్ మోహన్‌కుమార్.

కళ్ళు తిరిగినట్టయింది.

ఇసుకలో వెల్లకిలా ఓ స్త్రీ శవం!

మూడుచోట్ల కత్తిపోట్లు!!

మొహాళ్ళదాకా లంగా లేచిపోయి, తొడలు సన్నగా కనిపిస్తున్నాయి. బ్రాసరీలోంచి వక్షోజాలు అర్ధనగ్నంగా కనిపిస్తున్నాయి. బుగ్గలమీద పంటిగాట్లు స్పష్టంగా వున్నాయి.

ఇన్ స్పెక్టర్ మోహన్ కుమార్ భుజం మీదనుంచి యిసకలోనికి చూసాడు ప్రభాకర్.

వెనువెంటనే పిచ్చివాడిలా అరిచాడు.

"ఇన్ స్పెక్టర్! యీమే... యీమె నా భార్య."

మోహన్ కుమార్ అతని భుజంమీద చెయ్యివేసి ఓదార్పుగా గట్టిగా నొక్కి, రొటీన్ డ్యూటీలో పడ్డాడు.

పది నిముషాల్లో పోలీస్ డాక్టర్, ఫొటోగ్రాఫర్ అతని ముందు ప్రత్యక్షమయ్యారు.

డిటెక్టివ్ అరుణ్ కుమార్ కూడా ఆ సమయానికే చేరుకున్నాడు.

'అయిదో హత్య' అనుకున్నాడు డిటెక్టివ్ అరుణ్ కుమార్ శవాన్ని చూస్తూనే.

శవం ముందు నిలబడి పరీక్షగా చూసేడు అరుణ్ కుమార్. హతురాలి కళ్ళల్లో ఆశ్చర్యం స్పష్టంగా కనిపిస్తోంది. దాన్నిబట్టి హంతకుడు ఆమెకు తెలిసినవాడై వుండాలి. శరీరంమీద అక్కడక్కడ రక్కులు కనిపించాయి. హతురాలికీ, హంతకుడికీ మధ్య పెనుగులాట లాంటిది జరిగిందని స్పష్టమౌతుంది.

హంతకుడికి సంబంధించిన ఆధారాలేమైనా దొరుకుతాయేమోనని చుట్టుప్రక్కల వెదికి చూసాడు. అతని ప్రయత్నం ఫలించలేదు.

"డాక్టర్! మీ పని కానివ్వండి."

అరుణ్‌కుమార్ మాట పూర్తి కాకముందే పోలీస్ డాక్టర్ పనిలో నిమగ్నుడైనాడు.

"రాత్రి రెండు గంటల తర్వాత, అయిదు గంటల లోపల మరణం సంభవించింది."

"వాట్! అయిదు గంటలకు ముందా?"

"అవును. అంతేగాకుండా హత్యచేసేముందు ఈ మెను ఒక వ్యక్తి నాలుగుసార్లు అనుభవించడంగాని, లేక నలుగురు వ్యక్తులు అనుభవించడంగాని జరిగింది." అనేసి అతను తన డ్యూటీలో పడ్డాడు.

'మళ్ళీ హంతకుడు ఫూల్ చేసాడు. రాత్రెప్పుడో చంపేసి, ఉదయం తొమ్మిది గంటలకు తనకు ఫోన్ చేసాడు. ఈ మర్డర్స్ మిస్టరీ ఏమిటో అంతుబట్టలేదు ఇన్‌స్పెక్టర్ మోహన్‌కుమార్‌కి.

డిటెక్టివ్ అరుణ్‌కుమార్ కోసం చూసేడతను. ప్రభాకర్‌తో మాట్లాడుతూ కన్పించాడు అరుణ్‌కుమార్. అటువేపు నడిచాడు. అంతవరకూ ప్రభాకర్ ఏడ్చినట్లుంది.

అతని కళ్ళు ఎర్రబారాయి.

"మీ భార్యను చంపేంత కక్ష ఎవరికేనా ఉందేమో చెప్పగలరా?" అని అడిగాడు ప్రభాకర్‌ని డిటెక్టివ్ అరుణ్‌కుమార్.

"ఆమెను ఎవరో అనుభవించారు. ఇది కక్షగట్టి చేసిన పనే" అన్నాడు మళ్ళీ.

అతను ఆలోచించాడు.

"ప్రతాప్! ప్రతాప్ ఇలా చేసే అవకాశముంది."

ఇన్‌స్పెక్టర్ మోహన్‌కుమార్ ఆ పేరు వింటూనే అదిరిపడ్డాడు.

"కల్పనా ప్రొడక్టివ్ కంపెనీలో పనిచేస్తున్న ప్రతాపా?"

"అవును అతనే!"

"అరుణ్ కుమార్! ఈ ప్రతాప్ మొదట హత్య చేయబడిన నరేంద్రతో ఆ రోజు పార్టీలో పాల్గొన్నాడు. ఆ విషయం నరేంద్ర డైరీలో రాసి వుంది" అని తిరిగి చెప్పాడు ఇన్‌స్పెక్టర్ మోహన్ కుమార్.

"ప్రతాప్ మీ భార్యను అనుభవించి, హత్య చేసేంత బలమైన కారణమేమిటో చెప్పగలరా?" అని అడిగాడు అరుణ్ కుమార్.

"అతను సుజాతను గాఢంగా ప్రేమించాడు... కాని సుజాత నన్ను పెళ్ళి చేసుకుంది."

"ఐ. సీ" అంటూ తల పంకించాడు డిటెక్టివ్ అరుణ్ కుమార్.

# 8

డాక్టర్ చంద్రశేఖర్ నర్సింగ్ హోం ముందు ఆగింది ఒక ఫియట్ కారు.

అందులోనుంచి ఓ వ్యక్తి దిగాడు. అతను ముస్లిమ్‌లా వున్నాడు.

సన్నగా, పొడుగ్గా వున్నాడు. పైజామా, షర్వానీ, పిల్లిగడ్డం, తురకవాళ్ళ టోపీ, గిల్టు ఫ్రేమున్న కళ్ళద్దాలు ఫ్రెంచ్ కట్ మీసాలు.

అతను కారు దిగి చుట్టూ చూశాడు.

ఇద్దరు వ్యక్తులు మాట్లాడుకుంటూ కనిపించారు.

ఒకతను — సుమారు ఆరడుగుల ఎత్తు వున్నాడు. ఫెల్టు హేట్ అతని ముఖాన్ని సగానికి పైగా దాచేస్తోంది. అతనికి ప్రక్కనే మోటారుసైకిల్ స్టాండ్ వేసి వుంది.

రెండవ వ్యక్తితో మాట్లాడుతూ ఫియట్ కారువేపు చూస్తున్నాడన్న విషయం గ్రహించాడు ముస్లిమ్‌వ్యక్తి.

రెండవమనిషి—అతనికి యేభైయేళ్ళుంటాయి. తల నెరిసింది. అయినా మొహంలో ముడతలు కనిపించడం లేదు. మిలటరీలో పనిచేసినవాడిలా దృఢంగావున్నాడు. టక్ చేశాడు. లాంగ్ కోటు వేశాడు. కాని గుండీలు పెట్టుకోలేదు. నోట్లో పైపు వెలుగుతోంది. మీసాలు పెట్టుడు మీసాల్లా బొద్దుగా వున్నాయి. చేతికర్ర ఆసరాతో నిలబడి, ఫెల్ట్ హేట్ వ్యక్తితో మాట్లాడుతున్నాడు.

ముస్లిమ్ తల పంకించి, నర్సింగ్ హోం లోపల ప్రవేశించాడు.

డాక్టరు చంద్రశేఖర్ మంచి హస్తవాసియైన వైద్యుడయినందువల్ల నర్సింగ్ హోమ్ పేషెంట్లతో నిండి వుంటుంది ఎప్పుడూ. డాక్టర్ చంద్రశేఖర్ రోగులను పరీక్షిస్తున్నాడు.

"డాక్టర్!" ఆందోళనగా పిలిచాడు ఫియెట్ కారులోంచి దిగిన ముస్లిమ్.

పేషెంటుకి యింజక్షన్ యిస్తున్న డాక్టర్ చంద్రశేఖర్ రోగి చెయ్యి పట్టుకునే వెనుతిరిగి చూశాడు.

ఎదురుగా ఓ ముస్లిమ్ యువకుడు!

అతను ఎందుకో ఆందోళనపడుతున్నాడని గ్రహించి "ఎవరు మీరు? ఏం జరిగింది?" అని అడిగాడు డాక్టర్ చంద్రశేఖర్, పేషెంటుకి యింజక్షన్ యివ్వడం పూర్తి చేసి, సిరంజిని వేడినీళ్ళలో క్లీన్ చేస్తూ.

"డాక్టర్ మా ఫాదర్ మరణదశలో వున్నారు. మీరు అర్జంటుగా వచ్చి మా ఫాదర్ని కాపాడాలి',

అతని గొంతులో దుఃఖం పెల్లుబికింది.

"ఎక్కడున్నారు మీ ఫాదర్? బయట కార్లో వున్నారా?"

"లేదు. మీరు మా యింటికి రావాలి."

"మీ పేరు?"

"ఏస్సార్ హుస్సేన్."

"చూడండి హుస్సేన్ గారూ! నాకోసం యెందరో పేషెంట్స్ కాచుకూర్చున్నారో నేను చెప్పకుండానే మీకు తెలుస్తోంది. వీళ్ళ పని చూసి, అందర్నీ పంపించాక, నేను రౌండ్స్‌కి వెళ్ళాలి. కనుక, బయటికి వెళ్ళి పేషెంట్సుని చూడ్డానికి నాకు టైముండదు. మీరు మరోలా భావించకుండా యింకో డాక్టర్‌ని పిలుచుకు వెళ్ళండి" అన్నాడు మరో పేషెంటుని రమ్మని కళ్ళతో సైగ చేస్తూ.

ఏస్సార్ హుస్సేన్ మొహంలో దిగులు ఆవరించింది. అతను ఒక్కసారిగా నిరుత్సాహపడ్డాడు. డాక్టర్ చంద్రశేఖర్ అలా చెప్పేసరికి అతను కంగారుపడ్డాడు.

"డాక్టర్! అలా చెప్పకండి డాక్టర్! నా తండ్రి చావు బ్రతుకుల్లో వున్నాడు. ఈ వూళ్ళో మిమ్మల్ని మించిన డాక్టర్లెవ్వరూ లేరు. మీరు కాకుంటే నా తండ్రిని యింకెవరూ బ్రతికించలేరు. నాకున్నది తండ్రి మాత్రమే. నన్ను ఒంటరిని చేయకండి డాక్టర్!" అతని గొంతు గద్గదమైంది.

"హుస్సేన్ గారూ! మీ ఫాదర్‌కి అంత సీరియస్‌గా వున్నప్పుడు యిక్కడికి తెచ్చివుంటే బాగుండేది."

"లేదు డాక్టర్! ఆయన మంచంమీదనుంచి కదిలే స్థితిలో లేరు డాక్టర్! మా ఫాదర్ ప్రాణాలకంటే

నాకు డబ్బు ముఖ్యంకాదు. మీరుగనుక వచ్చినపక్షంలో వెయ్యి రూపాయలు ఫీజు చెల్లించడానికి నేను సిద్ధం" అంటూనే అతను జేబులో చెయ్యిపెట్టి డబ్బు తీశాడు.

"డాక్టర్! ప్రస్తుతం యీ డబ్బు వుంది. మిగిలింది యింటిదగ్గర యిస్తాను. నా బాధను ఆందోళనను అర్థం చేసుకోండి..."

డాక్టర్ చంద్రశేఖర్ సందేహించాడు.

"సందేహించకండి డాక్టర్! నా కార్లో తీసుకువెళ్ళి మళ్ళీ అరగంటలో యిక్కడ మిమ్మల్ని డ్రాప్ చేసి వెళతాను."

డాక్టర్ చంద్రశేఖర్ క్షణం ఆలోచించాడు. ఒకే ఒక కేసు. వెయ్యి రూపాయలు. డబ్బు అతని కళ్ళ ముందు కదలింది. అతని వెంట వెళ్ళడానికే నిశ్చయించు కున్నాడు.

ఏన్సర్ హూస్టన్ యిచ్చిన డబ్బు జేబులో పడేసుకుని "నర్స్" అని పిలిచాడు.

"ఎస్ డాక్టర్!" అంటూ నర్సు అతనిముందు ప్రత్యక్ష మైంది.

"నేను అర్జంటు కేసు చూడ్డానికి యీయనవెంట వెళు తున్నాను. ఈ వేళకి బయట పేషెంట్సు విషయం నువ్వు చూడాలి. కొత్త కేసులుంటే నేను వచ్చి చూస్తాను. ఆ తర్వాతే రౌండ్స్‌కి బయల్దేరదాం."

"ఓ. కే. డాక్టర్" అంది నర్స్.

డాక్టర్ చంద్రశేఖర్ మెడిసన్ చెస్ట్‌లో తనకు కావలసిన మందులు సర్దుకున్నాడు.

ఏన్సర్ హూస్టన్ అతని చేతిలో మెడిసన్ చెస్ట్ అందు కుని బయటికి దారితీశాడు.

డాక్టర్ చంద్రశేఖర్ అతన్ని అనుసరించాడు.

డాక్టర్ చంద్రశేఖర్ నర్సింగ్ హోమ్ బయటవున్న ఫియెట్ కారు బాక్ డోర్ తెరిచి కూర్చున్నాడు. ఏన్సర్ హుస్సేన్ డ్రైవింగ్ సీట్లో కూర్చోబోతూ యింతకు ముందు కనిపించిన లాంగ్ కోటు, ఫెల్ట్ హేటు వ్యక్తుల కోసం చూశాడు. చెట్టుక్రింద మోటార్ సైకిలుమీద కూర్చుని సిగరెట్ కాలుస్తూ కనిపించాడు. అతని ప్రక్కని ఉండవలసిన లాంగ్ కోటు మనిషి కనిపించ లేదు. ఫెల్ట్ హేట్ వ్యక్తి సిగరెట్టు కాలుస్తూ శూన్యం లోకి చూస్తున్నాడు.

ఏన్సర్ హుస్సేన్ కారులో కూర్చుని స్టార్టు చేశాడు.

వింటినుంచి వెలువడిన బాణంలా, అడ్డం వచ్చిన జనాన్ని చెల్లాచెదరుచేస్తూ రోడ్డుమీద దూసుకుపోతోంది ఏన్సర్ హుస్సేన్ ఫియెట్ కారు.

ఆరున్నర కావస్తూంది.

నగరమంతా విద్యుద్దీపాల వెలుగుతో నిండివుంది. కాని వేసవికావడంవలన యింకా చీకటిపడలేదు.

రోడ్డును మింగేస్తూ పరుగులెడుతోంది ఫియట్ కారు. ఏన్సర్ హుస్సేన్ చేతిలో స్టీరింగ్ మెలికలు తిరగ సాగింది.

అవతల పేషెంటు పరిస్థితి సీరియస్ గా వుండబట్టే హుస్సేన్ అంత రాష్ గా డ్రైవ్ చేస్తున్నాడని అర్థం చేసుకున్నాడు డాక్టర్ చంద్రశేఖర్.

సముద్రపు అలలవలె ఉవ్వెత్తున లేచిపడుతున్నాయి హుస్సేన్ మస్తిష్కంలోని ఆలోచనలు.

ఎవరీ ఫెల్ట్ హేట్ వ్యక్తి? ఉన్నట్టుండి లాంగ్ కోటు వ్యక్తి ఎందుకు మాయమయ్యాడు?

ఈ ఆగంతకు లెవ్వరు? తన కారు వేపు ఎందుకు దొంగ తనంగా చూడసాగారు? తనకేదైనా చేయబోతు న్నారా? తను అపాయంలో చిక్కుకోబోతున్నాడా?

ఆలోచనలు మస్తిష్కాన్ని వేడెక్కిస్తున్నయ్.

అప్రయత్నంగా హుస్సేన్ దృష్టి రియర్ వ్యూ పైన బడింది.

వెంటనే అదిరిపడ్డాడు.

ఫెల్ట్ హేట్ వ్యక్తి!

మోటారు సైకిల్ మీద వెంటాడుతున్నాడు.

ఏస్సార్ హుస్సేన్ గుండెలు దడదడలాడాయి.

పళ్ళు కొరికాడు. అతనిలో ఏదో పట్టుదల పొడ సూపింది. ఆవేశంగా ఏక్సిలేటర్ని అదిమాడు. కారు గాలితో పోటీపడసాగింది. కారుకీ, మోటార్ సైకిలుకీ మధ్యదూరం పెరగసాగింది. కసిగా నవ్వుకున్నాడు. సంతృప్తి అతని మొహం నాట్యమాడింది.

చకచకా ఆలోచించసాగాడు ఏస్సార్ హుస్సేన్.

అతనెందుకు వెంటాడుతున్నాడు? లాంగ్ కోటువ్యక్తి తనను వెంటాడేందుకు యితన్ని నియమించి తను తప్పు కున్నాడా? అతని ఉద్దేశం ఏమిటి?

ఉలిక్కిపడ్డాడు హుస్సేన్.

మళ్ళీ రియర్ వ్యూలో ప్రత్యక్షమైంది మోటారు సైకిల్.

కారుకీ, మోటారు సైకిల్ కీ మధ్యదూరం తరిగిపోసా గింది. క్రమంగా దాని వేగం పెరుగుతోంది.

మోటారు సైకిల్ బారినుండి తప్పించుకోవాలి! ఎలా?

కారుకంటే వేగంగా ఆలోచనలు కదిలిపోతు న్నాయ్.

క్షణంలో అతని ఆలోచనలు రూపం దాల్చి నట్టయింది.

వెంటబడుతున్న మోటారుసైకిల్ రేంజిలోనుండి మాయమవ్వడమే యిప్పుడతని లక్ష్యం!

అంతే! కారు వేగాన్నందుకుంది. స్టీరింగ్ అనూ హ్యంగా మెలికలు తిరగసాగింది. చూస్తుండగానే నాలుగైదు మలుపులు తిరిగి మళ్ళీ మెయిన్‌రోడ్‌లో ప్రత్యక్షమైంది కారు.

డాక్టర్ చంద్రశేఖర్ వెయ్యి రూపాయల లోకంలో పడిపోయాడు. అతని కళ్ళముందు వెయ్యిరూపాయలు నాట్యమాడసాగాయి. అతనికి జరుగుతున్నదేదీ తెలి యడంలేదు.

కారు సిటీ లిమిట్స్ దాటిపోయింది.

"మిస్టర్ హుస్సేన్! కారు ఊరు దాటిపోయింది. నన్నెక్కడికి తీసికెళుతున్నావ్?" అరిచాడు డాక్టర్ చంద్రశేఖర్.

అతని అరుపును విననట్లు మౌనంగా వుండిపోయాడు ఏన్సర్ హుస్సేన్.

హుస్సేన్ డ్రైవింగ్ చేస్తూనే వెనక్కి తిరిగిచూశాడు మోటారుసైకిల్ కోసం.

ఫెల్ట్ హేటు వ్యక్తి యెక్కడా పత్తాలేదు. కను చూపు మేరలో మోటారుసైకిల్ కనిపించలేదు.

అతని పెదవులమీద చిరు దరహాసం మెరిసింది.

"మాట్లాడవేం హుస్సేన్? నన్నెక్కడికి తీసుకెళు తున్నావ్?" అయోమయంగా అడిగాడు.

"తొందరల్లోనే తెలుస్తుంది. అందాకా నోర్మూసు కోండి డాక్టర్" అన్నాడు కటువుగా.

ఈసారి అతని గొంతు మారింది.

ఆ గొంతు ఎక్కడో విన్నట్టనిపించింది డాక్టర్ చంద్రశేఖర్ కి.

"నువ్వు... నువ్వు ..ప్ర..."

డ్రైవింగ్ చేస్తూనే అతను నోటిమీదికి చెయ్యి విసిరాడు ఏన్సర్ హాంస్టన్. అంతే! అతని నోరు మూతబడింది.

"నువ్వు గ్రహిస్తావని తెలుసు. కాని నోర్మూసుకు పడుండు" గదమాయించాడు.

డాక్టరు చంద్రశేఖర్ మూతిమీద తగిలిన దెబ్బను తడుముకుని, అయోమయంగా చూశాడతన్ని.

వూరికి దూరంగా ఓ చిన్న యింటిముందు ఆగింది ఫియెట్ కారు.

ఏన్సర్ హాంస్టన్ కారు దిగి బాక్ డోర్ తెరిచాడు. జేబులోంచి పిస్తోలు తీశాడు.

"డాక్టర్! పిచ్చివేషాలు వెయ్యక. నేను చెప్పినట్టుగా విని బుద్ధిగా నడుచుకో. లేకపోతే పిచ్చికుక్కని కాల్చినట్టు కాల్చిపారేస్తాను. దిగండి."

డాక్టర్ చంద్రశేఖర్ కారు దిగి నేలమీద అడుగుపెట్టాడు.

"ముందుకు నడవండి" ఆదేశించాడు.

ముందు డాక్టర్, అతని వెనుక పిస్తోలుతో ఏన్సర్ హాంస్టన్ యింట్లో ప్రవేశించారు. ఇద్దరూ యింట్లో అడుగుపెట్టిన తర్వాత గది తలుపులు దగ్గరగా మూయబడ్డాయి.

# 9

ఫియెట్ కారు డిక్కీ తెరుచుకుని ఓ వ్యక్తి బయటికి దూకి ఆ యింటివేపు చూసి తల పంకించాడు.

ఆ వ్యక్తి యెవరో గాదు—నర్సింగ్ హోమ్‌దగ్గర కనిపించి మాయమైన లాంగ్ కోటు వ్యక్తి!

చటుక్కున అతని జేబునుంచి ట్రాన్స్‌మీటర్ బయటికి వచ్చింది. తను ఎక్కడున్నదీ తెలియజేసి ట్రాన్స్‌మీటర్ని తిరిగి జేబులో పడేసుకున్నాడు.

జేబులోంచి సిగరెట్టు తీసి వెలిగించుకున్నాడు.

చకచకా అయిదు నిముషాలు దొర్లిపోయాయి.

లోపలకెళ్ళిన మనుషులు యింకా తిరిగి రాలేదు. ఏం చేస్తున్నారు? ఒకవేళ లోపల అతన్ని...? ఆ ఆలోచన రాగానే శరీరం చమటలు పట్టినట్లయింది.

ఆలోచించి, అంతలోనే ఒక నిర్ణయానికి వచ్చి కోటు జేబులోవున్న పిస్తోల్ని తడిమి చూసుకుని అటువేపు అడుగులేశాడు.

లోపల్నుంచి మాటలు వినిపిస్తున్నాయి.

మెల్లగా తలుపులు నెట్టాడు.

"నేను నీకేం అపకారం చేశాను?" అది డాక్టర్ చంద్రశేఖర్ గొంతు.

అతను నవ్వాడు. 'ఏం చేయలే'దన్నాడు నవ్వాపి.

"మరయితే నన్నెందుకు తీసుకువచ్చావ్?"

"హత్య చేయడానికి!" తేలిగ్గా అన్నాడు.

"హత్యా! మైగాడ్! నిజంగానా?"

"నిజమే."

లాంగ్ కోటు వ్యక్తి తలుపుల్ని మరికొంచెం నెట్టాడు. ఇప్పుడు ఏన్సర్ హౌస్సేన్ చేయి, ఆ చేతిలో వున్న

పిస్తోలు, డాక్టర్ చంద్రశేఖర్ క్లియర్ గా కనిపిస్తున్నయ్.

"అయితే హత్య చేసేవాడివి దార్లోనే ఎక్కడో చంపేయక, యింతదాకా తీసుకువచ్చావేం?" కొద్దికొద్దిగా తెరుచుకుంటున్న తలుపుల్ని గమనించాడు డాక్టర్ చంద్రశేఖర్. తలుపు చాటున నిలబడిన వ్యక్తికూడా అతనికూడా అతనికి కనిపించాడు. అతనిలో ఇప్పుడు కొంచెం ధైర్యం ప్రవేశించింది.

ఏన్సర్ హుస్సేన్ గట్టిగా నవ్వాడు.

"పోలీసుల కళ్లలో మస్కా కొట్టడానికి! నిన్ను ఇప్పుడే చంపి, నీ శవాన్ని తెల్లవారేవరకూ యిక్కడే వుంచుతాను. ఆ తర్వాత నీ శవాన్ని ఏ రోడ్డుమీదో వదిలిపెడతాను. వదిలిపెడుతూ నీ పేరుతో 'నన్ను రక్షించండి.' అంటూ పోలీసులకి ఫోన్ చేస్తాను. వాళ్లు వచ్చేసరికి నీ శవం కనిపిస్తుంది. వాళ్ళు ఫోన్ చేయడానికి కొన్ని గంటల ముందే నువ్వు చనిపోయావని పోస్ట్ మార్టమ్‌లో తేలుతుంది. ఈ మిస్టరీని ఛేదించలేక వాళ్ళు తలలు బద్దలుకొట్టుకు చస్తారు." మరోసారి నవ్వాడు.

"అయితే నేను చావక తప్పదా?" భయం నటిస్తూ అన్నాడు డాక్టర్ చంద్రశేఖర్.

"అవును ఆఖరిసారిగా దైవాన్ని తలుచుకో" పిస్తోల్ని అతని గుండెలకు గురిపెడుతూ అన్నాడు.

చటుక్కున జేబులోంచి పిస్తోలు తీశాడు లాంగ్ కోటు వ్యక్తి. గురిచూశాడు.

'ఢాం!' మని పేలింది.

అతని గురి తప్పలేదు. ఏన్సర్ హుస్సేన్ చేతిలోని పిస్తోలు మూలకి ఎగిరిపడింది.

అతని చేతినుండి రక్తం కారుతుంది. వెనక్కి తిరిగి

చూసాడు.

ఎదురుగా లాంగ్ కోటు వ్యక్తి.

అదిరిపడ్డాడు అతన్ని చూస్తూనే. అతను తన ఉనికిని ఎలా కనిపెట్టగలిగాడో అర్థంకాలేదు ఏన్సర్ హుస్సేన్ కి.

ఇంతలో ఫియట్ కారు ప్రక్కనే పోలీస్ జీపు ఆగింది. పోలీసులు బిలబిలమంటూ జీపులోనుంచి క్రిందికి దూకారు. ఏన్సర్ హుస్సేన్ పారిపోయే ప్రయత్నం చేయలేదు. అతనిలో అతను నవ్వుకున్నాడు పిచ్చివాడిలా. పిల్లిగడ్డం తీసి మూలకు విసిరేసాడు. టోపీ నేలనాకర్షించింది. అతని వేషం బయటపడింది.

అతను ప్రతాప్!

ఏన్సర్ హుస్సేన్ — కాదు — ప్రతాప్ చేతులకు సంకెళ్ళు పడ్డాయి.

# 10

"చెప్పు. ఈ హత్యలు ఎందుకు చేశావ్?" ప్రశ్నించాడు డిటెక్టివ్ అరుణ్ కుమార్ సీరియస్ గా.

ఇన్ స్పెక్టర్ మోహన్ కుమార్ కుర్చీలో కూర్చున్నాడు మౌనంగా.

'ఈ కేసు వలన తనకు ప్రమోషన్ ఖాయం' అని అనుకుంటున్నాడతను.

"మిస్టర్! ఆస్తి వుంది. చదువు వుంది. అన్నీ వుండి, ఎందుచేత ఈ హత్యలు చేసారు? హతులమీద మీకు ఏమైనా పగవుందా? నిజం చెప్పండి. మీ రెలాగూ ఉరి శిక్ష అనుభవించక తప్పదు. చనిపోయే ముందయినా నిజం చెప్పడం మంచిది .." గంభీరంగా అన్నాడు డిటెక్టివ్ అరుణ్ కుమార్.

మెల్లగా తలెత్తాడు ప్రతాప్.

అతని ముఖంలో యిప్పుడేం భావాలు లేవు. తుఫాన్ వచ్చి వెళ్ళిపోయిన తరువాత వున్నంత ప్రశాంతంగా వుంది ప్రతాప్ ముఖం.

"చెబుతాను సార్! తప్పకుండా చెబుతాను" అంటూ చెప్పడం ప్రారంభించాడు.

"నాది చాలా విచిత్రమైన మనస్తత్వం. నా తత్వం ఏమిటో నాకే అర్థంకాదు. ఊహ తెలిసినప్పట్నుంచీ అందర్నీ ఏడిపించాలని, ఎవరినైనా చిత్తుగా తన్నాలని, చంపేయాలని వింత వింతగా ఆలోచించేవాణ్ని. కాని అలా చెయ్యడానికి ధైర్యం చాలేదికాదు. నన్ను చాలా కట్టుదిట్టంలో పెంచినందువలన, చట్టం శిక్షిస్తుందన్న భయవల్ల నా కోరికలను బలవంతాన అణచిపెట్టు కున్నాను."

చెప్పడం ఆపి అరుణ్ కుమార్ వేపు చూశాడు.

ఇన్స్పెక్టర్ మోహన్ కుమార్ తన ప్రమోషన్ గురించి ఆలోచనల్ని పారద్రోలి ప్రతాప్ మాటల్ని యింట్రెస్ట్ గా వింటున్నాడు.

"ప్రొసీడ్!..." అన్నాడు అరుణ్ కుమార్.

"తాతలు సంపాయించిన ఆస్తి తరగనంత వుంది. పది రోజుల క్రిందట నేను రక్తాన్ని వాంతి చేసుకున్నాను. చాలా భయం కలిగింది. నాకు తెలిసిన డాక్టరు దగ్గరికి వెళ్ళి జరిగింది చెప్పాను. ఆ డాక్టరే చంద్రశేఖర్ గారు.

అతను ఏవేవో టెస్టులు చేసి, ఎక్స్ రేలు తీసి నేను మరో నెలరోజులుకన్నా ఎక్కువ బ్రతకనని ఖచ్చితంగా చెప్పాడు. నాకు మతిపోయింది. నమ్మలేకపోయాను.

అనుకోకుండా జ్యోతిష్కుడ్ని కలిశాను. నా చెయ్యి చూసి జోస్యం చెప్పడానికి నిరాకరించాడు. భయంకర

మైన నిజాల్ని సాధారణంగా జ్యోతిష్కులు చెప్పరు. జ్యోతిష్యంద్వారా జ్యోతిష్కుడుకూడా నా మరణ సమయాన్ని కనుక్కొన్నాడు. అందుకే ఆ భయంకర నిజాన్ని తాను చెప్పలేక జోస్యం చెప్పను పొమ్మన్నాడు.

దాంతో నా చావు ఖాయం అని నిర్ధారణ అయిపోయింది.

అయినా చావంటే భయంలేదు నాకు. కాని, నా కోరిక...చిన్నప్పట్నుండి దాచుకున్న కోరికను తీర్చుకోకుండా చనిపోతున్నాననే బాధ ఒక్కటే మిగిలింది. జీవితంలో అన్ని సుఖాలను అనుభవించేను. కాని ఒక్క కోరిక మిగిలివుంది.

చంపాలి! కసిగా ఎందర్నో చంపాలి!! పోలీసుల్ని ముప్పతిప్పలు పెట్టాలి. అదే నా కోరిక.

కోరికలు తీరక చనిపోతే, వాళ్ళు దెయ్యాలవుతారని ంటారు. దెయ్యం కావడం నాకు యిష్టంలేదు. అందుకే నా కోరిక తీర్చుకోవాలి. తీర్చుకుని,తృప్తిగా చనిపోవాలి. ఎలాగూ నెల రోజుల్లో నా చావు ఖాయమైంది. చట్టం నన్ను పట్టుకుని శిక్షించే లోపల నేనెలాగూ చనిపోతాను. ఆ ధైర్యంతోనే నా కోరిక తీర్చుకోవడానికి హత్యలు మొదలుపెట్టాను...'' తాపీగా చెప్పాడు ప్రతాప్.

ప్రతాప్ చెప్పింది విని ఇన్‌స్పెక్టర్ మోహన్‌కుమార్, డిటెక్టివ్ అరుణ్‌కుమార్ నిర్ఘాంతపోయారు.

''మర్డర్ మేనియా!'' అప్రయత్నంగా వెలువడింది వారి నోట్లోనుండి.

—: ఐపోయింది :—

# మృత్యుముఖంలోకి-??

## వసుంధర

తెల్లవారు ఝామున అందరూ మంచి నిద్రలో వుండగా ఎవరో తలుపులు దబదబా బాదారు.

శంకరయ్య విసుగ్గా పక్కలో అటూ ఇటూ కదిలి— "తలుపులంతలా బాదేస్తూంటే ఎవరూ లేచి తియ్యరేమ్రా!" అన్నాడు తలను ముసుగులోంచి బయటకు తియ్యకుండానే.

"రాత్రి పనులన్నీ పూర్తి చేసుకుని పడుకునేసరికి ఒళ్ళు హూనమైపోయింది. ఎనిమిదిన్నరకే పక్కెక్కారు. మీరే లేచి తియ్యకూడదూ-ముసుగులోంచి కేకలెయ్యక పోతే!" అంది శంకరయ్య భార్య కామాక్షమ్మ.

పిల్లలు ముగ్గురూ ముసుగుల్లోంచి కదలనైనా కదలలేదు. ఏమాత్రం చలనం కలిగినా తమను లేచి తలుపులు తియ్యమంటారేమోనని భయపడి బిగుసుకుపోయి మరీ పడుకున్నారు.

శంకరయ్యకు ఇద్దరబ్బాయిలూ ఒక అమ్మాయీ. పెద్ద

వాడికీరవై నిండాయి. ఎమ్మే చదువుతున్నాడు. రెండో సంతానం ఆడపిల్ల. అప్సరసలా వుంటుంది. పదిహేడేళ్ళొం టాయి. కాలేజీలో చదువుతోంది. మూడోవాడికి పది హేనేళ్ళు. ఆఖరివాడు కావడం కారణంగా గారంపాలు కూడా ఎక్కువే. హైస్కూల్లో చదువుతున్నాడు.

మళ్ళీ తలుపులు దబదబా మ్రోగాయి.

"ఎవరికి తప్పినా నాకు తప్పదుగదా. భగవంతుడా— ఆడపుట్టుక కెన్ని కష్టాలు రాసిపెట్టావు తండ్రీ—" అంటూ వెళ్ళి తలుపు తీసింది కామాక్షమ్మ. అవతల నిల బడ్డ వ్యక్తిని చూసి—"నువ్వా నాయనా—రా లోపలికి రా!" అంది. తర్వాత—"ఏమండీ గోపీ వచ్చాడు..." అంటూ ఓ కేక పెట్టింది.

వచ్చినవాడు గోపి - శంకరయ్యకు స్వయానా చెల్లెం కొడుకు. శంకరయ్య పెద్దకొడుకు రవికంటే ఒక సంవత్సరలి పెద్ద. అతనూ ఎమ్మేయే చదువుతున్నాడు. తన కూతురు రమ కతను ఈడూజోడూగా వుంటాడని శంకరయ్య భావిస్తున్నాడు-అ కారణంగా గోపీకా ఇంట్లో ఎప్పుడూ అల్లుడి మర్యాదలు జరుగుతుంటాయి.

శంకరయ్య చటుక్కున నిద్రలేచాడు. చకచకా అక్కడికి వచ్చి గోపీని పలకరించాడు.

రమకూడా మెలకువగా వుందనే అనుకోవాలి. గోపీ వచ్చాడని కామాక్షమ్మ కేక పెట్టగానే ఆమె చటుక్కున లేచి దొడ్లోకి పరుగెట్టింది. బావకు నిద్రముఖంలో కన బడడం ఆమె కిష్టంలేదు. ఫ్రెష్‌గా కనబడడంకోసం ఆమె ముఖ ప్రక్షాళనం ఆరంభించింది.

గోపీ రాక వినికూడా ఆట్టే చలించనివారు—రవి, అతని తమ్ముడు రాము.

"అర్జంటు పనిమీద వచ్చాను. రవిని లేపండి_" అన్నాడు గోపీ.

"ఏమిటా కంగారు!?" అలా కూర్చో. ఆయన మాట్లాడు తూంటారు. నేను కాఫీ పడేస్తాను" అంటూ అక్కణ్ణించి వెళ్ళిపోయింది కామాక్షమ్మ.

గోపీ అసహనంగా కూర్చుని__"చాలా అర్జంటు పని. ముందు రవిని లేపండి. ఇంకో గంటలో వెళ్ళిపోవాలి..." అన్నాడు.

"ఏమిటా అర్జంటు పని?" అన్నాడు శంకరయ్య.

"రవీ నేనూ కలిసి చిన్న బిజినెస్ ప్రారంభించాలనుకున్నాం. దానికి సంబంధించి విజయవాడలో ఒక పెద్ద మనిషిని కలుసుకుని మాట్లాడాలి. ఈరోజు వెళ్ళకపోతే ఆయన మళ్ళీ దొరకడు. వ్యవహారమంతా అప్సెట్ అయిపోతుంది" అన్నాడు గోపీ.

శంకరయ్య ఆశ్చర్యంగా - "ఈ సంగతి రవి నాకెప్పుడూ చెప్పలేదే" అన్నాడు.

"నేనే వద్దని చెప్పాను. ఇప్పుడు వ్యవహారం ఓకొలిక్కి వచ్చింది కాబట్టి మీకు చెబుతున్నాను. మేము నిజంగానే బిజినెస్ ప్రారంభిస్తాం. మిగతా వివరాలు విజయవాడనుంచి తిరిగి వచ్చేక చెబుతాను..." అన్నాడు గోపీ.

ఈలోగా అతను మరోసారి టైము చూసుకున్నాడు.

"అసలెప్పుడూ పెందరాళే లేస్తాడు. నిన్న బ్రహ్మాండమైన వానపడి వాతావరణం చల్లబడిపోయింది. చలికి మెలకువరాలేదు. లేకపోతే ఈ వేసవికాలంలో ఇంతసేపు నిద్రపోవడం వాడికెప్పుడూ అలవాటు లేదు" అంటూ శంకరయ్య అక్కణ్ణించి రవిని తట్టి_"గోపీ వచ్చి ఏదో బిజినెస్ పనిమీద అర్జంటుగా విజయవాడ

వెళ్ళాలంటున్నాడు. శే బాబూ'' అన్నాడు. గోపీ పేరుతో బిజినెస్ అన్న పదం జతపడగానే రవి నటు పక్కన లేచి కూర్చున్నాడు.

## 2

శంకరయ్య ఆఫీసుకు వెళ్ళి సీట్లో కూర్చోగానే— డిస్పాచ్ క్లర్క్ వచ్చి "చిన్న పొరపాటైపోయిందండి" అన్నాడు.

"పొరపాట్లు చేయడం నీకు మామూలేగా" అన్నాడు శంకరయ్య.

"మీరు పొరబడ్డారండి. ఇంతవరకూ నావల్ల ఒక్క పొరపాటుకూడా జరగలేదండి. అలవాటుగా పొరపాటు చేసేది నా పక్క సీట్లో అతనండి" అంటూ డిస్పాచ్ క్లర్క్ శంకరయ్యకు అతని పొరపాటు తెలియజేశాడు.

"పోనీలే. ఇంతవరకూ జరక్కపోయినా ఇప్పుడు జరిగిందిగా. జరిగిందేమిటో చెప్పూ'' అన్నాడు శంకరయ్య.

"ఇప్పుడుకూడా పొరపాటు నావల్ల జరగలేదండి. నా పక్క సీట్లో అతను మీ దగ్గరకు రావడానికి భయపడి నన్ను పంపాడండి."

శంకరయ్య చిరాగ్గా చూసి "సరేలే. అసలు సంగతి చెప్పూ?'' అన్నాడు.

"పొరపాటంటే పెద్ద పొరపాటేం కాదండి. అది మీరే చేసివుంటే దానికి పొరపాటనే పేరుండేది కాదు. అతను చేశాడు కాబట్టి అది పొరపాటయింది. మీకు వచ్చిన ఉత్తరమొకటి రెండుసార్లో జుల్లించి అతనిదగ్గర చిక్కడిపోయింది. మీ కివ్వాలనుకుంటూనే మరిచి పోతున్నాడు'' అన్నాడు డిస్పాచ్ క్లర్క్.

ఏం చెబుతాడోనని హడలిపోతున్న శంకరయ్య తేలిగ్గా నిట్టూర్చి "ఇంతేకదా—ఏదీ ఆ ఉత్తరం!" అన్నాడు.

"మీరు శాంతంగా ఉన్నట్లయితే నా పక్క సీట్లో అతను తనే స్వయంగా తీసుకువచ్చి ఇద్దామనుకుంటున్నాడండి" అన్నాడు డిస్పాచ్ క్లర్కు.

"చాలా బాగుందయ్యా-త్వరగా తీసుకురమ్మనమను" అన్నాడు శంకరయ్య. డిస్పాచ్ క్లర్కు వెళ్ళిపోయి అతన్ని పంపాడు.

శంకరయ్య సుబ్రమణ్యం దగ్గర్నుంచి ఉత్తరాన్నందుకుని "ఈసారికి క్షమించేస్తున్నాను. ఇలాంటి పొరపాట్లు మళ్ళీ చేయకు" అన్నాడు.

"మీరిలా నన్ను క్షమించేస్తూండడమే అసలు పొరపాటు సార్" అని చెప్పి అక్కణ్ణించి వెళ్ళిపోయాడు సుబ్రమణ్యం.

శంకరయ్య కవరు చింపి లోపలి కాగితాన్ని బయటకు తీశాడు. ఉత్తరం శంకరయ్య చెల్లెలిదగ్గర్నుంచి వచ్చింది. నవ్వుకుంటూ ఉత్తరం మొదలుపెట్టిన శంకరయ్య ఉత్తరం పూర్తి చేసేసరికి చాలా గాబరాగా అయిపోయాడు. ఇప్పుడాయన ముఖంలో చిరునవ్వుకూడా లేదు. ఉత్తరం మరోసారి చదువుకున్నాడాయన.

"ప్రియమైన అన్నయ్యకు నీ చెల్లెలు రత్నం నమస్కరించి వ్రాయునది. ఇక్కడ అంతా క్షేమం. అక్కడ మీరంతా క్షేమమని తలుస్తాను. ఈ ఉత్తరం ఒక అర్జంటు విషయం చెప్పడంకోసం రాస్తున్నాను.

ఇటీవల గోపీ ప్రవర్తన వింతగా వుంటోంది. ఏ కారణంవల్లనో వాడికి మీ రవిమీద విపరీతమైన కక్ష

ఏర్పడిందనిపిస్తోంది. ఎక్కువ వివరాలీ ఉత్తరంలో వ్రాయలేను కానీ— వాడు రవిని హత్య చేయాలని సంకల్పించినట్లు నీకు తెలియపరుస్తున్నాను. నువ్వు రవిని వెయ్యికళ్ళతో కాపాడుకో. ఎప్పుడైనా వచ్చి మాయ మాటలు చెప్పి వాడు రవిని యెక్కడికైనా తీసుకు వెడతానంటే అంగీకరించకు.

ఆ విధంగా నీ కొడుకును నువ్వు రక్షించుకోవడమే కాక— నా కొడుకు హంతకుడు కాకుండా కాపాడిన వాడివవుతావు. ఒక్క రవి విషయంలో తప్పితే మిగతా విషయాల్లో గోపీ ప్రవర్తన సంతృప్తికరంగా ఉంది. ప్రస్తుతానికి ఇంతకుమించి ఏమీ వ్రాయలేను."

రెండోసారి ఉత్తరాన్ని పూర్తిగా చదవలేకపోయాడు శంకరయ్య. ఆయనకు కళ్ళు తిరుగుతున్నట్లనిపించింది. "సుబ్రమణ్యం!" అంటూ ఆయన గర్జించాడు.

# 3

"ఏమిటీవేళ అప్పుడే వచ్చేశారు? ఆఫీసుకి సెలవా?" అంది కామాక్షమ్మ.

"లేదు. నేనే సెలవుపెట్టాను—" అన్నాడు శంకరయ్య.

"ఎందుకు?"

శంకరయ్య ముఖం దీనంగా అయిపోయింది. "రవి గురించి నాకు బెంగగా వుంది" అన్నాడాయన.

కామాక్షమ్మ యేదో గుర్తుకువచ్చినట్లు "అన్నట్లు చెప్పడం మరచిపోయానండీ— మీరాఫీసుకి బయల్దేరిన పది నిముషాలకు గోపీ వచ్చాడు—" అంది.

"గోపీ వచ్చాడా? రవికూడా వచ్చాడా?" అన్నాడు శంకరయ్య ఆత్రుతగా.

"లేదు. బస్సు మిస్సయ్యారుట. ఈలోగా గోపీకింకో పనేదో తగులుకుందిట. అందుకని తర్వాత బస్సుకు రవిని ఒక్కడినీ ఎక్కించి ఆ కబురు మనింటిదగ్గర చెప్పిపోదామని వచ్చాడట. ఎంత బలవంత పెట్టినా ఉండలేదు."

"గోపి ఎలా ఉన్నాడు?" కంగారుగా అడిగాడు శంకరయ్య.

"మామూలుగానే ఉన్నాడండీ...—" అంది కామాక్షమ్మ.

"అన్నీ తర్వాత చెప్తాను. ముందీ ఉత్తరం చదివి తర్వాత గోపీ యెలా ఉన్నాడో చెప్పు" అన్నాడు శంకరయ్య భార్యకు ఉత్తరాన్నందిస్తూ.

కామాక్షమ్మ ఉత్తరం అందుకుని చదివి "అమ్మ బాబోయ్—అయితే వాడు చెప్పినవన్నీ అబద్ధాలేనా?" అంటూ కేక పెట్టింది.

శంకరయ్య భార్యకేసి ఆత్రుతగా చూసి "ఇప్పుడు చెప్పు గోపి ఎలా వున్నాడు? ఏదైనా హత్య చేసివచ్చినట్లు కంగారుగా ఉన్నాడా?"

"అప్పుడలాగనిపించలేదుకానీ ఇప్పుడనిపిస్తోందండీ. వాడు చాలా హడావుడిగా, కంగారుగా, ఆందోళనగా కనపడ్డాడు" అంది కామాక్షమ్మ. ఆమెకు మాటలు సరిగా రావడంలేదు.

శంకరయ్య కుర్చీలో కూలబడి "ఇప్పుడేంచేయాలో పాలుపోవడంలేదు" అన్నాడు.

"పోలీసులకు రిపోర్టిస్తే?"

"ఏమని ఇస్తాం? ఒక వేళ వాడు నిజంగానే విజయవాడ వెళ్ళాడేమో—ఎవరికి తెలుసు?" ప్రస్తుతం ఏం

చేయాలో కూడా నాకు తెలుసు...''

''మీరిలా నీరుగారిపోతే నా కింకా అధైర్యంగా ఉంటుందండీ—ఏదో ఒకటి చేయండి. మన రవికి ఏమీ కాలేదని నాకు ధైర్యం చెప్పండి—...'' అంది కామాక్షమ్మ.

శంకరయ్య జాలిగా భార్యవంక చూసి ''మనం ఈ జన్మలో యెవరికీ అపకారం చేసినవాళ్ళం కాదు. అలాంటప్పుడు మన రవికేదో జరుగుతుందని యెందుకనుకోవాలి? నువ్వేం భయపడకు'' అన్నాడు. పైకి భార్యకు ధైర్యం చెప్పగలిగాడుకానీ లోపల మనసుకు మాత్రం ఆయన యే విధమైన ధైర్యమూ చెప్పుకోలేకపోయాడు.

''ఇప్పుడు మనమేం చేయాలంటారు?''

''గోపీని వెతికి పట్టుకోవాలి...'' అన్నాడు శంకరయ్య.

కామాక్షమ్మ ఆలోచించి ''అన్నట్లు వాడు వెళ్ళే ముందు తను తాజమహల్ హోటల్‌కు వెళతానని చెప్పాడండీ'' అంది.

''ఎందుకట?''

''అడిగినా చెప్పలేదు. తనలో తను గొణుక్కున్నట్లు అన్నాడు.''

శంకరయ్య క్షణంకూడా వృధా చేయలేదు'' ముందు హోటల్‌కు వెళ్ళివస్తాను'' అని అప్పటికప్పుడు రిక్షా బేరమాడి హోటల్‌కు వెళ్ళాడు.

# 4

''మీరు చెప్పిన మనిషి ఈ హోటల్‌కు రావడమే కాదు. ఇందులో మకాం కూడా పెట్టాడు. రూం నంబర్ పద్దెనిమిదిలో ఉంటున్నాడు. అయితే అతని పేరు గోపీ

నాథరావుకాదు. రాజారాం" అన్నాడు తాజమహల్ హోటల్లోని రిసెప్షనిస్టు.

"అతని పేరు రాజారాం కాదు. మారుపేరుతో హోటల్లో మకాం చేయవలసిన అవసరమతనికి లేదు. బహుశా నేనడిగేదొకరిగురించీ మీరు చెప్పేదింకొకరి గురించీ అయుంటుంది" అన్నాడు శంకరయ్య.

"మా హోటల్లో బసచేసిన వారందరికీ ఫోటో తీసి ఉంచడం మా ఆచారం. ఎప్పుడైనా పోలీసు వ్యవహారాలు తగుల్కుంటే ఫోటోలు కొంతవరకూ సాయపడతాయి. మీ రడుగుతున్న గోపీనాథరావూ, మా హోటల్లో వుంటున్న రాజారాం ఒకరవునో కాదో మీరు తెలుసుకో వచ్చు" అంటూ రిసెప్షనిస్టు ఓ పుస్తకం తీశాడు.

అందులో వున్న గోపీ ఫోటోని చూసి శంకరయ్య ఆశ్చర్యపడ్డాడు. ఆయన మనసు పరిపరివిధాల పోయింది. బెంగ అధికమయింది.

"నాకు మీనుంచి పెద్దసహాయం అవసరం. రాజారాం పేరుతో బసచేసినతను మా గోపీయే. అయితే అతనలా ఎందుకు చేశాడో అర్థంకావడం లేదు. ఉదయంనుంచీ గోపీ ఏంచేశాడో నాకు చెప్పగలరా?" అన్నాడు శంకరయ్య.

"ష్యూర్. నాకు గుర్తున్నంతవరకూ చెబుతాను. అతనిక్కడకు రాత్రి పన్నెండుగంటల ప్రాంతాల వచ్చాడు. ఉదయం నాలుగున్నర ప్రాంతాల బయటకు వెళ్ళి మళ్ళీ ఏడు గంటల ప్రాంతాల ఇంకో యువకుడితో తిరిగి వచ్చాడు. ఇద్దరూ గదికి వెళ్ళినట్లున్నారు. ఆ తర్వాత పది గంటల ప్రాంతంలో అతనొక్కడూ బయటకు వెళ్ళాడు. ఇంకా తిరిగి రాలేదు."

శంకరయ్య కళ్ళలో ఆశ వెలిగింది. "అయితే గోపీతో వచ్చిన యువకుడు—ఇంకా అతని గదిలోనే ఉన్నాడన్నమాట. అతన్ని నేను కలుసుకోవాలి."

"దానికేముంది? వెళ్ళండి...—" అన్నాడు రిసెప్షనిస్టు.

శంకరయ్య కదిలేటంతలో ఒక కుర్రాడు రిసెప్షనిస్టును సమీపించి "నన్ను రాజారాంగారు పంపించారు..." అన్నాడు. శంకరయ్య ఆగిపోయాడు.

"ఆయన రూమ్ ఖాళీ చేసేస్తున్నానని చెప్పమన్నారు. గదిలో సామానేమీ లేదుట. తాళం నాతో పంపించారు. గది అద్దె అడ్వాన్సుగా ఇచ్చారుటకదా!" అన్నాడు కుర్రవాడు.

రిసెప్షనిస్టు ఆశ్చర్యంగా "అతను నీకెలా తెలుసు?" అనడిగాడు.

"రోడ్డుమీద కనబడి తాళంచెవి ఇచ్చి వివరాలు చెప్పారు. ప్రతిఫలంగా తాళం కప్ప నన్ను తీసుకోమన్నారు. అది చాలా ఖరీదైనదీ, మంచిదీ అనికూడా చెప్పారు."

"బాగానే వుంది. నిన్నెలా నమ్మేది? ఏ పిక్‌పాకెటింగ్‌లోనో అతని ఎడ్రసూ, తాళంచెవీ నీకు దొరికి ఇలా అబద్ధమాడుతున్నావేమో?" అన్నాడు రిసెప్షనిస్టు.

"వేషం డాబుగా లేదు కాబట్టి చటుక్కున నన్నా మాట అన్నారు. సరేలెండి. నేను చెప్పిన ఇతర విశేషాలున్నాయిగా. ఆయన గదిలో ఏమీ లేవు. వుంటే నేను జేబుదొంగనే అనుకోవచ్చు. లేకుంటే నేను అబద్ధం చెప్పినా మీకు నష్టమేమీ లేదుకదా!"

కుర్రాడు, రిసెప్షనిస్టు, శంకరయ్య - పద్దెనిమిదో

నంబరు గదికి వెళ్ళారు. గది తలుపులు తాళంవేసి వున్నాయి.

"బాగుంది స్నేహితుణ్ని గదిలో పెట్టి తాళంవేసి మరీ వెళ్ళాడన్నమాట - ఏం పెద్దమనిషో?" అంటూ రిసెప్షనిస్టు తలుపు తాళంవేశాడు.

అతను తలుపులు తెరుస్తూంటే శంకరయ్యా ఊపిరి బిగబట్టాడు. గదిలో ఎటువంటి దృశ్యం చూడాల్సివస్తుందో నని ఆయన భయపడుతున్నాడు. చెల్లెలు వ్రాసినది నిజమే అయితే రవి ఇప్పుడీ గదిలో ఏ స్థితిలో వుంటాడు?

గది తలుపులు తెరుచుకున్నాయి. కుర్రాడి మాటలు నిజమని ఋజువయింది. హోటల్ వారేర్పాటు చేసిన ఫర్నిచర్ మినహాయిస్తే అక్కడింకేమీ లేదు.

శంకరయ్యా మంచం క్రింద, బాత్ రూంలోనూ కూడా వెతికాడు. రవి అక్కడ లేనందుకు ఆయన నిరుత్సాహపడ్డప్పటికీ తాత్కాలికంగా ఆయనకు తృప్తికూడా కలిగింది. రవికి అపకారం జరిగినట్లు ప్రత్యక్ష సాక్ష్యమేమీ లభించలేదు.

"నాకు తాళంకప్ప ఇప్పించగలరా?" అన్నాడు కుర్రాడు.

"ఏమిటి విశేషం? తాళంకప్ప ఏం చేసుకుంటావు?"

"మీ హోటల్లో మకాం చేయాలనుకునే ఇంకొకరికి అమ్ముకుంటాను."

రిసెప్షనిస్టు అనుమానంగా "ఆ తాళంకప్ప నాకు అమ్ముతావా?" అనడిగాడు. అందులో ఏమైనా రహస్యముండవచ్చునేమోనని అతనికి తోచింది.

"దానికేముందండీ - పది రూపాయలిచ్చి మీరే వుంచుకోండి." అన్నాడు కుర్రాడు.

అతనలాగనగానే రిసెప్షనిస్టు అనుమానం తొలగి పోయింది. "ఎందుకులే-నువ్వే అమ్మకో" అని తాళం కప్ప తీసి కుర్రాడికిచ్చేశాడు. కుర్రాడు వెళ్ళిపోయాక గది బయట వున్న ఫోన్లో - "పదెనిమిదో నంబరు గది శుభ్రంచేసి మన తాళం వేసేయ్" అని ఎవరికో ఆదేశాన్నిచ్చాడు.

శంకరయ్య రిసెప్షనిస్టువంక ఆదోలా చూసి "మీ హోటల్లో ఎప్పుడైనా నేరాలు జరిగాయా?" అనడిగాడు. లేదంటే బాగుండునని అతననుకున్నాడు.

"చిల్లర నేరాలు జరగలేదు కానీ ఒకసారి హత్య జరిగింది. ఈరోజు రాజారాంలాగే ఒకతను మరోవ్యక్తిని వెంటబెట్టుకు వచ్చి తన గదికి తీసుకువెళ్ళి చంపేశాడు. తర్వాత శవాన్ని ముక్కలు ముక్కలుగా కోసేసి చిన్న చిన్న పొట్లాలకింద కట్టి గది కిటికీలోంచి అవతల పారేసి, గది ఖాళీ చేసేసి వెళ్ళిపోయాడు."

రిసెప్షనిస్టు మాటలు వినేసరికి శంకరయ్య ప్రాణాలు పైనే పోయాయి. కొంపతీసి ఇప్పుడు రవి విషయంలో కూడా అలా జరగలేదుకదా! ఈ భయంలో ఆయన రిసెప్షనిస్టువంక దీనంగా చూసి "గదిలో వుండాల్సిన గోపీ స్నేహితుడేమయ్యాడంటారు? ఒకవేళ మీరు చూడని సమయంలో అతను బయటకు వెళ్ళే అవకాశం లేదంటారా?" అన్నాడు.

"అక్కరాలా లేదు." అన్నాడు రిసెప్షనిస్టు.

"అయితే అతను." శంకరయ్యకు నోట మాటరాలేదు.

"విషయం బయటపడేదాకా ఏమీ చెప్పలేంకదండీ- అయినా మా హోటల్లో ఒక ప్రత్యేకత వుంది. హత్య జరక్కుండా ఆపలేము కానీ - హంతకుడు మాత్రం తప్పిం

చుకోలేదు.'' అన్నాడు రిసెప్షనిస్టు.

శంకరయ్య కంగారుగా అతని దగ్గర సెలవు తీసుకున్నాడు.

## 5

''ఏమిటన్నయ్యా—ఉత్తరం ముక్కైనా లేకుండా ఇలా ఊడిపడ్డావ్'' అంది శంకరయ్య చెల్లెలు వెంకట రత్నం.

''రాక తప్పతుందా—గోపీ మా యింటికొచ్చి రవిని తీసుకెళ్ళాడు'' అన్నాడు శంకరయ్య. ఆయన నా మాటలు చాలా బరువుగా అన్నాడు.

''అయితే ఏమయింది?''

''ఏమీ కావడానికేముంది? నీ ఉత్తరం నాకు అందవలసిన సమయానికి రెండ్రోజులాలశ్యంగా అందింది... ఇప్పుడంతా అయిపోయింది...'' అంటూ శంకరయ్య ఓసారి రుమాలుతో ముఖం తుడుచుకున్నాడు.

రత్నం అన్నగారివంక ఆశ్చర్యంగా చూసి ''నా ఉత్తరమా? ఎప్పుడు రాసింది?'' అనడిగింది.

శంకరయ్య మౌనంగా తన జేబులోంచి ఓ ఉత్తరం తీసి చెల్లెలి కందించాడు.

రత్నం ఆ ఉత్తరాన్నందుకుని చదివి శంకరయ్య వంక చూసి ''ఇదేం ఉత్తరం—ఇది నేను రాసింది కాదు'' అంది.

శంకరయ్య ఉలిక్కిపడి ''ఏమన్నావ్?...'' అనడిగాడు.

''బాగుందన్నయ్యా—ఈ వెధవుత్తరం చూడగానే ఏ వెధవో రాసుండాలని నువ్వనుకోవాలిగానీ—నిజమని నమ్ముతావా? నా కొడుకు ననుమానిస్తావా?''అంది రత్నం బాధగా.

శంకరయ్య జరిగిందంతా వివరంగా చెప్పి "ఈ పరిస్థితుల్లో ఏమనుకోవాలో చెప్పు" అన్నాడు.

రత్నం సాలోచనగా "గోపీ నాతో మీ ఊరెడుతున్నట్లు చెప్పలేదు ఎక్కడికో పిక్నిక్ వెళ్ళాలని చెప్పాడు. బహుశా రవినికూడా తీసుకువెడదామనుకున్నాడేమో—అయితే హోటల్లో ఎందుకు మకాం పెట్టాడు? విజయవాడలో బిజినెస్సని అబద్ధమెందుకాడాడు?... వింటూంటే నాకేదో భయంగా ఉంది కూడా..." అంది.

"అయితే ఈ ఉత్తరం నువ్వు రాయలేదంటావ్?" అన్నాడు శంకరయ్య ఆలోచిస్తూ.

"ఏ తల్లీ తన కొడుకుని హంతకుడిగా అనుమానిస్తూ ఉత్తరం రాస్తుంది చెప్పు."

అప్పుడే శంకరయ్యకింకో అనుమానం వచ్చింది. ఉత్తరంలో దస్తూరీ ఇంచుమించు తన చెల్లెలిదిలాగానే ఉంది. ఆమె ఉత్తరం గురించి తనకేమీ తెలియదంటోంది. ఆమె తనమీదనూ కూడా మంచి అభిమానమే ఉండాలి. తన కొడుకు రవిని హత్య చేస్తాడన్న అనుమానం రాగానే తనపై అభిమానంకొద్దీ ఆ విషయాన్ని ముందుగానే తెలిపి హెచ్చరించింది. ఒకసారి ఉత్తరం రాసేక—అదే తన కొడుకుని హంతకుణ్ణి చేయగల సాక్ష్యంగా గుర్తించి ఇప్పుడీ అబద్ధం ఆడుతోందేమో!

ఈ అనుమానంతో శంకరయ్య చెల్లెలివంక చూశాడు. ఆమె ముఖంలో అనుమానించవలసిన లక్షణాలాయనకు కనబడ్డాయి.

"గోపీ తిరిగివచ్చాడా?"

"ఇంకా రాలేదు" అంది రత్నం.

"ఎవరికీ ఏమీ కాకూడదనీ, ఈ ఉత్తరం అబద్ధం కావాలనీ భగవంతుణ్ణి ప్రార్థించడం మినహాగా ఇప్పుడు చేయగలిగిందేమీ కనబడడంలేదు. గోపి వస్తే మాత్రం నాకు తెలియజేయి" అన్నాడు శంకరయ్య, అక్కణ్ణించి హడావుడిగా కదులుతూ.

## 6

"మీకీ విషయం యెలా చెప్పాలో తెలియడంలేదు. నిన్నట్నించీ అమ్మాయి కాలేజీనుంచి ఇంటికి రాలేదు" అంది కామాక్షమ్మ భర్త గుమ్మంలో అడుగుపెట్టగానే.

శంకరయ్యకు కళ్ళు తిరిగినట్లయి—వెంటనే కుర్చీలో కూలబడి—"జరిగిం దేమిటో వివరంగా చెప్పు..." అన్నాడు.

"జరిగిం దేమిటో తెలిస్తే నాకుమాత్రం కంగారెందు కండీ. కాలేజీకి వెళ్ళింది. రాము కనుక్కొచ్చిందాన్ని బట్టి కాలేజ్ వదిలిపెట్టేవరకూ అది కాలేజీలోనే ఉంది. తర్వాత ఒక్కర్తీ మామూలుగా ఇంటికని బయల్దేరింది. ఆ తర్వాతేం జరిగిందో తెలియదు. అదింటికి రాలేదు..." అంటూ పూర్తి చేసేసరికి కామాక్షమ్మకు యేడుపు వచ్చేసింది.

"అలా ఏడవకే—ఏదో ఒకటి చేయాలి—" అన్నాడు శంకరయ్య.

"అబ్బాయిజాడ ఇంతవరకూ తెలియలేదు. ఇప్పుడమ్మాయి మాయమయింది. అసలే ఆడపిల్ల. అప్రతిష్ట కూడాను..." అప్రతిష్ట ప్రసక్తి రాగానే కామాక్షమ్మ ఏడుపు బాధగా మారిపోయింది.

"ఇదీ ఆ గోపిగాడి పనేమో..." అన్నాడు శంక

రయ్య.

"వాటం చూస్తూంటే ఆ గోపీగాడు మన కుటుంబాన్ని సర్వనాశనం చేయాలనుకున్నట్లు తోస్తోంది. నాకు చాలా బెంగగా ఉంది. రామూని మనం జాగ్రత్తగా కాపాడుకోవాలి" అంది కామాక్షమ్మ.

"అంటే నీ ఉద్దేశ్యమేమిటి? మొదటి ఇద్దరూ ఏదో అయిపోయారనుకుంటున్నావా?" అన్నాడు శంకరయ్య బాధగా. బాధలోనే ఆయన కంఠంలో జీర ధ్వనించింది.

"అలా యెందుకనుకుంటానండీ ..." అంది కామాక్షమ్మ.

"చూసి చూసి పోలీసు రిపోర్టివ్వలేకపోతున్నాను. కాబోయే అల్లుడి నల్లగ పెట్టినట్టవుతుంది. కన్నకూతురి బ్రతుకు బండలవుతుంది. కానీ రిపోర్టివ్వకపోతే__కన్న కొడుకూ, కూతురూ ఏమైపోతారోనని బెంగగా ఉంది" అసహాయంగా అన్నాడు శంకరయ్య.

"అయితే ఏం చేస్తారు?"

సరిగ్గా అదే సమయంలో శంకరయ్య ఇంటిముందో రిక్షా ఆగింది. రిక్షాలో యెవరూ లేరు. రిక్షావాడో కవరు తీసుకుని లోపలకు వచ్చి "శంకరయ్యగారంటే మీరేనాండీ?" అనడిగాడు.

## 7

"నన్ను ఇద్దరు వ్యక్తులు ప్రేమించారు. వాళ్ళు గోపీ, రవి. కానీ నేను మాత్రం మీ అన్నయ్య రవినే ప్రేమించాను. ఆ ప్రేమే ఇప్పుడతని ప్రాణాలమీదకు తెచ్చింది. గోపీ అతన్ని చంపడానికి నిర్ణయించుకున్నాడు" అంది లక్ష్మి.

ఇద్దరూ నాక్కావలసినవాళ్ళే. అన్నయ్య హతుడైతే ఎంత బాధపడతానో-గోపీ హంతకుడైనా అంతే బాధ పడతాను నేను. ఈ రెండింట్లో ఏ ఒక్కటీ జరగకూడదు. అందుకేకదా నీ మాటలమీద గౌరవముంచి-కాలేజీనుంచి తిన్నగా నీ దగ్గరకు వచ్చేశాను.'' అంది రమ. అలా అన్నప్పుడు జరిగిన సంఘటన ఆమె కళ్ళముందు మెదిలింది.

''నీ అన్నయ్య ప్రాణాలను రక్షించడం నీ వల్లనవుతుంది. నా మాటల్లో నమ్మకముంటే సాయంత్రం కాలేజీ వదలగానే మా ఇంటికిరా. అడ్రసిస్తాను.'' అంది లక్ష్మి ఆ రోజు మధ్యాహ్నం తనను కలుసుకుని.

అన్నయ్యేమయ్యాడో అని ఎంతో కంగారుపడుతున్న తను ఎక్కువగా ఆలోచించకుండా ఆ సాయంత్రమే వెళ్ళి లక్ష్మిని కలుసుకుంది. ఆమె కోరికపై తన ఉనికిని రహస్యం చేసింది. తల్లిదండ్రులు కంగారుపడకుండా ఓ ఉత్తరం కూడా పంపించింది. తను క్షేమంగా వున్నాననీ, తన గురించి పోలీసు రిపోర్టు ఈయవద్దనీ, రత్నం అత్తయ్యకు మాత్రం తను మాయమైనట్లు తెలియబర్చమనీ ఉత్తరం రాసింది తను.

''నేనెలాగో గోపీని మంచి మాటలతో లోబర్చుకుని- ఓ చోటికి తీసుకు వెడతాను. అక్కడ అతన్ని ప్రాణ భయానికి లోనుచేసి - రవి గురించిన వివరాలడుగుతాను. నువ్వు గోపీని రక్షించుకో. ఆ విధంగా గోపీ మనసులో నీకు చోటు లభిస్తుంది. అతనికి నీ మనసులో చోటు లభించడంతోపాటు నాపై ద్వేషం కలగడంకూడా ఆరంభమవుతుంది. అది జరిగితే చాలు - అతను నన్నూ, రవినీకూడా వదిలిపెట్టేస్తాను.'' అంది లక్ష్మి.

''కథగా వినడానికి చాలా బాగుంది. కానీ ఆచరణలో

ఎలా సాధ్యమవుతుంది?'' అంది రమ.

లక్ష్మి నవ్వింది – ''ఈ విషయం నేను కూలంకషంగా ఆలోచించాను. గోపీని కంగారుపెట్టడంకోసమే నిన్ను మాయం చేశాను. ఒకపర్యాయం అతను నా దగ్గరకువచ్చి తన్ను ప్రేమించి పెళ్ళిచేసుకోని పక్షంలో రవిని చంపగలనని బెదిరించాడు. అలాంటి పని చేయకూడదని అతన్ని నేను వేడుకున్నాను. అయితే తన్ను పెళ్ళి చేసుకోమన్నాడు. కుదరదని స్పష్టంగా చెప్పాను.

నేనంటే వేళాకోళంగా వుందేమో – నీకు భయం కలగడానికి కొన్నాళ్ళపాటు రవిని మాయం చేస్తాను. నీలో మార్పుకోసం కొన్నాళ్ళు ఎదురుచూసి ఆ తర్వాత అతన్ని చంపేస్తాను అని బెదిరించాడు గోపీ.

నేనూ నిర్లక్ష్యంగా – అయితే నేనూ రమను మాయం చేసి ఆ నేరం నీమీదకు తోసేస్తాను. నిన్ను నేరస్థుడిగా జైలుకు పంపడమే నా ఆశయంగా పెట్టుకుంటాను—అని అతన్ని బెదిరించాను. ఇప్పుడదే జరిగింది. అతను తప్పక నా దగ్గరకు వస్తాడు.''

రమ ఆశ్చర్యంగా లక్ష్మివంక చూసి – నువ్వు చెప్పే కథవింటూంటే నువ్వూ ఆడదానివని నాకు అనిపించడం లేదు'' అంది.

''అది నా గొప్పతనం కాదు. ప్రేమకున్న బలం అలాంటిది'' అంది లక్ష్మి.

# 8

''రమనేం చేశావో చెప్పు'' అన్నాడు గోపీ.

''ఎందుకు చెప్పాలి?'' అంది లక్ష్మి పెంకిగా.

గోపీ కోపంగా లక్ష్మివంక చూశాడు – ''నేను అన్న మాట చేశానుగదా అని నువ్వూ అలాగే చేస్తే పులిని

చూసి నక్క వాత పెట్టుకున్నట్లే వుంటుంది.''

''పులి ఎవరో నక్క ఎవరో కాలమే తేలుస్తుంది'' అంది లక్ష్మి.

''తలిదండ్రుల కొక్కడే కొడుకుని. అల్లారుముద్దుగా పెరిగాను. అనుకున్నదల్లా సాధించడమే నాకు తెలుసు. రవిని నేను క్షమించలేను. పగ తీర్చుకుంటున్నాను. ఇందులో తప్పేమీ లేదు. నువ్వు నన్నర్థం చేసుకో. వేళా కోళాలాడి నన్ను రెచ్చగొట్టకు'' కోపం, బాధ, విసుగు మిళితం చేసిన కంఠంతో అన్నాడు గోపి.

''సరే నీ బాధ నువ్వు చెప్పుకున్నావు. కానీ నిన్నెలా అర్థం చేసుకోనేది. నీ ప్రేమకు అడ్డువచ్చాడని అతణ్ని చంపాలనుకొంటున్న దుర్మార్గుడివి నువ్వు. నిన్నే ఆడదీ ప్రేమించలేదు. నిజంగా ఏ ఆడదైనా ప్రేమించగలిగితే ఆమె మహోన్నతవ్యక్తి అనుకోవాలి'' అంది లక్ష్మి.

''నా గురించిన నిజం బాగా చెప్పావు. నన్ను మహోన్నత వ్యక్తులే కాని ప్రేమించలేరు. నువ్వు మహోన్నత వ్యక్తివి కాదని తెలుస్తూనే వుంది - నన్ను ప్రేమించక పోవటాన్ని బట్టి. నా దురదృష్టంకొద్దీ నిన్ను నేను ప్రేమించాను. నువ్వు నిజంగా ఆ రవిని ప్రేమిస్తూంటే - అతని ప్రాణాలు కాపాడ్డంకోసమైనా నన్ను ప్రేమిస్తావు. కానీ ఆ లక్షణాలు కూడా నీలో కనబడ్డం లేదు'' అన్నాడు గోపీ.

''నేనంత బలహీనురాల్ని కాను. ప్రేమ లేనిచోట వివాహముండదు. రవి చచ్చిపోతే నేనూ చచ్చిపోతాను. కానీ అతన్ని బతికించుకుని నీలాంటి దుర్మార్గుడి కిల్లాలు కాలేను. అందువల్ల అటువంటి ఆశలేమీ పెట్టుకోకు...'' అంది లక్ష్మి.

"నీతో నాకు మాటలేంకానీ...రమ సంగతి చెప్పు."

"రమను క్రూరంగా హింసించి, అవమానించి అది నీ ప్రతాపమేనని ఆమెను నమ్మించడమే కాక బయట ప్రపంచాన్ని కూడా నమ్మించగలను" అంది లక్ష్మి.

"అయితే రమ అమాయకురాలు. నామీద కోపాన్ని ఆమెపైన చూపిస్తే నువ్వు సాధించేదేమీ వుండదు సరి గదా – నీ రవి మనసింకా బాధపడుతుంది."

"మనుషులకైతేనే మనసులూ, మనసును గురించిన పట్టింపులూనూ – ప్రవర్తనతో నువ్వు మనిషివి కాదని తేలిపోయింది. నీపై పగ సాధించడానికి నేనూ నీ స్థాయికి దిగిపోతాను" అంది లక్ష్మి.

"మాటల్లో చాలా దూరం వెడుతున్నావు. కోపంవస్తే నేను..."

"ఒకసారి నీ వెనక్కు చూడు" అంది లక్ష్మి.

గోపీ వెనక్కు చూసుకుని ఉలిక్కిపడ్డాడు. వస్తాదు ల్లాంటి మనుషులిద్దరు క్రూరమైన చూపులతో అతనివంకే చూస్తున్నారు.

"చూడు. ఇప్పుడు నువ్వు నా బందీవి. రవినెక్కడ దాచావో చెప్పేక – అక్కడ రవి మాకు దొరికేక – నీకు విముక్తి లభిస్తుంది" అంది లక్ష్మి.

"ఏమో అనుకున్నాను. నువ్వు గుండెలుతీసిన బంటువి" అన్నాడు గోపీ.

"కాదు. మరేదారీ లేకపోతే పిల్లికూడా పులి అవుతుంది" అంది లక్ష్మి.

# 9

"బావా!" అంది ఆశ్చర్యంగా రమ.

"నువ్విక్కడున్నావా?" అన్నాడు గోపీ ఆమెకంటె

ఎక్కువగా ఆశ్చర్యపడుతూ.

"అవును. నీకోసమే ఎదురుచూస్తున్నాను."

"నాకోసమేం?" అన్నాడు గోపీ ఆశ్చర్యంగా.

గదిలోకి తీసుకుని లక్ష్మి అతన్ని హెచ్చరించింది. ఇరవై నాలుగు గంటల వ్యవధిలో అతను రవి ఆచూకీ తీయవలసి వుంటుందని.

"అన్నయ్యనేం చేశావ్ బావా!" అనడిగింది రమ.

"చెబితే విని సహించగలవా?" అన్నాడు గోపీ చిరాగ్గా.

రమ భయపడింది కానీ — "చెప్పు!" అంది.

"అయితే విను. ఇప్పుడు నన్ను నేనెలా రక్షించుకోవాలో నాకే తెలియడంలేదు. మీ అన్నయ్య ఆచూకీ చెప్పకపోతే నన్ను చంపేస్తానంది లక్ష్మి. మీ అన్నయ్యని ఆరోజే చంపేశాను నేను." అన్నాడు గోపి.

రమ కెవ్వున కేక వేసింది. ఆ తర్వాత ఆమెప కళ్ళు తిరిగినట్లనిపించింది. తేరుకున్నాక కూడా కొద్ది నిముషాల సేపు మాట రాలేదామెకు. భయంభయంగా గోపివంక చూసి — "నిజమే చెబుతున్నావా నువ్వు?" అనడిగింది.

"ఔనన్నా కాదన్నా అది నిజమో అబద్ధమో నీకెలా తెలుస్తుంది?" అన్నాడు గోపి.

అతను సమాధానం చెప్పిన పద్ధతిని బట్టి, తన అన్నయ్య బ్రతికే వున్నాడని రమకు తోచింది. "నేను నిన్నికక్షణ్ణించి తప్పించగలను. తెలుసా?" అంది.

"ఏలా?"

"లక్ష్మి నిన్ను బందీని చేయలేదు. ఇది నీకు నాపై అనురాగం పుట్టించడానికి లక్ష్మి పన్నిన పన్నాగం..." అంటూ వివరించింది రమ.

గోపి ఆశ్చర్యంగా విని "నువ్విలా చెప్పడంకూడా మీ పన్నాగంలో ఒక భాగం కాదుగదా" అన్నాడు.

"కాదు. ఈ విధంగా నీ ప్రేమ సంపాదించడం నాకు నచ్చలేదు. ఆలోచిస్తూంటే అన్నయ్య చాలా పెద్ద తప్పు చేశాడనిపిస్తోంది. నేను నిన్ను ప్రేమిస్తున్నా ననుకుని, నువ్వు ప్రేమించిన లక్ష్మిని నీకు దక్కకుండా తను ప్రేమించేశాడు. నీ మనసులో ఇంకో అమ్మాయుందని తెలిసికూడా అన్నయ్య నిన్ను తన చెల్లెలికి భర్తగా చేయాలనుకున్నాడంటే - అది చాలా పెద్ద తప్పు. లక్ష్మి నాకిచ్చిన అవకాశాన్నింకో విధంగా ఉపయోగించుకుని నిన్నిక్కణ్నుంచి విడిపిస్తాను. అందుకు ప్రతిఫలంగా నువ్వు నాకో చిన్న వుపకారం చేయాలి. నా అన్నయ్యను నాకు అప్పజెప్పు. వాడు లక్ష్మిని మరిచిపోవడమేకాక-లక్ష్మి నిన్ను పెళ్ళి చేసుకునేందుకు ఒప్పుకునేలా చేస్తాను" అంది రమ.

"నమ్మవచ్చా నీ మాటలు?"

"బావా - నీమీద మనసులేని అమ్మాయిని పెళ్ళి చేసుకోవచ్చు. కానీ నామీద మనసులేనివాణ్ని పెళ్ళి చేసుకోవాలని నేననుకోను" అంది రమ.

ఆ మాటలకు గోపి ఆలోచనలో పడ్డాడు-"మంచి దెబ్బ తీశావ్ నామీద! అయితే రవిని నేను రక్షించగలనో లేనో తెలియదు. ఇప్పటికే వాడు మృత్యుముఖంలోకి వెళ్ళి వుండాలి."

"ఏం-ఏమయింది?" ఆత్రుతగా అడిగింది రమ.

"చెబుతున్నా విను..." అంటూ ప్రారంభించాడు గోపి.

# 10

"గోపికి ఒకరోజున ఒక పర్సు దొరికింది. ఏ జేబు దొంగో ఎవరి దగ్గరో కొట్టేసి _ అందులో డబ్బు తీసుకుని తర్వాత అవతల పారేసి వుంటాడు.

దొరికిందికదా అని తీసిచూసిన గోపికి ఆ పర్సులో ఓ కాగితంపైన ఇంగ్లీషులో కొన్ని వివరాలున్నాయి. ఆ జేబు దొంగకు ఇంగ్లీషు రాదనుకోవాలి. వచ్చి వుంటే ఆ కాగితాన్ని తప్పక దగ్గరుంచుకునేవాడు.

ఆ కాగితంలో రాసి వున్న ప్రకారం పది లక్షల రూపాయల విలువగల వస్తువులు, డబ్బో ఊరి చివర పాడుపడ్డ దేవాలయంలో వున్నాయి. అందుకేవో ఒకటి రెండు గుర్తులున్నాయి.

ఆ కాగితాన్ని వేరే దాచిపెట్టి, ఆ గుర్తులను కంఠతా పట్టి, అతనోసారి ఆ దేవాలయానికి వెళ్ళి శోధించడం మొదలుపెట్టాడు. అతనలా శోధిస్తూండగా ఒక వ్యక్తి అతన్ని భుజంతట్టి పలకరించి "ఏం చేస్తున్నావిక్కడ?" అనడిగాడు.

"చెప్పకూడదు. రహశ్యం" అన్నాడు గోపి.

ఆ మనిషి అక్కడే నిలబడి గోపిని పరిశీలిస్తూ వుండి పోయాడు. గోపికిబ్బంది అనిపించి _ "నీకింకేం వేరేపని లేదా?" అనడిగాడు.

"లేదు..." అన్నాడు ఆ మనిషి.

"సరే_అయితే నాకు వేరే పనుంది" అని గోపీ అక్కణ్ణించి కదలబోగా ఆ మనిషి పట్టుకుని అతన్ని ఆపి "మళ్ళీ యెప్పుడూ యిక్కడికి రానని మాటివ్వు!" అన్నాడు.

"ఎందుకివ్వాలి?"

"ఇవ్వకపోతే ఇప్పుడే చస్తావ్..."

"నా మాటమీద నమ్మకమేమిటి?"

"అది నీ కర్మ. ఎప్పుడు మాటతప్పి ఇక్కడికి వచ్చేవో—అప్పుడే చస్తావ్."

గోపీకి చటుక్కున ఏదో తోచి "ఇక్కడ ఎవరైనా ఎవర్నైనా చంపినా ఏ ప్రమాదమూ ఉండదు కదూ?" అన్నాడు.

"అవును. ఉండదు కాబట్టే నేను ధైర్యంగా చంపగలను."

"అయితే ఒక్క చిన్న ఉపకారం చేసిపెట్టు. వస్తే ఇంకోసారి మళ్ళీ ఇక్కడకు వస్తాను. ఒక్కసారిమాత్రమే వస్తాను. నాకో బద్ధశత్రువున్నాడు. వాణ్ణి చంపడానికి మంచిచోటుకోసం వెదుకుతున్నాను. ఒక్కసారి రావడానికి మాత్రం అనుమతివ్వగలవా?" అన్నాడు గోపి.

ఆ మనిషి గోపీ వంక చిత్రంగా చూసి "సరేలే— వెళ్ళు! పిచ్చిపిచ్చి ఆలోచనలు మాని ఇంటికెళ్ళి అల్లపురసం తాగు" అన్నాడు.

గోపీ ఇంటికెళ్ళి అల్లపురసం తాగకపోయినా బాగా ఆలోచించాడు. అంతకితమే అతనూ, రవీ లక్ష్మి విషయంలో గొడవపడ్డారు. లక్ష్మి రవిని ప్రేమిస్తున్నదని తెలియగానే గోపీకి ఆమెపై విరక్తి కలిగి తాత్కాలికంగా ఆడవారిపైనే విరక్తి ఏర్పడింది. రవి విషయంలో అతను కొంతవరకూ సమాధానపడ్డాడు.

తర్వాత అతను రవిని పిలిచి తనకు దొరికిన కాగితం సంగతీ, ఆ దేవాలయం దగ్గిర జరిగిన అనుభవమూ అతనికి వివరించి చెప్పాడు.

రవి అంతా విని ఆ దేవాలయానికి యింకొకసారి వెళ్ళక తప్పదన్నాడు.

అయితే అందులో ప్రాణ ప్రమాదమున్నదని ఇద్దరకూ తెలుసును. అందుకని ఇద్దరూ కలిసి బాగా ఆలోచించారు. ఒక పథకం రూపొందించారు.

ఆ ప్రకారం రవికీ గోపికీ శత్రుత్వ మేర్పడినట్లు వారి దగ్గర బంధువులు కూడా భావించాలి. అందుకు కారణం లక్ష్మి అని ప్రచారం కావాలి. ఆ తర్వాత గోపి రవిని తీసుకుని మాయమవుతాడు. రవి దేవాలయంవద్దకు వెళ్ళ వస్తూంటాడు. ఎవరికీ దొరక్కపోతే ఫర్వాలేదు. ఎవరి కైనా దొరికితే అమాయకంగా ముఖంపెట్టి "ఇక్కడ దేవో చరిత్ర ప్రసిద్ధిగాంచిన శిథిలాలున్నాయని యెవరో చెప్పారు" అంటాడు. రవి ఎమ్మే ఆర్కియాలజీ చదువు తున్నాడు కాబట్టి ఆ మాటలు యెవరైనా సరే నమ్మ తారు.

గోపి చెప్పిన ప్రకారం రెండు మూడు రోజులు రవి అక్కడకు వెళ్ళివచ్చాడు. అక్కడ అతనికెవరూ తగ లేదు. బాగా పరిశోధించి ఆ కాగితంలోని గుర్తుల ప్రకారం ఒక సొరంగ మార్గాన్ని కనుగొన్నాడు. దేవా లయ మంటప ప్రాంగణంలో ఆ రహస్య ద్వారముంది.

అతను చెప్పిన గుర్తులన్నీ విని గోపీకూడా ఒకరోజు ఒంటరిగా అక్కడికి వెళ్ళివచ్చాడు. రవి చెప్పినట్లుగానే అక్కడో సొరంగమార్గం ఉంది. అందులోకి వెళ్ళడానికి తనకే ధైర్యం చాలలేదు. తిరిగి వద్దామనుకుంటూండగా దురదృష్టవశాత్తూ అతనికి మళ్ళీ ఆ మనిషి తటస్థపడ్డాడు.

"మళ్ళీ వచ్చావ్—నీకు చావు తప్పదు" అన్నాడా మనిషి.

"చావుకోసం కాదు—నేను నీకోసమే వచ్చాను" అన్నాడు గోపి.

"నా పేరే మృత్యువు" అన్నాడు ఆ మనిషి.

"అందుకే—మృత్యువైతే మాత్రం ఆయువున్నవాడి నేమీ చేయలేదు కదా. ఆయుష్షుతీరిన వాడొకడున్నాడు. వాడే నా శత్రువు. చరిత్ర పరిశోధనకు మంచి శిధిలాలున్నాయని అతన్నిక్కడకు పంపుతాను. నువ్వతన్ని చంపేసేయ్" అన్నాడు గోపి.

"నేనేమైనా కిరాయి గూండా ననుకున్నావా?" అన్నాడా మనిషి.

"అలా ఎందుకనుకుంటాను? మృత్యువునని నువ్వే గదా చెప్పావు" అన్నాడు గోపి.

ఆ మనిషి మాట్లాడకుండా—గోపివంక కాసేపు కోపంగా చూశాడు. తర్వాత నెమ్మదిగా "నువ్వన్నీ నిజాలే చెబుతున్నట్లు ఋజువయింది కాబట్టి గానీ లేకుంటే యెప్పుడో నిన్ను చంపేసి ఉండేవాణ్ణి!" అన్నాడు.

తనగురించి అతను ఆరాలు తీశాడనీ—తమ పథకం ఫలించిందనీ గోపీ గ్రహించి సంతోషించాడు. అయితే ఆ మనిషెవరా అన్నది అతనికి తెలియలేదు. పోయేదే ముందనుకుని "నువ్వెవరో తెలుసుకోవచ్చా?" అనడిగాడు.

"బ్రతికుండగా తెలుసుకోలేవు. తెలుసుకున్నాక బ్రతకలేవు."

"అయితే నువ్వెవరో చెప్పొద్దుకానీ—రేపు నా శత్రువిక్కడికి వస్తాడు. అతనికి చెప్పు" అన్నాడు గోపి.

"నీ శత్రువు నీ మాట ఎందుకు నమ్ముతాడు?"

"అతనికి నేను శత్రువునని తెలియదు."

"మాడు. నీ మేలుకోరి చెబుతున్నాను. ఇంకో మని

షిని చంపాలనుకోవడం మృత్యువుకే కానీ మనిషికి తగదు'' అన్నాడతను.

గోపి అక్కణ్ణించి వచ్చేశాడు. రవితో కలిపి చర్చించాడు.

పదిలక్షల రూపాయలమీద ఆశ ఒక్కటేకాదు. గోపి తన చెల్లెలిని పెళ్ళి చేసుకుంటాడన్న ఆశ కూడా తోడుకాగా రవి ఆ సారంగం వ్యవహారం తేల్చేయదల్చుకున్నాడు.

నిన్నటి దినమే అక్కడకు వెళ్ళాడు. ఇంతవరకూ అతని జాడ లేదు.

ఈలోగా గోపి ఎలిబీకోసం తను ప్రయత్నిస్తున్నానని ఆలయం మనిషి అనుకోవడంకోసమని — ఓసారి టాక్సీ చేయించుకుని తన ఊరు వెళ్ళివచ్చాడు. అక్కడ రమ మాయంకావడం గురించి తెలిసింది. ముందు కంగారు పడ్డప్పటికీ అతనికి లక్ష్మి మాటలు గుర్తుకువచ్చాయి. ఆమె దగ్గరకు వచ్చి ఇలా చిక్కుకున్నాడు.

# 11

"అంతా బాగానే ఉందికానీ — నీ పథకం గురించి కొంతలో కొంత అత్తయ్యకూ నాన్నగారికీ తెలియజేయాల్సింది'' అంది రమ.

"అలా చేస్తే అటు మా అమ్మా, ఇటు మీ నాన్నా కూడా నిమ్మకు నీరెత్తినట్లుంటారు. అప్పుడు డబ్బు మాకు చిక్కే అవకాశంలేదు.''

"దేవాలయందగ్గరున్న ఆ మనిషి ఆ డబ్బుకు కాపలా ఉన్నాడేమో'' అంది రమ ఆలోచిస్తూ.

"ఆ డబ్బుకూ ఆ మనిషికీ సంబంధముండే అవకాశం లేదు.''

"అయితే అన్నయ్యిప్పుడు ప్రమాదంలో ఉన్నాడంటావా?"

"అనుకోను. ఆ మనిషి నాకు పచ్చి దుర్మార్గుడిలా కనబడలేదు. అయితే అన్నప్రకారం రవి యెందుకు తిరిగి రాలేకపోయాడో తెలుసుకోవాలి. ఈ వివరాలన్నీ ముందుగా ఇంకెవరికీ తెలియనివ్వకూడదనీ అనుకున్నాం కానీ తప్పలేదు."

"బావా_ఈ కథంతా తెలియక నిన్నో దుర్మార్గుడిగా భావించాను. నేనే కాదు. అంతా అలా భావించారు..."

"అదే నాకు మేలయింది. ఓ విధంగా చూస్తే నేను దుర్మార్గుడినే. డబ్బుమీది భ్రమతో అమ్మ మనసూ, అత్తయ్య, మామయ్యల మనసులూ కష్టపెట్టాను. లక్ష్మికీ నీకూ మానసిక క్షోభ కలిగించాను. రవిని ప్రమాదంలో ఇరికించాను."

"తర్వాత ఈ విషయాలన్నీ మాట్లాడుకుందాం. ముందు అన్నయ్యని రక్షించే మార్గం చూడాలి. పద__ పోదాం."

"ఇక్కణ్ణించి తప్పించుకోగలమంటావా? నా మాటలు లక్ష్మి నమ్ముతుందంటావా?"

"ఇవి మన ఇంటివిషయాలు. ఇందులో పోలీసుల ప్రసక్తి ఉండరాదని భావించి లక్ష్మి తన బాబాయి సహాయం కోరింది. ఆయన ఆమెకు అన్నివిధాలా సాయపడుతున్నాడు. ఆయన సాయంతోనే లక్ష్మి నిన్ను బంధించగలిగింది. అయితే నీకు నామీద ప్రేమ కలిగించడంకోసం నిన్ను తప్పించగలశక్తి కూడా నాకిచ్చింది. ఇప్పుడు మనల్ని అడ్డే వారెవ్వరూ లేరు. ప్రేమకు పక్క

దాన్ని తొక్కడం ఇష్టంలేక నీకు నిజం చెప్పేశాను. పోదామా?'' అంది రమ.

''నీ మాటల్లోని నిజాయితీ కళ్ళు చూసి తెలుసుకో గలిగాను. అందుకే నేను నిజం చెప్పాను...'' అన్నాడు గోపి.

# 12

''ఎవర్నాయనా నువ్వు?'' అన్న ప్రశ్న విని రవి ఉలిక్కిపడి వెనక్కి తిరిగాడు. ఒక ఆజానుబాహు దర్శనికి ఏర్పనమిచ్చాడు.

''ఆర్కియాలజీ నా సబ్జక్టు. పరిశోధనలు చేయడానికి ఇక్కడకు వచ్చాను'' అన్నాడతను ఆ మనిషివంకే పరీక్షగా చూస్తూ.

''అలాంటి పరిశోధన లిలాంటిచోట చేయడం ప్రాణాలకే ప్రమాదం. ఇక్కడేముంటాయ్—ఎవరో నిన్ను హత్య చేయాలని సంకల్పించి ఇక్కడకు పంపించి ఉంటారు.''

''అలాగనకండి - ఇక్కడ నేనో సారంగం కను గొన్నాను.''

ఆ మనిషి ఆత్రుతగా ''నిజంగానా ... ?'' అన్నాడు.

''అవును. అందుకే నాకీ ప్రదేశంపై ఆశక్తి పెరిగింది'' అన్నాడు రవి. ఆ మనిషి అతని భుజంతట్టి ''అయితే నాకా సారంగం చూపిస్తావూ?'' అన్నాడు.

''చూపించను. అందులో ఏదైనా పెద్ద నిధి వుండ వచ్చునని నాకు తోస్తోంది. నిధి నింకొకరితో పంచుకోవడం నాకిష్టంలేదు.''

''నాకు డబ్బాశలేదు. ఊరికే చూడాలనుంది. అంతే!

చూపించావంటే డబ్బంతా నీకే వదిలేస్తాను" అన్నాడా మనిషి.

"అసలు నువ్వెవరు? ఇక్కడెందుకున్నావ్" అన్నాడు రవి.

"నేనెవరో బ్రతికుండగా తెలుసుకోలేవు. తెలుసుకుని బ్రతకలేవు. అందుకని ఆ విషయం గురించి ఆలోచించకు."

"నువ్వెవరో చెప్పొద్దుకానీ-నీకు సారంగంతో ఏదో పని ఉంది. నేను ఆ సంగతి చెప్పగానే నీ కళ్ళు వెలిగిపోయాయి. చాలా కాలంగా ఎదురుచూస్తున్నది దొరికినట్లు ముఖం పెట్టావు. ఆ పనేమిటో చెప్పు-"

"ఇక్కడొక సారంగం ఉంది. దాని ఉనికి తెలిసిన వ్యక్తి ఒక్కడే ఉన్నాడు అతను నాకు మధ్యవర్తి ద్వారా పంపాడు. దురదృష్టవశాత్తూ ఆ మధ్యవర్తి ఆ వివరాలున్న కాగితాన్ని పారవేశాడు అప్పట్నించీ నా మకాం ఇక్కడకు మార్చాను. ఆ కాగితం యెవరికైనా దొరికి ఆ సారంగం ఉనికి కనుక్కొనేందుకు ఇక్కడికి వస్తారుగదా అని నా ఆశ."

"అయితే యింకేం-అందులో ఏముందో నీకు తెలుసు. రాత్రింబవళ్ళిక్కడే ఉండి కాపలా కాస్తున్నావు కాబట్టి ఆ సారంగంలో అత్యంత విలువైన వస్తువేదో ఉండి ఉండాలి. అది నాకెలాగూ దక్కనియ్యవు నువ్వు. అలాంటప్పుడు సారంగం గురించి చెప్పడం పెద్ద రిస్కే అవుతుంది" అన్నాడు రవి.

"ఆ సారంగంలో ఉన్నది విలువైనదే. అందులో సందేహం లేదు. కానీ అది నీ కెందుకూ పనికిరాదు" అన్నాడు ఆ మనిషి.

"నీ మాటలు నేను నమ్మను."

"నమ్మినా నమ్మకపోయినా నువ్వు సారంగం చూపించాల్సిందే-లేకపోతే..." అంటూ ఆ మనిషి చటుక్కున రివాల్వర్ తీశాడు.

రవి చలించలేదు. "సారంగం గురించి తెలిసిన ఒకే ఒక వ్యక్తిని నేను. నన్ను నువ్వు చంపలేవని తెలుసు" అన్నాడు మొండిగా.

ఆ మనిషి రివాల్వర్ జేబులో వేసుకుని "నువ్వు చాలా మొండివాడివి. నీకూ నాకూ పనికివచ్చే ఉపాయమొకటి చెబుతున్నాను. నా జేబులో తాడుంది. దాంతో నా కాళ్ళూ చేతులూ కట్టేసేయ్. అనుమానముంటే రివాల్వర్ కూడా నీ దగ్గరే ఉంచుకో. సారంగం ఎక్కడుందో చూపించు. సారంగంలోఉన్న విలువైన సామానంతా నువ్వే తీసుకెళ్ళు. తర్వాత నా తంటాలేవో నేనే పడతాను. వెళ్ళేటప్పుడు-ధైర్యముంటే నన్ను కట్లు విడిపించి వెళ్ళు. లేదా అలాగే వదిలేసి వెళ్ళు" అన్నాడు.

రవి రెండు నిముషాలు ఆలోచించాడు. సారంగంలోనికి వెళ్ళాలని అతనికీ కోరికగా ఉంది. ఇంతకుమించి వేరే ఉపాయమేదీ ఉన్నట్లు లేదు. అతను ఆ మనిషికి కాళ్ళూ చేతులూ కట్టేసి రివాల్వర్ జేబులో వేసుకున్నాడు. తర్వాత మంటపంలోకి వెళ్ళి అక్కడ ఓ స్తంభంలో మలచబడిన ఓ బొమ్మను కదిపాడు.

చిత్రంగా ఆ బొమ్మ కదిలింది. మంటపం మధ్యలో సారంగం ఏర్పడింది.

రవి కొద్దిక్షణాలు మాత్రమే తటపటాయించి సారంగంలోకి దిగాడు. దిగడానికి లోపలకు మెట్లున్నాయి. అలా

అతను ఓ పాతిక మెట్లు దిగేక నేల తగిలింది.

అంతా చీకటిగా వుంది. రవి ఓ పర్యాయం కళ్ళు నులుముకుని చుట్టూ చూశాడు. ఏమీ కనబడడం లేదు.

ఎటు అడుగులు వేయాలా అని అతను ఆలోచిస్తూండగా ఎవరో వెనకనుంచి అతన్ని గట్టిగా పట్టుకున్నారు. రవి పెనుగులాడేలోగా అతని ముక్కువద్ద ఏదో బలంగా అదమబడింది.

అతనికి స్పృహ తప్పింది.

# 13

"నాకేమీ భయం లేదు_మనం ఇంకెవరి సహాయమూ అర్థించకుండా ఆ ఆలయంవద్దకు వెడదాము" అంది రమ.

గోపీ ఆమెవంక ఆశ్చర్యంగా చూసి__"నువ్వెందుకు-అక్కడిదాకా" అన్నాడు.

"తోడు" అంది రమ__"ఒకోసారి ఆపదనుంచి తప్పించుకునేందుకు మగాడి తెలివికంటె ఆడదాని అందం పనికొస్తుంది."

అసలు కారణం అదికాదనీ ఆమె తనను నమ్మడంలేదనీ గోపీ గ్రహించాడు. తన మాటలన్నీ నిజమని ఋజువు చేయాలంటే ఆమెనుకూడా తీసుకు వెళ్ళాలి _ "సరే_అయితే పద" అన్నాడు గోపి.

ఇద్దరూ కాలినడకన ఊరి చివరి శిథిలాలయానికి వెళ్ళారు.

అక్కడ మంటపంలో పడివున్న రవిని చూసి ఇద్దరూ ఆశ్చర్యపోయారు. రమ చటుక్కున వంగి అతని ముక్కువద్ద వేలుపెట్టి "అమ్మయ్యా! బ్రతికే వున్నాడు" అంది.

గోపీ ముఖంలోకూడా వెలుగు కనబడింది. ఇద్దరూ కలిసి రవికి స్పృహ తెప్పించడానికి రకరకాల ప్రయ

త్నాలు చేశారు. రవి చాలా మత్తులో వున్నాడు.

గోపి అతని జేబులో తడిమాడు. రవి చొక్కా జేబులోనే ఓ మడతల కాగితముంది. గోపి అది విప్పి చదివాడు. అతని కళ్ళు ఆశ్చర్యంతో పెద్దవయ్యాయి. "రమా - ఇది విను" అంటూ చదవడం మొదలుపెట్టాడు.

"డియర్ ఫ్రెండ్స్ గోపీ అండ్ రవీ—

మీరు మాకు చేసిన సహాయానికి శతాధిక ధన్యవాదాలు. మీరు కలగ జేసుకుని వుండకపోతే నిష్కారణంగా కొన్ని ప్రాణాలు సజీవసమాధిలో నాశనమై పోయేవి.

మేము సి.బి.ఐ.కి. చెందినవాళ్ళం. ఇది మా రహస్య కేంద్రంగా ఏర్పాటు చేసుకుని వ్యవహారాలు చూసుకుంటున్నాం. సొరంగంలో సుమారు నెలరోజులకు సరిపడ ఆహార పదార్థాలు నిలవుంచుకుంటాము. పూర్వ కాలంలో ఈ సొరంగం ఎందుకు రూపొందించబడిందో తెలియదు కానీ - మాకు బాగా ఉపయోగపడింది.

మేము కొన్ని ప్రయోగాలు చేస్తూ కొంతకాలంగా లోపల వుండిపోయాం. లోపల వుండబోయే ముందు ఊళ్ళోకి వెళ్ళి ఒక మనిషికి కాగితాన్నిచ్చి - మా స్నేహితుడొకడికి కబురంపాము.

దురదృష్టవశాత్తూ ఆ కాగితం పోయింది. మా మనిషి మాకోసం ఇక్కడ మాటు వేశాడు. లోపల్నుంచి సొరంగం తలుపు తెరిచే వీలులేదు. అది పూర్తిగా దెబ్బతిని వుంది.

ఎన్నో ప్రయత్నాలు చేసి మేము విఫలులమై అతని రాకకోసం ఎదురుచూస్తున్నామనీ అతనికి తెలియదు. ఎన్నాళ్ళిలా సొరంగంలో బందీలుగా ఉండాలో తెలియక

మేమే అతి తక్కువ ఆహారాన్ని తీసుకుంటూ_పొదుపుగా వాడుకొసాగాము.

ఇలా వుండగా ఒకరోజున సొరంగం తలుపు తెరుచుకుని, మేము ఆ విషయాన్ని గ్రహించేటంతలో మళ్ళీ మూసుకుపోయింది. మా మనిషి వచ్చాడు కానీ ఏ కారణం వల్లనో లోపలకు రాలేకపోయాడని అనుకున్నాం.

ఇంతకీ జరిగినదంతా రవిద్వారా తెలిసింది. ధనాశతో నైతేనేం - మీ ఇద్దరూ వేసిన పథకం అద్భుతమైనది. సీ.బీ.ఐ.కి చెందిన మా మనిషినే బోల్తా కొట్టించగలిగిన మీ ప్రతిభకు మా జోహార్లు. ఇరవై లక్షలపై ఆశపెట్టుకున్న మీరు ఉడతాభక్తిగా ఎంతో కొంత బహుమతి ఇవ్వడం మా కనీస కర్తవ్యం. మీకోసం సొరంగంలో ఒక అద్భుతమైన కానుక ఎదురు చూస్తోంది. వెళ్ళి స్వీకరించండి..."

గోపీ చదివినదంతావిని "వ్యవహారం చాలా తమాషాగా వుంది" అంది రమ.

"నాకు మాత్రం అంతా అయోమయంగా వుంది" అన్నాడు గోపి.

"రవికి స్పృహ వస్తే అన్నీ తెలుస్తాయి" అని రమ అంటూండగా రవి కాస్త కదిలాడు. ఇద్దరూ అతన్ని కదిపి, కదిపి ప్రయత్నించగా మెల్లగా అతను లేచి కూర్చున్నాడు. పూర్తిగా మత్తు విడడానికి అతనికి అయిదునిముషాలు పట్టింది.

"గోపి, రమ తాము చెప్పవలసింది చెప్పేక తన అనుభవాన్నితను వివరించాడు. "నేను సొరంగంలోకి వెళ్ళగానే ఎవరో నన్ను బంధించి స్పృహ పోగొట్టారు. నాకు స్పృహ వచ్చేసరికి ముగ్గురు మనుషులు నా చుట్టూ ఉన్నారు. వాళ్ళు తాము సీబీఐకి చెందినవారమనీ, ఇంత

కాలమూ ఇది తమకు రహస్యస్థావరంగా ఉంటోందనీ, ఇక మీదట ఆ అవకాశం లేదనీ చెప్పి నా గురించి వివరాలడిగారు. వాళ్ళు సీ.బీ.ఐ వారని తెలియగానే నేను అన్నీ నిజాలే చెప్పాను. నాకు మంచి ఆహారం పెట్టారు. తర్వాత మళ్ళీ స్పృహ తప్పించారు..."

"వాళ్ళు మనకోసం ఏం బహుమతి పెట్టారో చూడాలి" అన్నాడు గోపీ ఆత్రుతగా.

"సొరంగం తెరవడం క్షణాలమీద పని" అంటూ ఉత్సాహంగా లేచాడు రవి.

అతను ఒక స్తంభం దగ్గరకు వెళ్ళి బొమ్మను కదిపేసరికి మంటపం మధ్యలో సొరంగం ఏర్పడింది. ఆశ్చర్యంగా చూశారు గోపి, రమ—ఇద్దరూ.

గోపీ చటుక్కున సొరంగంలోకి దిగబోయాడు.

"ఆగండి" అంది రమ-"ఎవరూ సొరంగంలోనికి వెళ్ళవద్దు."

"ఏం ఎందుకని?" గోపి, రవి-ఇద్దరూ అప్రయత్నంగా అన్నారు.

"ఎందుకో చెప్పలేను కానీ - నా మనసు ప్రమాదాన్ని శంకిస్తోంది." అంటూ ఆమె కాస్త దూరంగా వెళ్ళి మంటపం చుట్టూ పరిశీలించసాగింది.

గోపి, రవి కూడా లోపలకు వెళ్ళకుండా రమ దగ్గరకి వెళ్ళారు. వాళ్ళు రమ దగ్గరకు వెళ్ళిన మరో నిముషంలో పెద్ద ప్రేలుడుధ్వని వినిపించింది. ముగ్గురూ ఉలిక్కిపడి అటు చూసేసరికి, మంటపం కూలిపోయింది.

కాసేపు ఎవ్వరికీ నోట మాటరాలేదు.

"ఎలా తెలిసింది నీకు?" ఆశ్చర్యంగా అడిగాడు గోపి రమను.

"ఏదో ప్రమాదముంటుందని అనుకున్నాను కానీ ఇలా

జరుగుతుందని నేనూ అనుకోలేదు. చుట్టుపక్కల ఇంకా మనుషులున్నారేమో, మనల్ని ఎవరైనా గమనిస్తున్నారో చూద్దామని ఇలా వచ్చాను. అంతే!'' అంది రమ. ఆశ్చర్యం ఆమె కళ్ళలో కూడా స్పష్టంగా కనబడుతోంది.

''అసలు మేమిద్దరమూ ఊహించని ప్రమాదాన్ని నువ్వెలా ఊహించేవే'' అంటూ చెల్లెల్నడిగాడు రవి.

''వాళ్ళు నిజంగా మీకు బహుమతి యివ్వాలనుకుంటే అది నీకే ఇచ్చి మర్యాదగా ఊళ్ళో కూడా దిగబెట్టి వుండే వారు. అలా చేయకుండా నీకు స్పృహతప్పించి, నీ జేబులో చీటీ పెట్టారంటే అందుకు వేరే ఉద్దేశంముండి వుండాలి. నీ కోసం బావికడికి వస్తాడని వాళ్ళకు ఎలాగూ తెలుసు. సారంగంలో మీ ఇద్దరికీ ప్రమాదం జరిగే ఏర్పాటేదో చేసి వుంటారనుకున్నాను. కానీ ఇలా సారంగం తలుపులు తెరుచుకుని కొద్ది నిముషాలకు పేలే విధంగా బాంబు ఏర్పాటు చేస్తారని అనుకోలేదు'' అంది రమ.

''సీ.బీ.ఐ వాళ్ళు దేశపౌరులనిలా హత్యచేయాలనుకోవడం'' అంటూ గోపీ ఏదో అనబోతుండగా—

''వాళ్ళు సీ.బీ.ఐ వాళ్ళని నిన్నెవరు నమ్మమన్నారు?'' అని నవ్వింది రమ. ''వాళ్ళే స్మగ్లర్స్ అయుంటారు. వాళ్ళ దురదృష్టంకొద్దీ మీకు స్థావరం తెలిసిపోయింది. ఇక్కణ్ణించి మకాం ఎత్తేశారు'' అంది రమ.

''అంతే నంటావా - అయిన పక్షంలో వాళ్ళే మయ్యారో? మళ్ళీ మన జోలికి వస్తారేమో..'' అన్నాడు రవి.

''అదంతా వేరే కథ. ప్రస్తుతానికి ఈ కథ ముగిసింది కదా—పదండి పోదాం'' అంది రమ.

—:ఐపోయింది:—

# విప్లవ జ్వాలలు!!

సంపత్

టెలిఫోన్ మోగటంతో రిసీవర్ అందుకున్నాడు మనో
హార్.

"మనోహర్ గారా? నేను పరమశివాన్ని మాట్లాడు
తున్నాను. దయచేసి నాకోసం వేచివుండగలరా?" అని
వినిపించింది.

"పరమశివమా?" సాలోచనగా అన్నాడు మనో
హార్.

"అవునండి. సంవత్సరం క్రితం సౌందర్ రాజన్ గారి
పెళ్ళిలో కలుసుకున్నాం."

"ఆఁ! ఆఁ! గుర్తొచ్చింది. రండి. యేమిటి
విషయం?"

"అంతా అక్కడకు వచ్చాక చెబుతాను" అన్నాడు
పరమశివన్.

"ఆల్ రైట్. ప్రస్తుతం నాకేం పని లేదు.
రండి...!"

"పావుగంటలో వుంటానక్కడ" అని ఫోన్ పెట్టే శాడు పరమశివన్.

పరమశివన్ తమిళుడే అయినా 'మలూన్' దీవిలో నివాసం ఏర్పరచుకున్నాడు. 'మలూన్ ఐలెండ్'కి వ్యవహారిక నామం 'స్వీట్ లాండ్'. అక్కడ చెఱకు ఎక్కువగా పండుతుంది.

పరమశివన్ కి అక్కడ నాలుగయిదు చెఱకు ఎస్టేట్లు, ఫ్యాక్టరీలు ఉన్నట్లు ఆ ఐలెండ్ లోని ధనవంతులలో పరమశివన్ ఒకడని మనోహర్ కి గుర్తుకొచ్చింది. అయితే అతనికి తనతో పనేమిటో వూహించలేకపోయాడు.

అన్నట్లుగానే పావుగంట తరవాత వచ్చాడు పరమశివన్. అతనికి యాభైయేళ్ళపయినే ఉంటాయి. ఎనభై ఏళ్ళవాడిలా కన్పిస్తున్నాడు. ముఖంలో దిగులు, ఏదో బాధ అతన్ని పట్టి పీడిస్తున్నట్లుంది.

"క్షమించండి. మీతో నాకున్న స్వల్ప పరిచయాన్ని పురస్కరించుకొని సాయం కోరటానికి వచ్చాను" అన్నాడు పరమశివన్.

"చెప్పండి" లోలోపల ఆశ్చర్యపోతూ అన్నాడు మనోహర్.

"బహుశా నా గురించి మీకు తెలిసేవుంటుంది. చిన్నప్పుడే 'స్వీట్ లాండ్' పారిపోయాను. అక్కడే పెరిగి పెద్దవాణ్నయ్యాను. నా భార్య చనిపోయి అయిదేళ్ళవుతోంది. ఒక్కడే కొడుకు. వాడి పేరు తంగరాజు. పాతికసంవత్సరాల వయసుంటుంది వాడికి.

స్వీట్ లాండ్ గురించి మీరు వినే ఉంటారు. ప్రస్తుతం అక్కడే 'చుంగ్ మిన్' అధికారంలో ఉన్నాడు. అతన్ని దించి, అధికారంలోకి రావాలని ప్రయత్నిస్తుంనో మురా,

ఆ ముఠాకి రష్యా సహాయ సహకారాలున్నాయని వదంతి ఉంది.

ఎంత చెప్పినా వినకుండా ఆ విప్లవవాదుల ముఠాలో నా బిడ్డ చేరిపోయాడు. నామీద కూడా దాడి జరుగు తుందన్న భయంతో నేను ఇండియా వచ్చేశాను.

మీరు గుర్తుకు వచ్చారు. మీరిదివరలో సిబిఐలో ఆఫీసర్ గా పనిచేశారని నాకు తెలుసు. మీరే నాకు సహాయం చేయాలి. తంగరాజును యెలాగయినా ఇక్కడకు తీసుకు రావాలి. బలవంతంగా నయినా సరే!'' ప్రాధేయపడుతూ అన్నాడు పరమశివన్.

'స్వీట్ లాండ్'తో అనేక దేశాలకు, భారతదేశంతో సహా మంచి సంబంధాలే ఉన్నాయి. అక్కడ ప్రస్తుతం సంఘర్షణ జరుగుతోందని మనోహర్ కి తెలుసు. మిలిటరీ రాజ్యం లేకపోయినా, అధికారం మాత్రం పోలీసుల చేతుల్లో నిబిడీకృతమై ఉంది. ప్రభుత్వంమీద దాడులు జరుపుతున్న విప్లవ సైన్యాన్ని ఎప్పటికప్పుడు గట్టిగా అణచివేస్తున్నాడు చుంగ్ మిగ్. ఈ వివరాలు ఏ రోజు కారోజు విదేశ పేపర్లలో వస్తూనే వుంటాయి.

స్వీట్ లాండ్ నానాజాతుల కలగలుపు. చైనీయులు, భారతీయులు, జపనీస్, ఫ్రెంచ్, రష్యన్స్, అమెరికన్స్ మొదలయిన దేశస్థులు అక్కడ నివాసం యేర్పరచు కున్నారు.

''మీ మాట వినని తంగరాజు, నా మాట విని వస్తాడని ఎందుకనుకుంటున్నారు?'' అని ప్రశ్నించాడు మనోహర్.

తటపటాయించి అన్నాడు పరమశివన్. ''తంగరాజుని మాయం చేశారని నా అనుమానం, గత నాలుగయిదు

రోజులుగా అతని ఆచూకీ తెలియలేదు. అతన్ని గురించి ఆచూకీ తీసి, ఇండియా తీసుకురావాలి, ఎంత ఖర్చయినా సరే!" అన్నాడు దీనంగా పరమశివన్.

"అపహరించారా?" తెల్లబోయి అడిగాడు మనోహర్.

"అక్కడకు వెళితే నిజానిజాలు మీకే తెలియగలవ్. నా మాట కాదనకండి. ప్లీజ్!"

"ఆలోచించి ఏ విషయమూ రేపు చెపుతాను" అన్నాడు మనోహర్.

## 2

ఆ సాయంత్రమే సి.బి.ఐ. ఆఫీసుకి వెళ్ళాడు మనోహర్. ఫారిన్ ఎఫైర్స్ వింగ్ డైరెక్టర్ ముఖర్జీ నవ్వుతూ ఆహ్వానించాడు మనోహర్‌ని.

"చాలా కాలం అయింది కలుసుకుని. చిన్న పనిమీద వచ్చాను" అన్నాడు మనోహర్.

"ఏమిటి?"

"స్వీట్‌లాండ్ గురించి వివరాలు కావాలి. ప్రజెంట్ పొలిటికల్ సిట్యుయేషన్‌తో సహా."

దీర్ఘంగా నిస్వశించి చెప్పటం ప్రారంభించాడు ముఖర్జీ.

"స్వీట్‌లాండ్ ప్రస్తుతం 'చుంగ్ మిన్' పరిపాలనలో ఉంది. అతనికి యాభై అయిదేళ్ళు. పేదకుటుంబంలో పుట్టి మిలిటరీలో చేరాడు. అలా పైకి వచ్చి, ఇంతకుముందు రాజు 'మోజింగ్' అనంతరం రాజ్యాధికారి అయ్యాడు. అతనంటే గిట్టని కొందరు విప్లవ ముఠాగా యేర్పడ్డారు. ఆ ముఠా నాయకుడి పేరు జార్మన్. ముప్పైసంవత్సరాలుంటాయి,

ఇకపోతే సుమారు నాలుగయిదు రోజుల క్రితం మిలిటరీ క్యాంప్ ఒకదానిమీద విప్లవవాదులు దాడి చేశారు. ఈ వార్తల్ని ప్రభుత్వం బయటికి పొక్కనివ్వదు. అక్కడ సెన్సార్‌షిప్ అమలులో వుంది. విదేశీ విలేఖరులు మాత్రం అతి కష్టంమీద వార్తలు సేకరిస్తుంటారు.

ఇదీ అక్కడి పరిస్థితి. అన్నట్లు ఇదంతా ఎందుకు?'' అని ప్రశ్నించాడు ముఖర్జీ.

''నాకో కేస్ వచ్చింది'' అంటూ పరమశివన్ గురించి చెప్పాడు మనోహర్.

''ఇంకేం బయలుదేరు. గూఢచారి చర్యలు అలవాటేగా?'' అన్నాడు నవ్వుతూ ముఖర్జీ. నవ్వాడు మనోహర్.

''ఎటూ వెళుతున్నావు గదా! ఓ చిన్నపని చేసిపెట్టు వీలయితే'' అంటూ ఫైల్ రాక్‌లోనుంచి ఓ ఫైలు తీసుకొచ్చి మనోహర్ ముందుకి తోశాడు ముఖర్జీ.

అది ''చాయింగ్'' అనే కైనా గూఢచారికి సంబంధించిన ఫైలు. అతని ఫొటో, ఆకార విశేషాలు, వివరాలూ ఉన్నాయి.

''చాయింగ్ గురించి నీవు వినేవుంటావు. ఈ మధ్యకాలంలో విపరీతంగా వినబడుతోందతని పేరు. ఇదివరకు ఇండోనేషియాలో ఉండేవాడు. అక్కడ్నుంచి హాఠాత్తుగా మాయం అయ్యాడు. తరువాత అతని గురించి తెలియలేదు. స్విట్‌లాండ్ చేరుకున్నాడని వార్తలు వచ్చాయి. అదీ నిర్ధారణంగా తెలీదు.

అతను 'ఫ్లామింగ్' అన్న మారుపేరుతో ఆ దీవిలో ఉంటున్నట్లు తెలిసింది. నీవు వాకబ్ చేసి ఏ విషయమూ

చెప్పాలి. ఒక్క విషయం గుర్తుంచుకో! నీవిలా గూఢ చారి చర్యలు సాగిస్తున్నావని తెలిస్తే అంతు తెలియకుండా మాయం అవుతావ్. జాగ్రత్త!''

''అది మామూలేగా!'' అంటూ సెలవుతీసుకున్నాడు మనోహర్. అటునుంచి లైబ్రరీకి వెళ్ళి విదేశీ పత్రికలు తిరగేసి 'స్వీట్‌లాండ్' గురించిన వివరాలు చదివాడు.

అతని కంటికి రెండురోజులక్రితం జరిగిన సంఘటన కన్పించింది. స్వీట్‌లాండ్‌లో ఒక షిప్ ప్రమాదంలో 'రామన్' అనే వ్యక్తి జాడ తెలీకుండా పోయాడని, షూమింగ్ అనే మనిషి చనిపోయాడని వుంది.

అదిరిపోయాడు మనోహర్. షూమింగ్-కైనా గూఢ చారి!

## 3

స్వీట్‌లాండ్ రాజధాని 'కంపా'నగరంచేరేసరికి స్థానిక కాలమానం ప్రకారం ఉదయం ఎనిమిదిగంటలు అవుతుంది.

ఎయిర్‌పోర్టు బయటికి వచ్చి టాక్సీ ఎక్కి 'హోటల్ బ్లూ డైమండ్'కి పోనివ్వమన్నాడు మనోహర్.

స్వీట్‌లాండ్ దాదాపు రెండువందల చదరపుమైళ్ళవిస్తీర్ణంగల దీవి. రాజధాని నగరం 'కంపా'లో లక్ష జనాభా ఉంటుంది. అదే ప్రధాన నగరం కూడా. 'కంపా' సిటీ చుట్టూరా చెట్లు, చేమలు, కొండలు ఎక్కువ. ఆ దీవి మొత్తంమీద పది పన్నెండు చిన్న గ్రామాలవంటి పట్నాలు ఉన్నాయి, 'కంపా'ని మినహాయించి.

అక్కడ యెక్కువగా ఇంగ్లీషే మాట్లాడుతుంటారు. అందుకు కారణం ఆ దీవి యిదివరలో బ్రిటిష్ పరిపాలన

క్రింద ఉండి, విమోచన పొందింది. ఇంగ్లీషుగాక మరో రెండు, మూడు స్థానిక భాషలున్నా వాటి ప్రాశస్త్యం తక్కువ.

'కంపా' సిటీ దాదాపు భారతదేశంలోని సగటు నగరంలాగే తోచింది మనోహర్‌కి. రద్దీగా ఉన్న వీధులు, ముష్టివాళ్ళు, విదేశీయులు, క్లబ్బులు, బార్లు కూడా కనుపించాయి.

'బ్లూ డైమండ్' చేరుకుని తనకు రిజర్వు చేయబడిన సూట్‌లో దిగాడు. స్నానాదికాలు ముగించి, కాఫీ తాగుతూ పేపరు చూశాడు. అక్కడ నాలుగయిదు పత్రికలున్నాయి. ప్రతి పత్రికా ప్రభుత్వాన్ని పొగిడినట్లుగానే ఉన్నాయి. అక్కడక్కడ విప్లవదేశాలవల్ల జరిగిన అల్లరులను అంత ప్రాధాన్యత లేకుండా ఏ మారుమూలో క్లుప్తంగా వేశారు. అదయినా విదేశీ తొత్తుల దురాగతాలంటూ.

పత్రికలు పక్కన బెట్టి బయటికి వచ్చాడు మనోహర్. తండ్రితో పోట్లాడి విడిగా 'హోటల్ రిడ్జ్'లో ఉంటున్నాడు తంగరాజు.

ఆ హోటల్‌కి పోయి వాకబు చేశాడు మనోహర్.

"సారీసర్! అయిదురోజుల క్రితమే అతను ఖాళీచేశాడు" అంది రిసెప్షనిస్ట్ రిజిష్టర్ చూసి.

"అర్జెంటుగా కలుసుకోవాలతన్ని!" అన్నాడు మనోహర్.

"బహుశా కార్మింగ్ బార్‌లో ట్రై చేయండి. అక్కడ దొరుకుతాడేమో!" అంటూ ఆ బార్ ఎక్కడుందో చెప్పిందామె.

వెంటనే టాక్సీ ఎక్కి నగర శివార్లలో ఉన్న

శార్మింగ్ బార్ కి బయలుదేరాడు మనోహర్.

రోడ్ కిరువైపులా రకరకాల దుకాణాలు, ఇళ్ళు కన బడుతున్నాయి. ధనవంతుల భవంతులు, మధ్యతరగతి గృహాలు, పేదల నివాసాలు మొదలయినవి.

కొంతదూరంవచ్చాక టాక్సీని ఆపించాడు మనోహార్. అక్కడ ఉన్న ఒక భవంతిమీద "వలూన్ పోలీస్ హెడ్ క్వార్టర్స్" అన్న బోర్డుంది.

"అరగంటలో వస్తాను. వెయిట్ చేస్తూండు" అని చెప్పి లోనికి వెళ్ళాడు మనోహర్.

సెంట్రీ యేమి కావాలన్నట్లు చూశాడతనివంక.

"కమీషనర్ గారున్నారా?" అని ప్రశ్నించాడు మనోహార్.

"మీ రెవరు? వారితో ఏం పని?" ఎదురు ప్రశ్నించాడతను.

జేబులోనుంచి సీల్ చేసిన ఒక ఎన్వలవ్ తీసి అతని కిచ్చాడు మనోహర్. "దీనిని కమీషనర్ గారికివ్వు."

మనోహర్ ని ఎగాదిగా చూసి లోనికి పోయాడు సెంట్రీ. అయిదు నిమిషాలలో తిరిగి వచ్చాడతను. "ఇలా రండి!" అంటూ మనోహార్ ని, కమీషనర్ గదిలోకి తీసుకు పోయాడు.

"గ్లాడ్ టు మీట్ యు. నా పేరు జోరోచ్" అన్నాడు కమీషనర్ చేయి జాపుతూ.

"నా పేరు మనోహార్" అంటూ చేయి ఇచ్చి, షేక్ హాండిచ్చాడు.

"ప్లీజ్ బి సీటెడ్" అని సెంట్రీవంక తిరిగి 'టీ' తెమ్మని చెప్పాడు.

టేబుల్ మీద మనోహర్ ఇచ్చిన ఎన్వలవ్ తెరిచి

ఉంది. దాని ప్రక్కన ఒక కాగితం ఉంది.

ఆ కాగితాన్ని మరోసారి చదివాడు జోరోచ్.

డియర్ కమీషనర్!

ఈ లెటర్ ఇచ్చినవ్యక్తి నా కత్యంత ఆప్తుడు. అతని బిజినెస్ మీద స్కాట్లాండ్ వస్తున్నాడు. అతనికి కావలసిన సహాయం చేయవలసింది. అలా చేస్తావని అనుకుంటున్నా.

నీ

పరమశివన్.

"పరమశివన్ మీకు బాగా తెలుసా?" అని ప్రశ్నించాడు జోరోచ్.

తెలుసన్నట్లు తలూపాడు మనోహర్. ఇంతలో 'టీ' వచ్చింది.

ఇద్దరూ టీ చప్పరించసాగారు.

"మీరు వచ్చిన పనేమిటి?" అని ప్రశ్నించాడు జోరోచ్.

"నేను ఇన్సూరెన్స్ క్లెయిమ్స్ ఇన్వెస్టిగేటర్‌గా పని చేస్తున్నాను. ఒకవ్యక్తి ఒక కేసులో సాక్షిగా కావాల్సి వచ్చాడు. అతను యిక్కడ ఉంటున్నాడని తెలిసి వస్తుంటే, పనిలో పనిగా పరమశివన్ కొడుకు కూడా యిక్కడ వుంటున్నట్లు చెప్పి, అతన్ని తీసుకురావల్సిందిగా కోరాడు పరమశివన్. మీ గురించి చెప్పి ఈ లెటరు ఇచ్చారు."

"ఐ. సీ! మీకు నా సహాయం ఎప్పుడూ ఉంటుంది. మీకు కావల్సిన మనిషి పేరేమిటి? యెక్కడుంటుడుంటున్నాడు?"

కొంచెం తటపటాయించి చెప్పాడు మనోహర్. "అత

నే పేరుతో వుంటున్నాడో తెలీదు. 'షూమింగ్' అతని పేరు."

"షూమింగా?" అదిరిపడ్డాడు జోరోచ్.

"ఏం మీకు తెలుసా?" ఆతృత కనబరిచాడు మనోహర్.

రెండు నిమిషాలు ఆలోచించి "తెలుసు. అతను మరణించాడు" అన్నాడు అతను. "ఎవరో హత్య చేశారతన్ని."

ఈసారి నిర్ఘాంతపోవటం మనోహర్ వంతు అయింది. షూమింగ్ చనిపోయినట్లు తెలుసుగాని, హత్య చేయబడినట్లు తెలీదు.

కమీషనర్ జోరోచ్ రీసెర్చి షిప్‌లో జరిగిన ఒక దుర్ఘటన గురించి చెప్పాడు. చెప్పి "మీ ప్రయత్నం వృథా అవుతుందేమో!" అన్నాడు.

ఆలోచనలనుంచి తేరుకుని "నెవర్ మైండ్!" అన్నాడు బలవంతంగా నవ్వుతూ, మనోహర్.

"ఓ. కే! నేనిక వెళ్తాను. మళ్ళీ కలుసుకుందాం" అని బయటకి నడిచాడు మనోహర్.

శార్మింగ్ బార్‌లో వాకబు చేస్తే, తంగరాజుని ఎరిగిన వాళ్ళెవరూ కన్పించలేదు.

తిరిగి వచ్చేశాడు మనోహర్.

## 4

'షూమింగ్' అన్న మారు పేరుతో ఉంటున్న చైనా ఏజంటు 'చాయింగ్' హత్య చేయబడటం వింతగా తోచింది మనోహర్‌కి.

చాయింగ్ లాంటి అనుభవజ్ఞుడయిన గూఢచారి అంత తేలిగ్గా ఎలా మరణించాడు? అతన్ని చంపిందెవరు?

ఎందుకు చంపారు? అసలు జోరోచ్ చెబుతుంది నిజమా, కాదా?

ఈ ప్రశ్నలకు సమాధానాలు కావాలంటే తాను రీసెర్చ్ షిప్ డైరక్టర్‌ని కలుసుకోవాలి. అక్కడయినా తనకు సరి అయిన సమాధానాలే వస్తాయా?—అను కుంటూ మరుసటి రోజు ఉదయం జోరోచ్‌ని కలుసు కున్నాడు.

"ఫ్లూమింగ్ మరణించాడని నిర్ధారణగా తెలుసుకోవా లని అనుకుంటున్నాను. అంతే గాదు, ఈ సంగతి అధికారు లతో చెప్పి, ఋజువులు చూపితే గాని ఊరోర్కరు. కనుక షిప్ డైరక్టర్‌ని కలుసుకుని సర్టిఫికెట్ తీసుకోవాలనుకుం టున్నాను. ఆ షిప్ ఎక్కడుంది?" అని అడిగాడు మనోహర్.

తటపటాయిస్తూనే చెప్పాడు జోరోచ్.

'థాంక్స్' చెప్పి బయటపడ్డాడు మనోహర్.

తీరంలో వున్న ఒక చిన్న మోటర్ బోట్‌ని రెంట్‌కి తీసుకుని షిప్ వైపు బయలుదేరాడు.

త్వరలోనే షిప్ కన్పించింది. డెక్ మీద నిలబడి ఏదో చేస్తున్నారు కొంతమంది. షిప్‌కి ఒక ప్రక్క, గోడకి అతుక్కొని వుందో యినుపనిచ్చెన ఏటవాలుగా.

మనోహర్‌ని చిత్రంగా చూశారు ఆ మనుషులు.

"ప్రొఫెసర్ కర్టిస్‌ని కలుసుకోవాలి" అన్నాడు మనోహర్.

అతన్ని కర్టిస్ వున్న కాబిన్‌లోకి తీసుకుపోయాడు.

పరస్పర పరిచయాలయ్యాక అసలు విషయంలోకి దిగాడు మనోహర్.

"బాతిస్ఫియర్ గురించి మీ కెవరు చెప్పారు?" ఆశ్చర్య పోయి అన్నాడు ప్రొఫెసర్ కర్టిస్.

"కమీషనర్ జోరోచ్"

"ఐ.సీ. మీకు పోలీసు డిపార్ట్‌మెంట్‌లో మంచి పలుకుబడే వుందన్నమాట. లేకపోతే సెన్సార్ షిప్ వున్నా ఈ ఐలెండ్‌లో మీవంటివారికి అసలు విషయం తెలియనివ్వరు."

"నిజమే!" ఒప్పుకున్నాడు మనోహర్.

"మీతో జోరోచ్ చెప్పింది నిజమే. నేనిక్కడ లేని సమయంలో నా అసిస్టెంట్‌గా చేరిన యిద్దరు బాతీస్ఫియర్‌లో సముద్ర గర్భంలోకి దిగారు. 700 అడుగుల లోతులో షూమింగ్ ఏదో భయంకర దృశ్యం చూసి అరిచాడట. అదేమిటో తెలుసుకునే లోపే బాతీస్ఫియర్‌కి, షిప్‌కి మధ్య సంబంధం కట్ అయింది. వాళ్ళు సముద్రం పాలయ్యారు.

నేను వచ్చాక చూస్తే 1200 అడుగుల లోతులో కన్పించింది బాతీస్ఫియర్. లోపల కత్తితో హత్య చేయబడి 'షూమింగ్' ఒక్కడే వున్నాడు. రెండోవాడు 'రామన్' జాడ లేదు."

"ఆ చనిపోయింది షూమింగేనని ఖచ్చితంగా చెప్పగలరా?" అని ప్రశ్నించాడు మనోహర్.

"అతను ధరించిన దుస్తులు షూమింగ్‌వే. అప్పటికే సముద్రపు చేపలు శవాన్ని కొరుక్కు తిన్నాయి బాగా. బాడీకూడా ఘూమింగ్‌దే!" అన్నాడు కర్టిస్.

"అయితే 'రామన్' ఎలా మాయం అయ్యాడంటారు? లోపలికి వెళ్ళిన తరువాత ఘూమింగ్‌ను హత్యచేసి తలుపు తెరుచుకుని పారిపోయి వుంటాడా?"

"ఇంపాజిబుల్. 700 అడుగుల లోతులో ప్రెషర్ విపరీతంగా వుంటుంది. తలుపు తీయటం సాధ్యంకాదు. ఒక వేళ ఎలాగోలా తీశాడని భావించినా, తీసీ, తీయక ముందే మరణిస్తాడు. అయినా మీరో విషయం మరిచి పోతున్నారు. ఏదో భయంకర దృశ్యం చూసి అరిచిన షూమింగ్ ని హత్యచేసి, బయటికి పోయేంత వ్యవధి 'రామన్'కి వుండదు."

"అదలా వుంచండి. షూమింగ్ చూసిన దృశ్యం గురించి మీ ఉద్దేశ మేమిటి?"

"ఏముంది? ఏ భయంకర జంతువో, తిమింగలమో వారికి కనబడి వుంటుంది. సముద్రం గురించి మానవుడికి సంపూర్ణంగా తెలియదు. డైనోసార్స్, రైనోసార్స్‌లాంటి జంతువులు సముద్రము అడుగున వున్నాయి."

"సారీ ప్రొఫెసర్! మీకు యిబ్బంది కలిగిస్తున్నాను. నేనుకూడా ఆ బాతీస్ఫియర్ ని చూడవచ్చా?" అని వినయంగా అడిగాడు మనోహర్.

"ష్యూర్! కాని ఇప్పుడు కాదు. ఇంకా అది సముద్ర గర్భంలోనే వుంది. దానిని పైకి తీయాలంటే స్పెషల్ క్రేన్స్ కావాలి, అవి వున్న షిప్ రేపో, ఎల్లుండో ఇక్కడకు వస్తుంది."

"థాంక్స్ ప్రొఫెసర్! మరలా కలుసుకుంటాను." అని బయటికి వచ్చాడు.

బోట్ లో బయలుదేరిన మనోహర్ బుర్రలో ప్రొఫెసర్ మాటలే తిరుగుతున్నాయి.

సెన్సార్‌షిప్ విధించి బయటికి రానివ్వని వార్తను, పేర్లతోసహా జోరోచ్ తనకెందుకు చెప్పినట్లు?

ఆ మరణించింది షూమింగేనా? రామన్ ఏమయ్యాడు?

# 5

హోటల్‌కి తిరిగివచ్చి భోజనం ముగించి కూర్చున్నాడు మనోహర్. అతనికి 'శంగరాజు'ని ఎలా ట్రేస్ చేయాలో అర్థంగాలేదు. పరమశివన్‌కి సంబంధించిన మనుషుల దగ్గర వాకబుచేస్తే ఏదయినా క్లూ దొరుకుతుందా?

వెంటనే 'రెంట్'కి తీసుకున్న ఒక కారులో బయలు దేరాడు.

"పరమశివన్ ఎస్టేట్స్" అన్న బోర్డు కన్పించింది ఒక భవనం ముందు.

"మిస్ రజీనా ఉందా?" అని అడిగాడు రిసెప్షనిస్ట్‌ని. రజీనా పరమశివన్ తరఫున అక్కడ పనిచేస్తోంది. అతను లేనప్పుడు ఆయన వ్యవహారాలు ఆమే చూస్తుంటుందని, చాలా నమ్మకస్తురాలని చెప్పాడు పరమశివన్.

"మేడమీద వున్నారు. వెళ్ళండి" అంది రిసెప్షనిస్టు.

మెత్తటి కార్పెట్ పరిచివున్న మేడమెట్లు ఎక్కి పైనున్న ఒక నడవాలోకి ప్రవేశించాడు. అక్కడకూడా మెత్తటి ఎర్రటి కార్పెట్ పరచి వుండటంవల్ల బూట్లశబ్దం రావటంలేదు.

నడవాకి అటూ యిటూ గదులున్నాయి. వరండా చివరగా వున్న గది తలుపుమీద 'మిస్ రజీనా' అన్న బోర్డుంది.

ఆ గదిని సమీపించేకొలది లోపల ఎవరో ఘర్షణపడు తున్నట్లు మాటలు పెద్దగా వినిపించసాగాయి. సందేహిస్తూనే వాటిని ఆలకించసాగాడు మనోహర్.

"ఇడియట్. ఇలా బెదిరించి నాదగ్గర డబ్బు రాజేయలేవు. ఫో గెటౌట్" అంటున్నోందో ఆడగొంతు. రజీనా గొంతు అనుకున్నాడు మనోహర్.

"రజీనా! ఇది నీ బాబు ఆస్తిగాదు. నేనూ పార్ట్‌నర్‌నే. మాకు లేని దురద నీ కెందుకు? నువ్వు తంగరాజు తిరుగుతుండటం నేను చూశానని పరమశివన్‌తో చెబితే నీ వేమవుతావో ఆలోచించుకో. ఆయనసలే కొడుకు మాయం అయ్యాడని కంగారుపడుతున్నాడు. వెంటనే నిన్ను ఉద్యోగంలోంచి పీకేస్తాడు" అంటోందో మగ గొంతు.

"షటప్! గెటౌట్ ఫ్రం హియర్!" ఆపైన చెంప మీద కొట్టిన చప్పుడు.

విసురుగా నడిచిన చప్పుడు విని, చటుక్కున మెట్లదగ్గరకు పరుగెత్తాడు మనోహర్.

ధడాలున తెరుచుకుని నలభై ఆయిదేళ్ళ వ్యక్తి ఒకడు విసురుగా బయటికి వచ్చాడు. అతని ముఖం కందగడ్డలా ఉంది. మనోహర్‌ని రాసుకుంటూ పెద్దపెద్ద అంగలు వేస్తూ క్రిందకు వెళ్ళిపోయాడు.

అప్పుడే పైకి వస్తున్నట్లు నటిస్తూ "హల్లో మిస్ రజీనా, నా పేరు మనోహర్. మీతో మాట్లాడాలి" అన్నాడు మనోహర్.

గుమ్మంలో నిలుచున్న రజీనా ఆవేశం తగ్గించుకుంటూ "ఎవరు మీరు? ఏం కావాలి?" అని అని అడిగింది కఠినంగానే. ఆమె ముఖంనిండా చెమటలు పోసివున్నాయి. అందమయినదే. పాతికేళ్ళకు మించి వుండవు.

"లోపలికి పదండి" అన్నాడు అతను.

"చెప్పండి" అంది రజీనా ఇరువురూ కూర్చున్న తరువాత.

"తంగరాజు ఎక్కడున్నాడో మీకు తెలుసా? అతన్ని చివరిసారిగా ఎక్కడ చూశారు?"

"రెండువారాలపైనే అవుతుంది" అంది రజీనా.

"ఆ తరువాత చూడలేదా?" ఇందాకటి వ్యక్తి మాటలు మననం చేసుకుంటూ ప్రశ్నించాడు మనోహర్.

"లేదు. అతని గురించి నాకు తెలియదు" నిష్కర్షగా చెప్పింది మిస్ రజీనా.

ఆమె ఆవేశంలో వుందని గ్రహించి "తరువాత కలుస్తాను" అని బయటపడ్డాడు మనోహర్.

అతనలా బయటికి పోగానే ఫోన్ ఎత్తి ఎవరికో డయల్ చేసింది రజీనా.

"నువ్వన్నట్లు ఇక్కడకు వచ్చాడు, ఏమీ తెలియదని బుకాయించాను' చెప్పిందామె.

# 6

మిస్ రజీనా అబద్ధం చెబుతుందని, ఆమె ఏదో దాస్తుందని అర్థం అయింది మనోహర్‌కి. అయితే ఏ విషయమో అర్థంగాలేదు.

రిసెప్షనిస్ట్ దగ్గరికి వెళ్ళి "ఇందాక వెళ్ళిన వ్యక్తి ఎవరు?" అని అడిగాడు.

"అతని పేరు పళనిస్వామి. పరమశివన్ గారికి బంధువవుతారు. ఈ ఫ్యాక్టరీలో ఆయనకు కూడా వాటా వుంది."

"మనిషి ఎటువంటివాడు?"

"ఉత్త తాగుబోతు. ఎంత డబ్బున్నా తాగుడుకే చాలదు. అది మినహా మనిషి మంచివాడే." చెప్పింది రిసెప్షనిష్టు.

"థాంక్స్! నేనిలా అడిగినట్లు ఎవరితోనూ చెప్పకు!" అని ఆమె కొక నోటు అందించి, పళనిస్వామి అడ్రసు తెలుసుకుని బయటపడ్డాడు.

మిస్ రజీనా గురించి తెలుసుకోవాలంటే పళనిస్వామిని కలుసుకోవాలి. అతనిప్పుడు వుంటాడో, వుండడో అను కుంటూ కారుని పళనిస్వామి ఇంటివైపు తిప్పాడు.

రెండునిముషాల తరువాత తన వెనక ఒక కారు ఫాలో కావటం గమనించి చకితుడయ్యాడు మనోహర్. అది పోలీసుల కారు. లోపల జోరోచ్ కనబడుతున్నాడు కూడా.

అతను తనని వెంటాడుతున్నాడని రూఢి కాగానే మనోహర్ భృకుటి ముడిపడింది. జోరోచ్ తనని ఎందుకు అనుసరిస్తున్నాడు? ఈ సమయంలో పళనిస్వామిని కలుసు కోవటం మంచిది కాదేమో అనుకుంటూ, అతని యింటి దాపుల్లో ఒక పార్కు దగ్గర కారాపాడు మనోహర్.

నిముషం తరువాత జోరోచ్ కారు అతని ప్రక్క ఆగింది. జోరోచ్‌ని అప్పుడే చూసినట్లు ఆశ్చర్యం నటిం చాడు మనోహర్.

మనోహర్‌ని కొంచం దూరంగా తీసుకుపోయి "మిస్టర్ మనోహర్. మీరీ దీవిలో వుండటం అంత మంచిదిగాదు. దయచేసి వెంటనే వెళ్ళిపోండి. ఇది నా రిక్వెస్టుగా భావించండి." అన్నాడు జోరోచ్.

"బట్ సర్..." అనబోయాడు ఏదో, మనోహర్.

"సారీ మనోహర్! దాన్ని గురించి తర్కించకండి. వెంటనే దీవిని విడిచి వెళ్ళటం మీకే శ్రేయస్కరం!" మనోహర్ మాట్లాడే అవకాశం ఇవ్వకుండా గబగబ పోయి కారెక్కాడు జోరోచ్. కదిలి, పోయిందది.

జోరోచ్ ప్రవర్తన వింతగా తోచింది మనోహర్‌కి. ఇంతవరకు ఎంతో కోఆపరేట్‌గా వున్న అతను ఇంత హఠాత్తుగా ఎందుకు మారిపోయాడు? తన గురించి, తను

వచ్చిన కార్యం గురించి తెలిసిపోయిందా? తెలిస్తే ఎలా తెలిసింది? ఎవరు తెలిపి వుంటారు?

తన కారుని అక్కడే లాక్ చేసి, రోడ్ దాటి రెండు మూడు సందులు దాటి నిర్జనంగా కనబడుతున్న ఒక ఇంటి ముందాగాడు.

తలుపు తాళం వేసి లేదు. ఎవరూ చూడటంలేదని గమనించి, తలుపుతట్టాడు.

"ఎవరు?" అంటూ పళనిస్వామి గొంతు విన్పించింది. లోనికి వెళ్ళాడు మనోహర్.

లోపల పళనిస్వామి ముందు టీపాయ్ వుంది. దాని మీద సిగరెట్ పేకలు, ఖాళీగ్లాసు, ఖాళీ అయిన బ్రాందీ బాటిల్ ఒకటి కనిపిస్తున్నాయి. పళనిస్వామి కళ్ళు మత్తులో తూలుతున్నాయి.

"నా పేరు మనోహర్! పరమశివన్ పంపించాడు" అంటూ అతని ఎదురుగా కూర్చున్నాడు మనోహర్. బ్రాందీ వాసన ముక్కుల్ని బద్దలు కొడుతుంది. భరించాడు మనోహర్.

"పరమశివనా? వాడెవడు? నాకు బ్రాందీ బుడ్లు పంపాడా?" అస్పష్టంగా గొణిగాడు పళనిస్వామి.

అతను మత్తులో తేలుతున్నాడని అర్థం అవుతోంది. ఈ సమయంలోనే తనకు కావలసిన వివరాలు రాబట్టుకో వటం తేలికే.

"లేదు. నిన్ను వాడు పంపలేదు. ఆ రాక్షసి పంపి వుంటుంది. దాన్ని బెదిరించానని దాని భయం. నో... యూ గెటౌట్" అరుస్తున్నాడు పళనిస్వామి.

"లేదు. నీకు బ్రాందీ బుడ్లు పంపింది" అన్నాడు మనోహర్. "ఏది? నిజంగా?" కళ్ళెత్తి చూశాడు. ఎర్రగా

మందుతున్నాయవి.

"తొందరపడకు. నాకు వివరాలు చెబితే నీకు బ్రాందీ బాటిల్స్ నేను కొనిస్తాను." అన్నాడు మనోహర్.

"అడగండి. తొందరగా!" ఆతృతగా అన్నాడు పళనిస్వామి.

"పరమశివన్ కొడుకు తంగరాజుని చివరిసారిగా నువ్వెప్పుడు చూశావ్?" అని ప్రశ్నించాడు మనోహర్.

"తంగరాజా? వారం రోజుల క్రితం రజీనాతో చూశాను ఓ బార్‌లో."

"రజీనాకి, తంగరాజుకి మంచి దోస్తీ వుందా?"

"ఏమో! ఇద్దరూ అప్పుడప్పుడు కలుసుకునేవాళ్ళు. తంగరాజుకి మరో దోస్తీ వుంది. యమాగ వుంటుందిలే ఆ పిల్ల!" నవ్వాడు పళనిస్వామి.

"ఆ అమ్మాయి ఎక్కడుంటుంది?"

"చెప్పను. బ్రాందీ బాటిల్ యిస్తేగాని చెప్పను."

"ఇస్తానన్నాగా! చెప్పు!" బ్రతిమాలినట్లు అన్నాడు మనోహర్.

"అయితే పద. నేనే ఆ పిల్ల దగ్గరికి తీసుకుపోతాను", అని లేవబోయాడు పళనిస్వామి. మనోహర్ అతనికి సహాయం చేయబోతే ఒద్దన్నాడు.

అతన్ని కారులో కూలేసి, అతను చెప్పిన డైరక్షన్స్ ప్రకారం కారుని పోనివ్వసాగాడు మనోహర్.

సిటీ చివర్లో వున్న ఒక సందుముందు ఆపాడు కారుని. ఇద్దరు కారుదిగి, లాక్ చేసి, సందులోకి నడిచారు. కొంచం దూరం పోగానే ఒక బార్ కన్పించింది.

చాలా చీప్ బార్ అది. లోపల కార్మికులు, అలగా జనం తింటూ తాగుతూ కన్పించారు. సిగరెట్ల పొగ బార్

అంతా అలుముకొని వుంది. తంగరాజువంటి ధనికుడు ఇటువంటి బార్‌కి ఎలా వచ్చాడా అని ఆశ్చర్యపోయాడు మనోహర్.

"తంగరాజు స్నేహితురాలు ఇక్కడుందా?" అని అడిగాడు.

"ముందు మందు" అన్నాడు పళనిస్వామి, స్టూల్ మీద కూలబడి.

ఒక బ్రాందీ బాటిల్ యిప్పించాడు మనోహర్.

దాన్ని సగం తాగి, బార్ నంతా కలయచూసి "అదుగో! ఆ చివర ఒంటరిగా వుంది చూడు. ఆ పిల్లే తంగరాజు ఫ్రెండ్." అన్నాడు అతను.

ఆమెని చూసి "ఆమేనా? పొరపాటు పడటం లేదుగా?" అన్నాడు అతనున్న పరిస్థితి తెలుసుకుంటూ.

"నాన్సెన్స్! నేను తాగినా మతి పోలేదు. నిస్సందేహంగా ఆమే. మరో బాటిల్" అన్నాడు పళనిస్వామి.

ఆమె వంక నడిచాడు మనోహర్.

# 7

ఆమెకి ఇరవై ఎనిమిదేళ్ళుంటాయి. సన్నగా, పొడుగ్గా వుంది. భుజాలవరకు కత్తిరించుకున్న జుట్టు. పల్చటి ఎర్రటి పెదిమలు. నాజూకైన శరీరం. ఛామనఛాయ.

ఎవరికోసమో ఎదురు చూస్తున్నట్లుంది ఆమె వాలకం.

ఆమె ఎదురుగా ఖాళీగావున్న కుర్చీలో కూర్చున్నాడు మనోహర్.

"మేడమ్! మీతో కొంచం మాట్లాడాలి!" అన్నాడు.

అతనివంక ఆశ్చర్యంగా చూసిందామె.

"మీ రెవరో నాకు తెలీదు, నాతో ఏం పని?" అని

అడిగింది.

"తంగరాజు గురించి మీతో మాట్లాడాలి. అతని తండ్రి తరఫున వచ్చాను."

"తంగరాజా? అతనెవరు?" అంది ఆశ్చర్యంగా.

సూటిగా చూశాడు మనోహర్. "మేడమ్, సరిగ్గా గుర్తుకు తెచ్చుకోండి. తంగరాజు మీ బాయ్‌ఫ్రెండ్. మీ ఇద్దరిని చూసిన వాళ్ళున్నారు."

"మిస్టర్! మీరు పొరపాటుబడుతున్నారు. నాకా తంగరాజెవరో, నాకెలా బాయ్‌ఫ్రెండో తెలీదు. వస్తా" అంటూ లేచి చరచర గుమ్మంవేపు నడిచిందామె.

మనోహర్ దిగ్భ్రాంతుడయ్యాడు. ఆమె అబద్ధం చెబుతుందా? లేక తాగిన మత్తులో పళనిస్వామి పొరబాటు చెప్పాడా?

చటుక్కున స్వామి దగ్గరకు పోయాడు. "పళని స్వామి! ఆ అమ్మాయే ఈ అమ్మాయా?" అన్నాడు కుదుపుతూ.

"అవును బ్రదర్! ఏమంది?" అన్నాడు పళనిస్వామి.

అతన్ని వదిలి బయటకు పరుగెత్తాడు మనోహర్. దూరంగా నిర్జనమయిన రోడ్ మీద నడుచుకుంటూపోతూ కన్పించిందామె.

ఆమెవైపు నడవబోయేంతలో భుజంమీద చేయేసి ఆపారెవరో. వెనుదిరిగి చూశాడు మనోహర్. కండలు తిరిగిన వస్తాదులాంటి మనిషొకడు కన్పించాడు.

"చూడు బ్రదర్! ఆమె కావాలంటే దొరకదు. ఇంకొకరికి ఎలాట్ చేయబడింది. నీక్కావాలంటే వేరే పిల్ల వుంది పద." అన్నాడు శాంతంగా.

అతని ఉద్దేశ్యం అర్థం అయింది.

"సారీ! అందుకు కాదు. ఆమె చేతి రుమాలు మరిచి పోయింది. యివ్వటానికి పిలుస్తున్నాను" అంటూ అతని పట్టు విడిపించుకుని, ఆమె వైపు గబగబ అడుగులు వేశాడు మనోహర్.

శబ్దం విని తిరిగి చూసిందామె.

"చూడు మిస్టర్! ఇంతవరకూ మర్యాద ఇచ్చాను. ఇంకా అల్లరిచేస్తే బాగుండదు. నాకు తంగరాజెవరో తెలియదు. నన్ను వదిలెయ్!" అంది ఆమె.

మనోహర్ జేబులోనుంచి తంగరాజు ఫోటో తీసి చూపించాడు. అది చూడగానే ఆమె భృకుటి ముడిపడింది.

"మీరు పోలీసుల మనిషి కాదా?" అని అడిగిందామె.

"కాదు. నాపేరు మనోహర్. తంగరాజు తండ్రి పరమ శివన్ తన కొడుకు కన్పించటం లేదని, పరిశీలించమని అడిగితే యిలా వచ్చాను," అని తన గురించి వివరంగా చెప్పాడు మనోహర్.

"ఇతని పేరు తంగరాజని నిజంగా నాకు తెలియదు. గోపాల్ అని చెప్పాడు." అంది ఆమె.

తంగరాజు మారుపేరుతో విప్లవముఠాలో చేరి వుంటాడని వూహించాడు మనోహర్.

"ఈ తంగరాజే గోపాల్. అతన్ని చివరిసారిగా ఎప్పుడు చూశారు? విప్లవ ముఠాలో అతనికి పరిచయం వున్న సంగతి మీకు తెలుసా?" అని ప్రశ్నించాడు మనోహర్.

"ఇక్కడ కాదు. అక్కడ నా కారుంది. రండి" అంటూ సందుదాటి, దూరంగా పార్కింగ్ చేయబడ్డ ఒక కారువంక దారితీసిందా యువతి.

"నా పేరు ఫ్రాన్సిస్ కోనీ. గోపాల్ తో పరిచయం

ఆయాక అతని భావాలు గమనించి అతన్ని నేనే విప్లవ ముఠాలో చేర్పించాను'' అని చెప్పిందామె.

''మీరా? అంటే...'' అన్నాడు ఆశ్చర్యపోతూ.

''అవును. నేనూ విప్లవదళంలోని సభ్యురాలినే. విప్లవ దళంలోనికి సభ్యులను చేర్చటం నా పని. తిరుగుబాటు జరిపి చుంగ్ మిన్‌ను దించటం మా లక్ష్యం. అందుకు ఏమయినా చేస్తాం!'' అంది జానీ ఆవేశంగా.

''విప్లవ దళం ఎవరు స్థాపించారు ఎందుకు?''

''అంటే...''

''మరేం లేదు. ఇందులో మరో దేశం ప్రమేయ మేమయినా వుందా? లేక మీ అంతట మీరే స్థాపించు కున్నారా? అని...''

''చుంగ్ మిన్ అధికారంలోకి రాకపూర్వం 'మోజంగ్' అనే వ్యక్తి అధికారంలో వుండేవాడు. అతనిదగ్గర ఉండే 'రచాయ్' అనే మంత్రి కొడుకే విప్లవనాయకుడు 'జార్మన్' మరో అధికారి కూతురిని నేను.

చుంగ్ మిగ్ అధికారంలోకి వచ్చాక మాజీ ప్రభుత్వం లోని ముఖ్యమయిన అధికారులని, మంత్రులని నిర్దాక్షిణ్యంగా చంపించాడు. ఆ దాడిలో మా తల్లిదండ్రులు కూడా హతమయ్యారు.

అప్పుడే జార్మన్ శపథం పట్టాడు. ఏనాటికయినా చుంగ్ మిన్‌ని చంపి, అధికారం హస్తగతం చేసుకో వాలని నిర్ణయించుకున్నాడు. పగ, ప్రతీకారంతో జ్వలించి పోతున్న కొందరిని కూడగట్టుకుని కొండలలోకి పారి పోయాడు. మేమంతా అతనికి బాసటగా నిలిచాము.

చుంగ్ మిన్ జార్మన్ని, అతని ముఠాని నాశనంచేయా లని అనేక విధాలుగా ప్రయత్నించాడు. కాని అతని

ప్రయత్నాలు ఫలించలేదు. దాదాపు రెండువేలమంది యువకులు, యువతులు మా దళంలో చేరారు. వారికి షూటింగ్, ఫైరింగ్ వంటి విద్యలు జార్మన్ స్వయంగా నేర్పేవాడు.

త్వరలోనే అధికారాన్ని హస్తగతం చేసుకుంటాం. చుంగ్ మిన్ మరణించిన మరుక్షణమే దేశప్రజల్ని ఉద్దేశించి జార్మన్ ప్రసంగించటం కళ్ళారా చూస్తాను. అప్పుడుగాని నాకు తృప్తి లేదు.''

ఆవేశంగా పలుకుతున్న ఆమె మాటలను వింటున్నాడు మనోహర్. యితరులు వారిని గమనించటం లేదు...

''తరువాత గోపాల్... అదే తంగరాజుని పెళ్ళాడతావా?'' అని అడిగాడు మనోహర్, అంతా విని.

''లేదు. వేరొకరితో నా వివాహం నిశ్చయమై పోయింది.''

''ఎవరితో?''

''విప్లవదళ నాయకుడు జార్మన్‌తో.''

నిముషంపాటు నిశ్శబ్దం ఆవరించింది వారిద్దరిమధ్య. మనోహర్ మెదడులో అనేక ఆలోచనలు సుళ్ళు తిరుగుతున్నాయి.

''మిస్ జోసీ! నేను మీ నాయకుణ్ణి వెంటనే కలుసుకోవాలి. అతనితో ఒక విషయం మాట్లాడాలి''అన్నాడు మనోహర్.

ఆశ్చర్యపోయింది జోసీ. ''ఏమిటది?''

''ఇంతకాలమూ ఎవరి అండదండలు లేకుండా మీరు మీ సంస్థని స్థాపించి, పోషించుకోగలిగారు. మీకు రష్యా సహాయం చేస్తుందన్న రూమర్స్ వ్యాపిం

చాయి."

"అబద్ధం" అంది జోనీ.

"రైట్. కాని 'కైనా' దేశం మీ దళాన్ని వశపరుచుకుని, తద్వారా స్విట్‌లాండ్‌ని హస్తగతం చేసుకోవాలని చూస్తుంది. ఇదీ నా అనుమానం" అన్నాడు మనోహర్. కైనా గూఢచారి స్విట్‌లాండ్ రావటానికి అదే కారణం అని అతనిప్పుడు నమ్ముతున్నాడు.

"మీకెలా తెలుసు...?" అంది ఆశ్చర్యపడుతూ జోనీ.

తెల్లబోయాడు మనోహర్. "అంటే... నే నన్నది నిజమేనా?"

దీర్ఘంగా నిశ్వసించింది జోనీ. "నిజమే. మాకు సభ్యులున్నారు, యుక్తులున్నాయి. కాని డబ్బులేదు, శక్తిలేదు. మాకు కావలసిన ఆయుధాలు లేవు. కొనడానికి డబ్బూ లేదు.

ఆ సమయంలో నే తంగరాజు...అదే గోపాల్ పరిచయం అయింది. డబ్బుకేమీ కొదవలేదని, ఆయుధాలను తీసుకొంటానని చెప్పాడు అతను. అలాగే డబ్బు ఇచ్చాడు కూడా. అయితే వాటిని రహస్యంగా ఇక్కడికి చేర్చటం మాకు సమస్య అయింది. అదికూడా అతనే పరిష్కరించాడు అతని ఫ్రెండ్స్‌ద్వారా!"

"ఎవరతను?" కుతూహలంగా అడిగాడు.

"మగవాడు కాడు. ఆడమనిషి. పేరు రజీనా. మిస్ రజీనా."

ఉలిక్కిపడ్డాడు మనోహర్.

"ఆమెకూడా మా సంస్థలో చేరింది. వాళ్ళ ఫ్యాక్టరీకి దేశదేశాలనుండి ఆర్డర్స్ వస్తాయి. అలా వచ్చేటప్పుడే

షిప్స్‌ద్వారా ఆయుధాలు సరఫరా చేసేది మాకు. వాటి మీద 'కైనా' 'పాకిస్థాన్' ముద్రలుండేవి. అవి ఏ దేశానివి అన్న సంగతి అనవసరం.

ఆమె మరోసారికూడా మమ్మల్ని రక్షించింది. రజీనాకి ప్రభుత్వంలో పలుకుబడి వుంది. ఒకరోజు వచ్చి స్విట్ లాండ్‌లోని కైనా ఏజంట్ల లిస్టును స్విట్‌లాండ్ పోలీసులు తయారుచేశారని, ఎంత ప్రయత్నించినా అది లభ్యం కాలేదని చెప్పింది. ఆమె సలహామీదే మా దళం మిలిటరీ కాంప్ మీద దాడిచేసి ఆ లిస్టుని చేజిక్కించుకుంది.

ఆ లిస్టుద్వారా అనేకమంది కైనా ఏజంట్లు బయట పడ్డారు. అందులో చాలామంది మా దళంలోని సభ్యులే. జార్మన్‌కి కుడిభుజంగా నిలిచినవారే. వారిని బంధించాము. రజీనా నే లేకపోతే మేమీపాటికి 'కైనా' వశం అయివుండేవాళ్ళం!"

"ఆ మిలిటరీ కాంప్ మీద జరిగిన దాడిలో తంగరాజు పాల్గొన్నాడా?"

"లేదు. దాడి జరగకముందే రజీనా ఒక ముఖ్యమయిన పనిమీద అతన్ని పంపింది. కైనాకి సంబంధించిన ఒక ముఖ్యమయిన ఏజంటు మారు పేరుతో వుంటున్నాడని తెలిపి, ఆ ఏజంటుని అంతం చేసే బాధ్యత తంగరాజుకి అప్పగించింది."

"ఆ ఏజెంటుని తంగరాజు చంపాడా? ఆ ఏజెంటెవరు?"

"ఆ ఏజంటు పేరు షూమింగ్. మారువేషంలో ఒక రిజెర్వ్‌షిప్‌లో వుంటున్నాడు. తంగరాజుకూడా మారు

పేరుతో చేర అతన్ని అంతం చేశాడు,'' చెప్పింది జోనీ.

"మీరు పేరా? ఏమిటది?'' ఆత్రుతగా అడిగాడు మనోహర్.

"రామన్'' క్లుప్తంగా అంది. స్టన్ అయిపోయాడు అతను.

# 8

చాలా సేపటివరకు ఆ షాక్‌లోనుంచి తేరుకోలేక పోయాడు మనోహర్. బుర్రంతా ఖాళీ అయినట్లయింది. జోనీ చెబుతుంది నిజమా, అబద్ధమా అన్న సందేహం కూడా రాకపోలేదు.

"మిలిటరీ కాంపులో దొంగిలించిన ఆ ఏజంట్ల లిస్టు కాపీ మీ దగ్గరుందా?'' అన్నాడు మనోహర్.

"ఉంది'' అంటూ హేండుబాగ్‌లోనుంచి కాయితాలు తీసి యిచ్చింది.

దాదాపు రెండువందల పేర్లున్నాయి. వారి వివరాలు, అడ్రసులు కూడా టైప్ చేయబడి వున్నాయి నీట్‌గా.

"థాంక్స్! వీటిని తరువాత ఇస్తాను'' అన్నాడు.

"అక్కర్లేదు. కావాలంటే మీరే ఉంచుకోండి. మీ దేశానికేమన్నా ఉపయోగపడుతుందేమో!'' అంది జోనీ.

"సరే! తరువాత జార్మన్‌ని కలుసుకుంటాను. మీరెళ్ళిపోండి'' అంటూ కారు దిగాడు మనోహర్.

"మిస్టర్ మనోహర్! మిమ్మల్ని చూసి పోలీసుల మనిషని కఠినంగా ప్రవర్తించినందుకు క్షమించండి'' అంది కారు స్టార్టు చేస్తూ.

"నెవర్ మైండ్! రజీనా కూడా అలాగే అనుకొని ఉంటుంది."

"మీ విషయం వెంటనే ఆమెకి చెబుతాను" అని కారుని పోనిచ్చింది ఆమె.

లిస్టువంక ఒకసారిచూసి ఏదో నిశ్చయానికి వచ్చాడు. పళనిస్వామి ఎటూ తను వచ్చేవరకు అక్కడే వుంటాడు. అతనితో చెప్పే అవసరం లేదనుకొని, మరో నాలు గయిదు గొందులు తిరిగి ఒక భవంతిలోనికి ప్రవేశిం చాడు.

లోపల ఉన్న మనిషికి భారత ప్రభుత్వం తనకి యిచ్చిన అధికారపత్రం చూపించి, "సర్! ఈ లిస్టని వైర్ లెస్‌లో వెంటనే సిబిఐ హెడ్ క్వార్టర్స్‌కి పంపి చెక్ చేయమనండి. నిజమో అబద్ధమో తెలిస్తే చాలు. ఎంత త్వరగా సమాధానంవస్తే అంత మంచిది"అన్నాడు ఇండియా ఎంబసీలోని ఆ అధికారితో.

"రేపు ఉదయానికల్లా జవాబు రెడీగా వుంటుంది. మీకు ఎప్పుడు ఫోన్ చేయమంటారు?"

"వద్దు. నేనే వీలయినప్పుడు ఫోన్ చేస్తాను. పది గంటల ప్రాంతంలో వెయిట్ చేయండి" అని చెప్పి బయటపడ్డాడు.

అతనికి చాలా సందేహాలు కలుగుతున్నాయి. మిస్ రజీనా కూడా విప్లవ ముఠా సభ్యురాలే కావటంతో తనను మానించినట్లుగాక, వేరెవరో తనని దీవినుంచి వెళ్ళ గొట్టించటానికి ప్రయత్నిస్తున్నారు. వాళ్ళెవరు? తను పరిశోధన మానుకుంటే వాళ్ళకేమిటి ఉపయోగం?

అలా ఆలోచిస్తుండగానే వెనకనుంచి వచ్చి ఆగింది పోలీసుకారు. కమీషనర్ జోరోచ్ దిగాడు.

"మిస్టర్ మనోహార్! మీ గురించి సిటీ అంతా గాలిస్తున్నాం! ఇలా రండి" అంటూ కారెక్కించుకున్నాడతన్ని.

బార్ దగ్గరలో వదిలిన మనోహార్ కారుదగ్గరికి తీసుకుపోయి "చూడండి" అన్నాడు.

అదిరిపడ్డాడు మనోహార్. వెనక సీటులో పళనిస్వామి అనుకొని ఉన్నాడు. అతని గుండెల్లో పిడి కనబడుతోంది.

"ఇతన్ని హత్య చేసినందుకు మిమ్మల్ని అరెస్టు చేస్తున్నాం!" అన్నాడు జోరోచ్.

# 9

దేశంకాని దేశంలో చేయని నేరానికి యిలా బంధిఖానాలో పడతానని చివరి క్షణంవరకూ ఊహించలేకపోయాడు మనోహార్.

అప్పటికి ఉదయం ఆరుగంటలు దాటింది.

రాత్రంతా సెల్‌లోనే గడిపాడు అతను. సిగిరెట్ కాలుస్తూ తాను ఐలెండ్‌లోకి అడుగుపెట్టిన దగ్గరనుంచి సంభవించిన సంఘటనలు గుర్తుకు తెచ్చుకుంటూ, ఏదో వూహించటానికి రాత్రంతా ప్రయత్నిస్తుండిపోయాడు. తనని ఎవరయితే అడ్డు తొలగించుకోగోరుతున్నారో, వాళ్ళే ఈ హత్యానేరాన్ని తనపై మోపి ఉంటారని భావించాడతను.

ఏడుగంటలవుతుండగా జోరోచ్ వచ్చి తలుపులు తెరిపించి, "మిస్టర్ మనోహార్! మీకు జామీను ఇవ్వబడింది. మీరిక వెళ్ళవచ్చు" అన్నాడు.

తనకి జామీను యిచ్చేదెవరా అని ఆశ్చర్యపోయాడు మనోహార్. శోనీనా?

"ఎవరిచ్చారు?" అన్న అతని ప్రశ్నకు సమాధానం యివ్వటానికి నిరాకరించి "బయటికి వెళ్ళండి. మీకే తెలుస్తుంది" అన్నాడు జోర్జ్.

బయట తెల్లటి కారు ఆగి కన్పించింది మనోహర్ కి.

"కమిన్ మిస్టర్ మనోహర్!" అంటూ ఆహ్వానించింది మిస్ రజీనా.

"మీరా?" అన్నాడు తెల్లబోయి.

"క్షమించండి మనోహర్! మీరు పరమశివన్ గారి తరఫున వచ్చారని తెలిస్తే యింత హడావిడి జరగక పోను. మీ రెవరో పోలీసుల మనిషని అపోహపడ్డాను. జోనీ వచ్చి చెప్పేదాక నాకు తెలియదు. పదండి. తంగ రాజు దగ్గరికి వెళదాం" అంది రజీనా.

తెల్లబోయి "అతనెక్కడుంటాడో మీకు తెలుసుగా?" అని ప్రశ్నించాడు.

"తెలుసు" అన్నట్లు తలూపింది. "కంపానగరం ఉత్తరదిక్కు కొండల్లో విప్లవదళాలు నివాసం చేస్తున్నాయ్. అక్కడికి చేరుకున్నాడతను. ముందు మా ఫ్యాక్టరీకి వెళ్ళి, అక్కడ్నుంచి తంగరాజు దగ్గరకు వెళ్దాం" అంది.

"ఐ. సీ." అన్నాడు. మనోహర్ కారెక్కిన తరువాత కారు కదిలింది.

పావుగంట అనంతరం నగరాన్ని విడిచి, మరికొంత దూరం పోయి, ఎడమప్రక్కకు తిరిగింది కారు. మెత్తటి ఎర్రటి మట్టిరోడ్ ని పట్టి, దుమ్ము రేపుతూ సాగిపోయింది. పావుగంట తరువాత ఒక ఫెన్సింగ్ లోనికి తిరిగింది కారు. దూరంగా ఏవో ఫ్యాక్టరీ షెడ్స్ కనబడుతున్నాయి.

"ఇది మా ఫ్యాక్టరీ. యిక్కడ కొంచం పనివుంది

నాను. అది పూర్తయ్యాక తంగరాజు దగ్గరకు వెళదాం. ఈలోపుగా మీ పనులు కానివ్వండి. రాత్రి భోజనంకూడా లేదు కాబోలు." అంటూ ఒక మూలగా నున్న భవంతి ముందు కారాపింది రజీనా.

లోపలినుంచి పదహారేండ్ల బాలిక పరుగెత్తుకొచ్చింది.

"రూమా! వీరికేం కావాలో చూడు." అని ఆ పిల్లను పురమాయించి, "ఇరవై నిముషాల్లో వస్తాను మనోహర్" అంటూ కారులో వెళ్ళిపోయింది మిస్ రజీనా.

మనోహర్ లోనికి నడిచి తన పనులు పూర్తి చేసుకున్నాడు. స్నానాదికాలు ముగించి, టిఫిన్ దట్టంగా పట్టిస్తుండగా చటుక్కున అతనికి గుర్తుకొచ్చింది.

వెంటనే రజీనా ప్రయివేటు గదిలో వున్న టెలిఫోన్ ఎత్తి డయల్ చేశాడు.

"మనోహర్‌ని మాట్లాడుతున్నాను. నెగిటివా? పాజిటివా?" అని అడిగాడు.

"కంప్లీట్ నెగటివ్" అంటూ సమాధానం ఇచ్చాడు ఎంబసీ అధికారి.

ఫోన్ పెట్టేసి ఆలోచనలో పడ్డాడు మనోహర్. కైనా ఏజంట్ల లిస్ట్ అని స్వీట్ లాండ్ పోలీసులు తయారు చేసింది అబద్ధపులిస్టు. అందులో కొంతమంది యిదివరకు భారతదేశంలో గూఢచారి చర్యలు జరిపినవారే. కాని వారు, వీరు ఒకరు గాదని వార్త తెలిసింది. ఆ అబద్ధపు పేర్లనే నిజమైన లిస్టని నమ్ముతున్నారు విప్లవకారులు. ఎవరిది పొరబాటు? పోలీసులదేనా?

ఆదే క్షణంలో గుమ్మం దగ్గర అలికిడయి తల తిప్పి చూశాడు.

రజీనా "వెళ్దామా?" అంది.

"వెళ్ళాంగాని మిస్ రజీనా...ముందు నాతో సంగతి చెప్పు. నువ్వు రైనా ఏజంటుగా ఎప్పుడు చేరావ్?" సూటిగా ప్రశ్నించాడు మనోహర్.

భయంకరమైన నిశ్శబ్దం అలుముకుంది గదిలో.

# 10

"వాట్ డు యూ మీన్?" కోపంగా అంది మిస్ రజీనా.

"యస్ రజీనా. నువ్వు రైనా తరఫున పనిచేస్తున్నావని నాకు తెలుసు. నిజం చెప్పు!" అన్నాడు మనోహర్.

"షటప్! నీకు మతి పోలేదుగదా? ఏం మాట్లాడుతున్నావో తెలుసా?"

"తెలుసు. విప్లవ దళాలకు రైనా ఏజంట్ల లిస్టు అని చెప్పి వాళ్ళకి దొరికింపచేసిన లిస్టు మొత్తం అబద్ధం. మీరే ఆ లిస్టుని తయారుచేసి వుండాలి. పాపం జార్మన్ దానిని నమ్మి తన విశ్వాసపాత్రుల్ని తానే బంధించాడు. దానికి కారణం నువ్వు, నీ అనుచరులు. అసలు లిస్టేమయిందో నీకు తెలిసి వుండాలి. అంటే నువ్వు రైనా ఏజంటు 'చాయింగ్' మనిషై వుండాలి. అతను మరణించటంతో నువ్వే ఆర్డర్స్ పాస్ చేస్తూ, అతను బ్రతికున్నట్లే నా అనుచరులను నమ్మిస్తున్నావ్."

"నో! అబద్ధం. అంతా అబద్ధం!" అరిచింది రజీనా.

"ఏది అబద్ధం? నేను మీ పనులకు అడ్డం వస్తున్నానని భావించి, ఏనాటికయినా నిజం తెలుసుకోగలనని గ్రహించి, మీ దారినుంచి నన్ను తప్పించ చూశావ్. పళనిస్వామి హత్య చేయించి అది నామీద మోపావ్.

అయితే ఈలోగా జోసీ నిన్ను కలుసుకుంది. దానితో నాకు చాలా వివరాలు తెలుసునని, వాటి నెక్కడ

పోలీసులకు చెబుతానోనని భయపడి ఏమీ ఎరగనట్లే విడిపించావ్.

బహుశా నకిలీ లిస్టుని చూసిన తంగరాజుని చంపినట్లు నన్నూ రహస్యంగా అంతం చేయాలని చూశావ్!'' తాపీగా అన్నాడు.

అదిరిపడింది మిస్ రజీనా. ''తంగరాజుని చంపేనా? నీకెలా తెలుసు?''

''జరిగిన ఫాక్ట్సునిబట్టి గెస్ చేశాను.''

''మైగాడ్! మిస్టర్ మనోహర్. నేననుకున్న దాని కంటే ప్రమాదకారివి నువ్వు. నిన్ను బ్రతికుండనీయటం చాలా ప్రమాదం'' అని చటుక్కున హేండ్‌బాగ్‌లో నుంచి చిన్న పిస్టలు తీసింది.

ఆమె అంత క్విక్‌గా ప్రవర్తిస్తుందని వూహించలేక పోయాడు మనోహర్.

''మిస్టర్ మనోహర్! నువ్వన్నట్లు నేను క్రైనా ఏజంటునే. ఆ వివరాలు తెలిసినవాళ్లు బ్రతకకూడదు.'' అంటూ ట్రిగ్గర్ నొక్కబోయింది.

అదే సెకనులో 'ఢన్' మన్న చప్పుడయింది.

మూలుగుతూ కుప్పలా కూలిపోయింది మిస్ రజీనా. ఆమె వీపునుంచి రక్తం వెల్లువలా ప్రవహించ మొదలు పెట్టింది.

తెల్లబోయి అటు యిటూ చూశాడు మనోహర్.

బయట వరండా చివరనుంచి పొగలు కక్కుతున్న పిస్టలుతో ప్రత్యక్షమయ్యాడు కమీషనర్ జోరోచ్.

''సారీ ఫ్రెండ్! రజీనా క్రైనా ఏజంటని యిప్పటి వరకు నాకు తెలియదు. తెలియగానే...''

''మీరిక్కడకు ఎలా వచ్చారు?'' ప్రశ్నించాడు

మనోహర్.

"నిన్న హత్యాస్థలంలో జరిగిన పరిశోధనలో మిస్ రశీనా ఈ హత్యని చేసినట్లు సాక్ష్యం దొరికింది. దానిని గురించి వివరాలడుగుదామని వస్తే గుమ్మంలో నిలుచుని నిన్ను బెదిరిస్తూ కనిపించింది. అంతే! వెంటనే కాల్చే శాను. కాని ఈమె కైనా ఏజంటంటే...ప్చ్. ఐ కాంట్ బిలీవ్!" అన్నాడు జోరోచ్.

"వీళ్ళ లీడర్ గురించి తెలుసుకోవాలంటే మరో చోటికి వెళ్ళాలి మనం," అన్నాడు మనోహర్.

"ఎక్కడికి?"

"చెబుతాను. పదండి," అంటూ దారి తీశాడు మనోహర్.

రెండు నిమిషాల తరువాత పోలీసు కారు కదిలింది.

# 11

"స్కాట్‌లాండ్ మెరైన్ రీసెర్చ్ అకాడెమి" అన్న అక్షరాలు మెరుస్తున్నాయి, నీటిమీద ప్రతిఫలించిన కాంతిలో.

మధ్యాహ్నం పన్నెండు గంటల ప్రాంతంలో తమని సమీపిస్తున్న ఒక బోట్‌ని గమనించి "ఛీఫ్! ఎవరో వస్తున్నారు" అని రిపోర్ట్ చేశాడొక వ్యక్తి.

డెక్ మీద నిలబెట్టి ఉంచబడిన బాతీస్పియర్ బయటి నుంచి పరిశీలిస్తున్న ప్రొఫెసర్ కర్టిస్ కళ్ళు చిట్లించుకొని చూశాడు.

మనోహర్, పోలీసు కమీషనర్ జోరోచ్.

డెక్ మీదకు వచ్చారిద్దరు అయిదు నిమిషాల తరువాత.

"సారీ ప్రొఫెసర్! మరలా మీకు శ్రమ కల్గించక

తప్పలేదు'' అన్నాడు మనోహర్.

"బాతీస్ఫియర్ ని జస్ట్ ఉదయమే బయటికి తీశాము. ఆరిన తరువాత లోనికి పోదామనుకుంటుండగా మీరు వచ్చారు'' అంటూ తలుపు తెరిచి బాతీస్ఫియర్ లోనికి దారితీశాడు క్రిస్. జోగోచ్, మనోహర్ లు కూడా లోనికి దూరారు

లోపల పచ్చని పాచివంటి పదార్థం పేరుకుపోయి వుంది. లోపల వున్న శవం భయంకరంగా వుంది. తల, మొండెం అంతా కొరుక్కు తిన్నాయి చేపలు. శవం అసలు ఆకారంలో లేదు. దుస్తులుకూడా చిరిగిపోయాయి. జేబుదగ్గరవున్న ప్లాస్టిక్ బాడ్జిమీద 'ఫ్లూమింగ్' అన్న పేరు మాత్రం వుంది.

బాతీస్ఫియర్ అంతా పరిశీలించాడు మనోహర్. అతని దృష్టి లోపల వున్న ఒక పరికరంమీద పడింది. దానిని క్రిస్ కు చూపి ఏదో అడిగాడు.

కావన్నట్లు తలవూపాడు క్రిస్, ఆశ్చర్యపోతూ.

జోగోచ్, క్రిస్ లు యిద్దరు బయటికి నడవగానే, శవం జేబులు తడిమి, లోపలి దుస్తులలో వున్న ఒక కాగితాల బొత్తిని జేబులో వుంచుకున్నాడు మనోహర్.

"ప్రొఫెసర్! ఆ మరణించిన మనిషి! 'ఫ్లూమింగ్' కాదు. 'రామన్' '' అన్నాడు మనోహర్ బయటికివచ్చి.

"వాట్? వాట్ ఆర్ యు టాకింగ్?'' ఉలిక్కి పడ్డాడు క్రిస్.

"యస్ ప్రొఫెసర్. మీకు మొదటినుంచి చెబితేగాని అర్థంగాదు'' అంటూ చాయింగ్, రజీనా, తంగరాజుల గురించి చెప్పాడు.

"స్పీట్ లాండ్ ని వశపరుచుకో చూస్తున్న విప్లవ

దళాలను హస్తగతం చేసుకొని, తద్వారా ఈ దేశాన్ని అక్రమించుకోవాలని కైనా వాంఛిస్తోంది. అందుకని కైనా గూఢచారి 'చాయింగ్'ని పంపింది. అతడు 'ఫూమింగ్' అన్న మారుపేరుతో మీ దగ్గర చేరాడు.

అయితే ఈ లోపు మరో సంఘటన జరిగింది. స్వీట్‌లాండ్ పోలీసులు ఎంతో కష్టపడి, ఐలెండ్‌లో వున్న కైనా ఏజంట్ల వివరాలు తయారు చేశారు. ప్రభుత్వంలో పలుకుబడివున్న కైనా ఏజంటు ఒకరు ఆ విషయం కనుక్కొని, అసలు లిస్టుని మాయంచేసి, దొంగలిస్టుని తయారు చేసి, ఆ లిస్టుకోసం మిలిటరీ కాంపుమీద దాడి జరపవలసిందిగా విప్లవ దళాలను ప్రోత్సహించారు.

జార్మన్ అలాగే చేసి ఆ దొంగలిస్టు ప్రకారం తన ముఖ్య అనుచరులను ఖైదులో వుంచాడు.

అయితే పోలీసులు తయారుచేసిన అసలు లిస్టు మాయం అయింది. ఈ విషయం తంగరాజు గ్రహించి, అతనే అసలు లిస్టు మాయం చేశాడు.

నిజమయిన లిస్టు గనక విప్లవ దళాలచేతిలో పడితే దళంలో పనిచేస్తున్న కైనా ఏజంట్ల వివరం తెలిసి తమ గుట్టు బయటపడుతుందని గ్రహించారు కైనా ఏజంట్ల నాయకులు. నిజమైన లిస్టుని పొందటానికి 'రామన్' అన్న పేరుతో వ్యవహరిస్తున్న తంగరాజుని హత్యచేయబూనారు.

తంగరాజుని హత్యచేసి ఆ లిస్టుకోసం వెదికాడు ఫూమింగ్ వేషంలోవున్న చాయింగ్. అయితే ఆ హడావిడిలో అది లభించలేదు. బాతీస్పియర్‌ని నాశనం చేస్తే లిస్టు, తంగరాజుకూడా మాయం అవుతారని ఊహించి అలాగే చేశాడు.

అయితే బాతీస్ఫియర్‌కి అతననుకున్నట్లుగా ఎక్కువ నష్టం జరగని సంగతి అతనికి తెలిసి వుండదు. అందుకనే నిజమయిన లిస్టు బయటపడింది.'' అంటూ జేబులోనుంచి కాగితాల బొత్తి తీశాడు మనోహర్.

బాగా తడిసిపోయినప్పటికీ, మైపు చేయబడిన ఆ కాగితాలు చదవటానికి వీలుగానే వున్నాయి.

''మరి... ఈ హత్య ఎలా జరిగింది? ఫ్లూమింగ్ ఎలా తప్పించుకున్నాడు?'' అడిగాడు ప్రొఫెసర్ కర్టిస్.

రెండు నిమిషాల పాటు ఏదో ఆలోచించి అన్నాడు మనోహర్.

''అదంతా పెద్ద నాటకం ప్రకారం జరిగింది. ఏడు వందల అడుగుల లోతులో బాతీస్ఫియర్ తలుపు తెరవటం సాధ్యంగాదని చెప్పారు మీరు. తెరిచినా మనిషి ఆ ప్రెషర్‌కి బ్రతకటం కష్టం. దానినిబట్టి ఆలోచిస్తే ఇలా జరిగి వుండొచ్చు.

బాతీస్ఫియర్‌ను నీటిలో దింపగానే, వెంటనే స్పీడ్‌గా మునగనీయకుండా క్రమంగా వేగం పెంచుకుంటూ దింపుతారని చెప్పారు. బాతీస్ఫియర్ దిగిన వెంటనే 'తంగరాజు'ని చంపి, ఫ్లూమింగ్ లిస్టుకోసం వెదికాడు. కాని కనిపించలేదు.

ఇంతలో బాతీస్ఫియర్ క్రిందకి యింకా దిగటంతో తలుపులు తెరుచుకుని వచ్చేశాడు ఫ్లూమింగ్. ఇదంతా అంత ఎక్కువ ప్రెషర్ వుండని యాభై అడుగుల లోతులోపే జరిగివుంటుంది.

అంతకు ముందే రికార్డు చేసివున్న వాటర్‌ప్రూఫ్ ఆటోమాటిక్ టేపురికార్డర్ ద్వారా 700 అడుగుల లోతులో ఏదో భయంకర దృశ్యాన్ని చూశానని మీ సిబ్బందిని

అయోమయంలో పెట్టి, ఎక్స్‌ప్లోజివ్స్ సహాయంతో బాతీసియర్‌కి, షిప్‌కి కనెక్షన్స్ కట్ చేశాడు. బాతీస్థియర్ అడుగుకి పోవటం మాని లిస్టు అంతం అయినట్లే అని తలచి వెళ్ళిపోయాడు.''

ఆశ్చర్యంతో అందరి కళ్ళూ విప్పారాయి.

''మరి అసలు లిస్టుని ఎవరు మాయం చేశారు?''

''కైనా ఏజంట్లు దేశంలో నలుమూలలా విస్తరించి వున్నారు. వారందరిని గమనించి పోలీసులు తయారు చేసిన లిస్టు అది. అయితే పోలీసు అధికారులలో కూడా, ఒకడు కైనా ఏజంటు కావటంవల్ల, దానిని మాయంచేసి, దొంగ లిస్టు వుంచాడు. దానిని తంగరాజు సంగ్రహించాడు'' చెప్పాడు మనోహర్.

''ఇంతకీ అతనెవరు?'' అడిగాడు జోరోచ్.

''అతనా? ఈ దేశంలో పోలీసులో ప్రధానాధికారిగా బాధ్యతలున్న మనిషి. సెన్సార్‌షిప్ విధించి ఈ విషయాలు బయటకి రాకుండా చేస్తున్న వ్యక్తి. ఇంకెవరూ-నువ్వే!''

''నేనా?'' అదిరిపడ్డాడు జోరోచ్. ''నేనే కైనా ఏజంటయితే మిస్. రజీనాను ఎందుకు చంపుతాను?'' అన్నాడు పాలిపోయిన ముఖంతో.

''ఎందుకంటే రజీనా నీ బాస్. ఆమె వుండగా నీవామె స్థానంలోకి చేరుకోవాలంటే ఆమెను తొలగించక తప్పదు. దానిని నామీద మోపవచ్చనుకొని ఆమెని చంపావ్.''

చటుక్కున పిస్టలు తీశాడు జోరోచ్. ''నువ్వుచాలా తెలివయినవాడివి.'' పళ్ళుకొరుకుతూ అన్నాడు.

''యస్ మై ఫ్రెండ్! నేనీ దేశం వచ్చినపుడు బాతీ

సియిర్‌లో ఫలానావారు చనిపోయారంటూ పేర్లతో సహా నాకు చెప్పావ్, గుర్తుందా? సెన్సార్‌షిప్ అమలులో వుండి ఈ దేశీయులకయినా తెలియనివ్వని రహస్యాన్ని నా కెందుకు చెప్పావో తరువాత అర్థం అయింది. బహుశా నే నెవరో, ఎందుకు వచ్చానో నీవు గ్రహించి ఉంటావ్.

నా మాట ప్రకారం 'ఘామింగ్' రూపంలో ఉన్న 'చాయింగ్' మరణించాడని నమ్మి వెళ్ళిపోతానని భావించావ్. కాని నేను పరిశోధనకి దిగటంతో కంగారుపడి ఈ ఐలెండ్ విడిచి వెళ్ళవలసిందిగా వత్తిడి చేశావు. నా పరిశోధనలో నీ విషయం బయటపడుతుందేమోనని భయపడ్డావు'' చెబుతున్నాడు మనోహర్.

''యూ బాస్టర్డ్'' ట్రిగ్గర్ నొక్కబోయాడు జోరోచ్.

అదే క్షణంలో 'సర్' మంటూ వచ్చి జోరోచ్ చేయి మీద తగిలి పిస్టల్ని యెగరగొట్టిందో ఇనుప వస్తువు.

జోరోచ్ మీదకు యెగిరిదూకాడు మనోహర్. పిడికిలి బిగించి అతని గడ్డంక్రింద కొట్టగానే, పళ్ళు కదిలి నోట రక్తం అయింది.

అదే క్షణంలో ఎవరో క్రిందపడ్డ పిస్టల్ని తీసుకుని జోరోచ్‌ని కాల్చేశారు.

''థాంక్స్ వాయంగ్'' అన్నాడు ఇనుప వస్తువు విసిరిన వాయింగ్‌తో, మనోహర్.

''ఈ దేశంలో ఇంత గూడుపుఠాణీ జరుగుతుందా?'' అంటూ ఆశ్చర్యపోయాడు కర్టిస్.

మనోహర్ ఆయనతో చెప్పి బయలుదేరాడు.

తంగరాజు మరణించాడు. పరమశివన్ ఏమవుతాడు?

చాయింగ్ తప్పించుకోబోయాడు. ఈ సంగతి విప్లవ దళంకి తెలియచేయాలి. జార్మన్ కలుసుకోవాలి. అంటే ఫ్రాన్సిస్‌జోనీని కలుసుకోవాలి. ఎలా?

దీవిని సమీపించి పోలీసుల కారు ఎక్కేసరికి దీవి లోపల ధన్, ధన్‌మన్న కాల్పులారంభం అయ్యాయి. "విప్లవం రేగిందన్నమాట" అనుకున్నాడు.

# 12

ఈ హడావిడిలో ఫ్రాన్సిస్‌జోనీ ఎక్కడ వుంటుంది? ఆమెని దొరకబుచ్చుకోవడం ఎలా? అనుకుంటూ కారులో బయలుదేరాడు మనోహర్.

చుంగ్‌మిన్‌ని చంపటం వారి ధ్యేయం గనుక అతని పాలెస్‌లో ఉండొచ్చు ననుకుంటూ కారుని అటువైపు నడిపాడు.

హఠాత్తుగా ప్రారంభమయిన విప్లవానికి పోలీసులు, సైనికులు తట్టుకోలేకపోతున్నారనిపించింది మనోహర్‌కి. అక్కడక్కడ గుట్టలుగా సైనికుల, పోలీసుల శవాలు పడివున్నాయ్.

చుంగ్‌మిన్ పాలెస్‌కి యెదురుగా ఒక సందుచాటున కారు ఆపి కాచుక్కూచున్నాడు మనోహర్.

పాలెస్ గేటునుంచి కొంతదూరంలో వుంది. లోపల సంకుల సమరం జరుగుతున్నట్లుగా కాల్పులు వినబడుతున్నాయి.

పావుగంట అనంతరం పాలెస్‌నుంచి ఒక కారు గేటువైపుగా దూసుకురావటం కన్పించింది మనోహర్‌కి. చుంగ్‌మిన్! అతను పారిపోతున్నాడు కాబోలు.

అయితే చుంగ్‌మిన్ కారు గేటు బయటకు వచ్చిరాక ముందే దానిమీద మెషిన్‌గన్‌ల వర్షం కురిసింది. చిల్లులు

పడిన కారు మెలికలు తిరుగుతూపోయి, ఒక గోడకి గుద్దుకొని ఆగిపోయింది.

ప్రాణాలమీద ఆశ చావని చుంగ్ మిన్ అలానే బయటికి రాబోయాడు. అదే క్షణంలో అతని కారుమీద హేండ్ గ్రనేడ్ పడి గుభిల్లుమన్న పెద్ద శబ్దంతో తునా తునకలయిపోయింది కారు.

పాలెస్ లోపల కాల్పులు ఆగిపోయాయి. సైనికులు పోలీసులు లొంగిపోతున్నారు విప్లవదళం సభ్యులకి. ఒక్కొక్కరే బయటకు వస్తుండటం చూశాడు మనోహర్.

అయితే వారిలో జార్మన్ కాబోయే భార్య జోనీ కన్పించలేదు. ఏమయినట్లు?

చటుక్కున అతనికి గుర్తుకొచ్చాయి జోనీ మాటలు.

"చుంగ్ మిన్ మరణించిన మరుక్షణమే జార్మన్ దేశ ప్రజల్ని ఉద్దేశించి ప్రసంగించటం కళ్ళారా చూస్తాను. అప్పటికిగాని నాకు తృప్తిలేదు."

అంటే... రేడియో స్టేషన్‌లో వుండాలి.

"డామిట్, ఆలస్యం చేశాను" అనుకుంటూ కారుని వెనక్కి పోనిచ్చి, రేడియోస్టేషన్ వయిపు పరుగు తీయించాడు.

రేడియో స్టేషన్ చుట్టూ విప్లవదళ సభ్యులు కాపలా వున్నారు. పోలీసు కారు తమని సమీపించటం చూడగానే గన్స్ ఎక్కుపెట్టారు.

క్షణం ఆలస్యం చేసినా ఏమవుతుందో మనోహర్‌కి తెలుసు. వెంటనే జేబులోంచి తెల్లని రుమాలుతీసి, బయట గాలిలో ఊపసాగాడు. లొంగిపోతున్నాననటానికి సూచన అది!

"ఎవరున్నావ్?" గద్దించి అడిగాడొక విప్లవదళ సభ్యుడు.

"నా పేరు మనోహర్. జార్మన్, జానీలు లోపలున్నారా?" ఆతృతగా ప్రశ్నించాడు మనోహర్.

"ఎందుకు?" అనుమానంగా ప్రశ్నించాడు అతను.

మనోహర్ వెంటనే ఒక కాగితంమీద తన పేరు రాసి, అతనికి అందించాడు.

"దీన్ని జోనీకి ఇవ్వు. అర్జెంట్."

లోనికి పరుగెత్తాడతను.

అదే క్షణంలో ప్రజల నుద్దేశించి ప్రసంగించటం పూర్తయిన జార్మన్ వెనుదిరిగి స్తంభించిపోయాడు.

విప్లవదళం సెకండ్ కమాండర్ రోజర్ పిస్టలుతో జోనీ వెనుక నిలబడి ఉన్నాడు. జోనీ భయంతో వణుకుతోంది.

"రోజర్! ఏమిటది?" అరిచాడు జార్మన్.

"సారీ జార్మన్! నా పేరు రోజర్ కాదు. అతనెప్పుడో పరలోకం చేరుకున్నాడు. నా పేరు చాయింగ్. కైనా గూఢచారిని."

"మైగాడ్!" అదిరిపడ్డాడు జార్మన్.

"యస్. మీరిద్దరు చావబోతున్నారు. మీరు చావగానే రేడియోలో నా అనుజ్ఞ విని మీ దళంలో ఉన్న సభ్యుల్ని నావాళ్ళు మట్టుపెడతారు. ఈ దేశం మా దేశ స్వాధీనం అవుతుంది" అన్నాడు వికృతంగా నవ్వుతూ చాయింగ్.

"యూ యిడియట్! రాస్కెల్..."తిడుతున్నాడు జార్మన్.

అదే క్షణంలో చాయింగ్ వెనుక ఎవరో కదిలిన చప్పుడయి, వెనుదిరగబోయాడు చాయింగ్.

మారు సెకనులోనే ధన్ ధన్ ధన్ మంటూ మెషిన్ గన్ చాయింగ్ శరీరాన్ని తూట్లు పొడిచాయి. నిలువునా కూలి పోయాడు చాయింగ్.

"సర్! మీ కోసం మనోహర్ అన్న వ్యక్తి వచ్చారు. ఆ సంగతి మీతో చెప్పటానికి వస్తే యిక్కడ..."

"థాంక్యూ మనోహర్! మమ్మల్నే గాదు, మా దేశాన్ని కూడా రక్షించావ్" అనుకుంది ఫ్రాన్సిస్ నోసి.

-: ఐ పో యిం ది :-

## సీరియల్




[పదునెనిమిదవ భాగము]

హఠాత్తుగా "ఎవరక్కడ?" అన్నమాటా, ఆ మాటతోపాటు పెద్దటార్చికాంతి—పదిహేను గజాల దూరంలో.

"అందరూ—క్విక్" అని వెనక్కితోసాను.

మరుక్షణంలో నలుగురం వో యిసుకదిబ్బ వెనకాల వున్నాం.

టార్చికాంతి అటూయిటూ కదుల్తూ, ఖాసిం శవం మీదపడి నిల్చిపోవడం గమనించాను.

కళ్ళు చిట్లించి బాటరీలైట్ వ్యక్తివేపు చూసాను—

కాపలా గార్డ్ — మెషీన్ రైఫిల్ — తలకు శిరస్త్రాణం.

ఖాసిం శరీరం మీదకు రైఫిల్ కొనమోపి, "పైకి లే! ఎక్కడికి పారిపోలేవ్" అన్నాడు కర్కశంగా గార్డ్.

రెస్పాన్స్ రాకపోవడంతో అనుమానంగా వంగి ఖాసిం దేహాన్ని పరీక్షించ సాగాడు.

సరిగ్గా అదేసమయంలో!

బూటుకాల్లోని చురకత్తి కోసం, చేయి దింపాను.

నాచేయి పైకిలేచే లోపుగానే 'టుప్' మన్న శబ్దం వినబడింది.

"మ్మ్..." అన్న మూలుగుతో గార్డు నేలమీద కూలి పోయాడు.

"శాన్యో౦!" అన్నాను నాచేతులు చీకటిలో ఆడిస్తూ.

"సారీ మేజర్! మీ అనుమతి వుండాలో లేదో తెలియదు. గార్డుని చంపాను." శాన్యోరా కంఠం గంభీరంగా వినబడింది.

"అఫ్‌కోర్స్ ఫాస్ట్ యాక్షన్! గుడ్ గర్ల్!" అని మాత్రం అన్నాను.

చీకట్లో నాచేతికి, ఆమె చేతిలోని సైలెన్సర్డు యిటాలియన్ బెరెట్టా చల్లగా తగిలింది.

తిరిగి నలుగురం చైనీస్ స్థావరం యెడమప్రక్కకు పాక్కుంటూ వెళ్ళాం.

శాన్యోరాకు సైగ చేశాను.

ఆమె చేతిలో కట్టింగ్ ప్లెయర్ ప్రత్యక్షమయింది. రెండునిముషాల్లో బార్బ్‌డ్ వైర్ ఫెన్సింగ్ రెండు గజాల మేర, కట్ అయి మనిషి దూరేంత ఖాళీ ఏర్పడింది.

"మీరంతా యిక్కడే వుండండి. వాకీ-టాకీద్వారా నేను మెసేజ్ యిచ్చిన తర్వాత మీరు లోపలికి ప్రవేశించాలి. ఎవరయినా ఎగురయితే సాధ్యమయినంతవరకు చప్పుడుగాకుండా చంపండి." హెచ్చరించి ఖాళీలోంచి లోపల్కి అడుగుపెట్టాను.

"భయంకర్! ప్లీజ్ బి కేర్‌ఫుల్!"

వెనుకనుంచి శాన్యోరా హెచ్చరించింది.

వంగి, ముందుకి గబగబ నడవసాగాను...

ఓ గుడారం పక్కగా నిలబడ్డాను.

తల నేలమీదకువంచి లోపలికి చూశాను.

మనుషుల అలికిడి లేదు ఆ గుడారంలో.

లోపల సన్నగా లాంతరు వెల్గుతోంది.

అందులో నాలుగయిదు ఒంటెలున్నాయి.

అంటే ఒకవిధంగా అది పశువులశాల అన్నమాట.

జర్కిన్ బరువుగా ఎత్తుగా వుంది.

అందులో వాకీ-టాకీ ఇంకా ఇతరసామగ్రి వున్నాయి.

మెల్లిగా గుడారంలోకి ప్రవేశించాను.

ఒంటెలనడ్డుగా చేసుకొని అవతలవైపు మైదానంకేసి పరిశీలనగా చూశాను.

అరశాంతి అవరణమీద పడుతోంది.

చటుక్కున చీకట్లోకి తప్పుకున్నాను.

మిలిట్రీ యూనిఫారంలో వున్న యిద్దరు వ్యక్తులు సిగరెట్లు పీలుస్తూ, మాట్లాడుకుంటూ ముందుకు వెళ్ళిపోయారు.

ఎలా ప్రవేశించాలి భవనంలోకి?? తీవ్రంగా ఆలోచించి యిక కదుల్దామనుకుంటుండగా, వో గార్డువచ్చి యెదురుగావున్న వో స్టూలుమీద అలసటగా కూర్చున్నాడు.

తలవంచి అతను సిగరెట్ ముట్టించుకున్నాడు. సిగరెట్ పీలుస్తూ అతను వోసారి అటూయిటూ చూసాడు ఊపిరి బిగబట్టి నిలబడి, చూస్తూండిపోయాను. అంతలో వో ఆలోచన, మస్తిష్కంలో తళుక్కున మెరిసింది.

పెరాబుల్లమ్ పిస్టల్ మొనతో ముందున్న ఓ బెంను బలంగా పొడిచాను.

ఒంటె చిన్నగా అరుస్తూ ముందుకు గెంతింది.

ప్రక్కకు జరిగి రెస్పాన్స్‌కోసం గార్డ్ వేపు చూసాను. అతను గుడారంవైపు ఓసారి చూసి మళ్ళీ సిగరెట్ పీల్చడంలో మునిగిపోయాడు.

నా ప్రయత్నం ఫలించలేదు.

గుడారంలో మూడోంతులు చీకటిగా వుంది.

మెల్లిగా కదిలి, గుడారం గుమ్మంవైపు వెళ్ళకుండా, ఎడంవైపు నిలబడ్డాను.

"అ...బ్బా..."...అంటూ పెద్దగా మూల్గాను.

చెవులు రిక్కించాను!!

బూట్ల అలికిడి అయింది!!

మెల్లిగా దగ్గిరయింది ... గుమ్మంవద్దకు వచ్చి ఆగిపోయాయి బూట్లు...

"మ్మ్..." మరోసారి మూల్గాను.

బూటువాళ్ళు లోపలికి రావడం, టార్చిలైటుకాంతితో పాటు అతను నావేపు తిరగడం, వరుసగా జరిగాయి.

అంతే!

సైలన్సర్ బిగించబడిన నా చేతిలోని 9 యం.యం. వాల్తర్ పెరాబుల్లమ్ నుండి "స్పన్..." మనే ధ్వని వెలువడింది.

గుండు సూటిగా అతని మెదడులోకి చొచ్చుకు

పోవడం, అతను బరువుగా వాలిపోవటం ... అంతా క్షణాల్లో జరిగిపోయింది.

శవాన్ని, బాగా, లోపలికి లాగేసాను.

మరో అయిదు నిముషాల్లో నేను సెంట్రీ దుస్తులు ధరించాను.

జేబులు తడిమి చూడగా ఓ టోకెన్ కనబడింది. పైకి తీసాను. యిత్తడి బిళ్ళ అది.

99 అన్న అంకె ముద్రించబడి వుంది.

టోకెన్‌ను తిరిగి జేబులో వేసుకొని, తలమీద కాప్ బాగా, నుదుటిమీదకు లాక్కున్నాను.

భుజాన్ని వేలాడుతున్న మెషిన్ గన్ ఊపుకుంటూ, హుందాగా బిల్డింగ్ వేపు నడవసాగాను.

నా గుండెలు దడదడలాడుతున్నాయి. ఏమాత్రం అనుమానం వచ్చినా నన్ను పిచ్చికుక్కలా కాల్చి చంపుతారు.

గార్డ్ వేషంలో సెక్యూరిటీ బిల్డింగ్ ప్రక్కగా ఆగి ఓరగా ముఖద్వారంవైపు చూసాను. విషయం అర్థమైంది.

గుమ్మంవద్ద ఓ వాచ్‌మన్ కాపలావున్నాడు. అతని ఎదురుగావున్న స్టూలుమీద నాలుగయిదు టోకన్లున్నాయి.

అంతే! ఇక ఆలశ్యం చేయలేదు.

ఒక చెయ్యి పొట్టమీద, మరోచేయి గొంతుమీద అదుముకొని గబగబా అడుగులు వేసాను.

"నైట్ డ్యూటీ గార్డ్‌వి. ఈ సమయంలో లోపలేం పనిరా?" వాచ్‌మన్ యింకా ఏదో అనబోతుండగా—

తలవంచుకొనే డొక్కోడాన్కి సిద్ధంగా వున్నట్లు శబ్దాలుచేస్తూ. "ప్లీజ్! డాక్టర్ రూంకి వెళ్ళాలి. వాంతులు వస్తున్నాయ్." అంటూ తొంభైతొమ్మిదో నంబరు టోకన్

అతని చేతిలో పెట్టి, సమాధానం ఆశించనట్లు గబగబా లోనికి నడిచాను.

వాచ్‌మన్ యింకేమీ అభ్యంతరం చెప్పలేదు. "దేవుడులాంటి మావో మరణించినపుడుకూడా మనకి డ్యూటీ తప్పలేదు" అన్న సానుభూతి వాక్యం వినబడింది వెనకనుంచి.

అదృష్టం నావేపు వుందన్నమాట.

డాక్టర్ రూం నిజంగా భవంతిలో లేకపోతే, నన్ను ఖచ్చితంగా అనుమానించేవాడు వాచ్‌మన్.

పైకి వెళ్ళేముందు మెట్లు కనబడ్డాయి. పైకి లంఘించాను.

మొదటి అంతస్థు వరండాలోకి ప్రవేశించగానే, రెండో అంతస్థు మెట్లు దిగుతూ ముగ్గురు మిలిటరీ వ్యక్తులు కనబడ్డారు. చటుక్కున గోడవారగా చీకట్లో నక్కాను.

వాళ్ళు ముగ్గురూ మాట్లాడుకుంటూ క్రింది ఫ్లోర్‌లోకి వెళ్ళిపోయాక భారంగా ఊపిరి వదిలి పై అంతస్థువేపు అడుగులు వేసాను.

గదుల బయటవున్న సైన్‌బోర్డులు చదువుకుంటూ ముందుకి నడిచాను.

ఓచోట నా కాళ్ళు చటుక్కున ఆగిపోయాయి. 'లాబొరేటరీ' అన్న బోర్డు అగపడింది. ప్రక్కకి చూసాను. 'ప్రైవేట్ రూమ్. ప్రొఫెసర్ హూ యాంగ్ వూ'. అని వ్రాయబడ్డ సైన్‌బోర్డు చూసి నాలో ఆనందం గంతులు వేసింది. గుండెలు అతివేగంగా కొట్టుకోసాగాయి.

గది తలుపులముందాగి మెల్లిగా తోసాను.

తెరుచుకోలేదు.

లోపల బోల్ట్ చేయబడి ఉందన్నమాట.

సన్నగా మాటలు వినిపిస్తున్నాయి.

ప్రక్కకి కదిలాను — కిటికీ-

థాంక్ గాడ్! కిటికీ తలుపులు దగ్గరగా వేయబడి ఉన్నాయి. వ్రేలితో కిటికీ తలుపులు అంగుళం లోపలికి తోసాను. చెవులు రిక్కించాను. సన్నగా వినబడుతోంది లోపల్నుంచి సంభాషణ.

క్లియర్‌గా వినలేకపోతున్నాను.

మిలిట్రీచొక్కా లోపల ధరించిన, జర్కిన్ పాకెట్ లోకి చెయ్యి జొనిపాను. మరుక్షణం నా చేతిలోకి హియరింగ్ ఎయిడులాంటి వస్తువు ప్రత్యక్షమైంది.

మధ్య వైర్ — అటూ ఇటూ రెండు గుండ్రటి బొడిపెలు.

ఒకవైపు బొడిపెను (రిసీవర్) నా చెవిలోకి దూర్చుకొని వైర్‌కి కనెక్టు చెయ్యబడ్డ రెండోవైపు బొడిపెను (మైక్రోఫోన్) కిటికీ తలుపు సందుగుండా లోనికి తోశాను.

ఇప్పుడు లోపలి మాటలు నా చెవులకి క్లియర్‌గా వినబడసాగాయి.

"ఏమిటీ మీరనేది?" ఆశ్చర్యంగా పలికింది ఓ కంఠం.

"ఎస్. ప్రొఫెసర్ హోయాంగ్ హో! భారతదేశాన్ని వరదల్లో ముంచెయ్యాలి. ప్రకృతిశక్తులనే చేజిక్కించుకున్న అపూర్వ మేధావులు మీరు. అదే — శక్తితో నిరంతర కుంభవృష్టితో భారతదేశాన్ని భీభత్సం పాలు చేయండి. ఈ దెబ్బతో వారి పంటలన్నీ నాశనమవ్వాలి. — ప్రభుత్వం గడ గడలాడిపోవాలి దిక్కుతోచని పరిస్థితుల్లో."

"మేజర్ చావో! దిసీజ్ టూమచ్. ఈ విషయం

ముందర చెప్పలేదు నాకు. విప్లవకారుణ్ణి కాదు నేను. విశ్వకల్యాణాభిలాషిని."

"మనదేశం పాడిపంటలతో విలసిల్లుతూ, సస్యశ్యామలం కావడానికి మాత్రమే నేను మీకు ఉపయోగపడతాను."

"క్షమించాలి ప్రొఫెసర్! యిది ప్రభుత్వపుటాజ్ఞ. ఈరోజే మీ ప్రయోగం విజయవంతమైంది. అందుకే యిప్పుడు చెప్తున్నాను. మీ అపూర్వశక్తులతో యిండియాని చైనాకి దాసోహమనిపించాలి" చావో కంఠం.

"యింపాజిబుల్. నా కంఠంలో ప్రాణముండగా ఇది జరగదు."

"ఈ అనంత విశ్వంలో ఏ మానవుడ్ని — భయభ్రాంతులకి గురిచేసి నాశనం చేసే అధికారం నాకు లేదు. నా సేవలు మన చైనాదేశ ప్రజలు వుపయోగించుకొనే విషయంవరకే పరిమితం."

"మిస్టర్ - హోయాంగ్ హో! మీతో నీతి-స్నేహం-విశ్వమానవ సౌభాతృత్వం గురించి చర్చించే అవకాశం, అధికారం, నాకు లేదు. ఐయామ్ జస్ట్, ఒబేయింగ్ మై సుపీయర్స్ ఆర్డర్స్. నాపై జారీచేయబడిన ఆజ్ఞలను నేను పాటించక తప్పదు. పిచ్చి వుపన్యాసాలు యిచ్చి, దేశద్రోహి కావద్దు. అనవసరంగా ప్రాణాలుపోగొట్టుకోవద్దు."

"వ్వాట్? నన్ను చంపడమా? మీకు పిచ్చిపట్టి వుండాలి. లేకపోతే ప్రకృతి శక్తులను గుప్పిట్లో ఇరికించుకున్న, ఏకైక వ్యక్తితో ఈ విధంగా మాట్లాడరు."

ప్రొఫెసర్ ఆవేశంతో ఊగిపోతున్నట్లు గమనించాను.

"అయామ్ సారీ ప్రొఫెసర్! బాగా ఆలోచించు

కోండి. దేశద్రోహం నేరాన్ని మీ పై రుద్దుకోవద్దు. తీవ్రంగా ఆలోచించండి. మన ప్రభుత్వం ఎంత కఠిన మైనదో మీకు తెల్సు. మళ్ళీ రేపు వుదయం కలుస్తాను... గుడ్ నైట్!''

చటుక్కున ట్రాన్స్మిటింగ్ సాధనాన్ని బైటకిలాగి, వరండా వారగా చీకట్లోకి దూకాను.

తలుపు తెరుచుకున్న చప్పుడు—

ఆఫీసర్ దుస్తుల్లోని మేజర్ చావో బైటకివచ్చాడు. ఊపిరి బిగపట్టి అతన్ని పరీక్షిస్తూ అలాగే నిలబడిపోయాను.

వరండాలో నిలబడి, సిగరెట్ ముట్టించుకొని, పెద్ద పెద్ద అంగల్తో మెట్లవేపు నడిచాడు మేజర్ చావో.

చటుక్కున ప్రొఫెసర్ గదిలోకి చొరబడ్డాను. విశేష మైన తలుపు చప్పుడుకి టీ త్రాగుతున్న ప్రొఫెసర్ హోయాంగ్ హో ఉలిక్కిపడి చూసాడు.

''ఎవరునువ్వు?'' అన్నాడు కంగారుగా, జేబులో చెయ్యి పెట్టబోతూ.

మెషిన్ గన్ అతనికేసి గురిపెట్టాను: ''మీ చేయి వెనక్కి తీసుకోండి ప్రొఫెసర్! విశ్వమానవ సౌభ్రాతృత్వంకోరే పూజనీయులకు మారణాయుధాలతో పనిలేదనుకుంటా. నాచేతిలోని యీ మెషిన్ గన్ మీకు సంబధించినంత వరకూ ఏ అపకారము చెయ్యదు.''

చెయ్యి వెనక్కి తీసుకొని ప్రొఫెసర్ నన్ను పరిశీలించ సాగాడు. ''మరో ప్రపంచ సంస్థ మీకు స్వాగతం పలుకుతోంది. అయామ్ మేజర్ భయంకర్—ఇండియా నుంచి పారిపోయి మిమ్మల్ని కల్సుకోడానికి యింత దూరం వచ్చాను.'' అంటూ చెప్పసాగాను.

* * *

"నీ మాటలు నమ్మటం ఎలా?" — అన్నాడు ప్రొఫెసర్ హోయాంగ్ హో నా సుదీర్ఘ వుపన్యాసం విన్న తర్వాత.

"సాక్ష్యాలు చూపిస్తాను ప్రొఫెసర్! కానీ ఓ విషయం మీరు నమ్మాలి. నేను ఓ దోపిడి ముఠానుండి కాని సంఘ వ్యతిరేక శక్తుల తరఫునగానీ ఎన్నోవేల మైళ్ళు అతి కష్టంతో ప్రయాణించి, యింతదూరం రాలేదు. కొత్త ప్రపంచ సాధనకొరకు, N. W. O. సంస్థతరఫున మీ చేయూత కావాలని ప్రార్థిస్తున్నాను" అన్నాను గంభీరంగా.

జర్కిన్ జిప్పర్ లాగి, లోపల్నుంచి ఓ ఆల్బమ్‌లాంటి పుస్తకం తీసాను.

రెండు నిముషాలపాటు, పేజీలు ఆసక్తిగా, తిరగేసాడు ప్రొఫెసర్.

అందులో — ప్రతీ పేజీలో - న్యూ వరల్డ్ ఆర్గనైజేషన్‌లో - పనిచేస్తున్న ఒక్క సైంటిస్టు ఫొటో— వారి వివరాలు—N. W. O. ఆశయాలను సమర్థిస్తూ మేధావుల కామెంట్స్, వరుసగా సంతకాలతోసహా పొందుపరచబడ్డాయి.

నూతన ప్రపంచ స్థాపనలో ప్రొఫెసర్ హోయాంగ్ హో — ఏ సందేహాలు లేకుండా వెంటనే చేయూత ప్రకటించి 'న్యూవరల్డ్' అనే తియ్యటి కలను నిజం చేయమని అభ్యర్థిస్తూ అనేక దేశాల సైంటిస్టులు సంతకాలు చేసిన పర్సనల్ లెటర్స్ కూడా చదవడం ముగించాడు హోయాంగ్-హో.

పుస్తకం మడిచిన, ప్రొఫెసర్ కళ్ళలో ఆనంద బాష్పాలు వెలువడ్డం నాకెంతో ఆనందం కల్గించింది.

''మిస్టర్. భయంకర్! నిన్ను - మీ సంస్థను, మీ సంస్థ ఆశయాలను ఇప్పుడు హృదయపూర్వకంగా నమ్ము తున్నాను. ఏ దేశంలోని పౌరుడికైనా తినడానికి తిండి, వుండడానికి ఇల్లు - ఆస్తులు వున్నా - యుద్ధభయం మాత్రం విశ్వమానవుడ్ని నిరంతరం వెన్నాడుతోంది. ఆ భయం పోగొట్టే ఏకైక సంస్థ మీ ఎన్.డబ్ల్యూ.ఓ. అని నమ్ముతున్నాను. నా పూర్తి సహకారం మీకుంటుంది.

నేను వెంటనే బయలుదేరి ఈ మేధావులందర్నీ పలక రించి, కౌగలించుకోవాలని వుంది.'' అన్నాడు ఉద్రేకంగా చైనీస్ సైంటిస్టు హోయాంగ్-హో.

ఆనందం పట్టలేక ప్రొఫెసర్‌ను గట్టిగా కౌగలించు కున్నాను. ''థాంక్యూ వెరీమచ్ ప్రొఫెసర్. నేను బయలుదేరిన లక్ష్యం దాదాపు నెరవేరింది. మీకెలా కృతజ్ఞతలు చెప్పుకోవాలో తెలియడం లేదు.''

సమాధానంగా నవ్వి భుజంమీద తట్టాడు ప్రొఫెసర్. ''ఇట్సాల్‌రైట్. కాని మనం ఇప్పుడు ఈ విషవ్యూహం నుండి తప్పించుకోవడం ఎలా అన్న విషయం ఆలోచిం చాలి. మరో సంగతి!

నేను ఇంతకుముందు అమర్చిన యంత్రాలు - ఈ ఎడారిలో మరో అరగంటనుండి ప్రారంభమై రెండు గంటలపాటు కుంభవృష్టి కురిసేటట్టు చేస్తాయి.

మొదటి ప్రయోగంద్వారా ఈ చుట్టుప్రక్కల పది మైళ్ళ పరిధిలో వర్షం కురిసేటట్టు చేయడం జరిగింది. అయితే యిప్పుడు రేంజి పాతిక మైళ్ళకు మార్చాను.''

''ప్రస్తుతాన్కి ఆ విషయం అలాగే వుంచండి ప్రొఫె సర్! మీకు కావాల్సిన అన్నిరకాల సహాయాలు N.W.O సంస్థ సగర్వంగా చేస్తుంది. పోతే, యిక్కడి సైనికబలం

మీకే బాగా తెల్సు కాబట్టి తప్పించుకొనే ఉపాయం మీరే ఆలోచించాలి.'' అంటూ బయటవున్న కాస్త్రోరా, సులేమాన్‌ల గురించి, సుడాన్ N.W.O. బ్రాంచ్ గురించి, వారి ప్రణాళిక గురించి చెప్పాను.

''వెల్ మిస్టర్. భయంకర్! ఈ భవనానికి వెనక వైపున ఓ చైనీస్ టాంకు వున్నది. అందులో క్షేమంగా పారిపోవచ్చు. నీ అనుచరులను—అక్కడికి—ఎలాగో కష్టపడి చేరుకోమని చెప్పు. కాని టాంకులో పారిపోతుంటే దాన్ని కాపాడే వ్యక్తికూడా ఒకరు, శత్రు సంహారం జరిగేదాకా ఇక్కడే వుండిపోవాల్సి వుంటుంది.

ఎందుకంటే, యాంటీ టాంక్ గన్‌తోనో, లేదా యాంటీ-టాంక్ గ్రెనేడ్‌తోనో మా సైనికులు టాంకుకు ఆపద కల్గించే అవకాశం వుంది. మన ప్రయత్నం విఫలం అయితే - నేను యిక బ్రతికి వుండటంకల్ల. మీరంతా కూడా.''

''నో ప్రొఫెసర్! ఆపద తలపెట్టకండి. చివరి రక్తపు బొట్టువరకూ, మిమ్మల్ని క్షేమంగా పంపించడానికై పోరాడతాను.

నేను యిక్కడే వుండిపోయి, మీ టాంకుకు 'ఫాలోయింగ్' లేకుండా చూసుకుంటాను. తర్వాత జీపుమీదో, గుర్రంమీదో, ఒంటెమీదో, పారిపోయి ఎడారిదొంగల నాయకుడి స్థావరాన్ని చేరతాను. అక్కడ మనకోసం హెలికాప్టర్ ఎదురు చూస్తుంటుంది.'' గబగబా మాట్లాడాను.

''మిస్టర్ భయంకర్! ఈ ఎస్సైయిన్‌మెంట్‌లో నువ్వు ముఖ్యమైన వ్యక్తివి...''

''సందేహించకండి ప్రొఫెసర్. ముఖ్యమైన వ్యక్తిని

కాబట్టే మిమ్మల్ని శత్రువులనుండి కాపాడే బాధ్యత వహిస్తున్నాను.''

ప్రొఫెసర్ హాంయాంగ్ హా భారంగా నిట్టూర్చాడు. ''ఆల్ రైట్ మేజర్. నువ్వు మెస్సేజ్ యివ్వు మీ అనుచరులకి. నన్నిక్కడ ఎవరూ అనుమానించరు కాబట్టి యిప్పుడే బయలుదేరి ఎలాగో ఆ టాంకులోకి చేరు కుంటాను.''

''ఓ.కే. ప్రొఫెసర్!'' అంటూ జర్కిన్ లోంచి వాకీ-టాకీ తీసాను.

అంతలో బయట ధన్...ధన్...మంటూ కాల్పులు విన్పించసాగాయి.

''మేజర్ భయంకర్! బయట కాల్పులు వినబడుతున్నాయి. మీ అనుచరుల ఉనికిని అప్పుడే పసిగట్టేసి ఉంటారు మా సైనికులు'' అన్నాడు కంగారుగా సైంటిస్టు హాంయాంగ్ హా.

వాకీ-టాకీ చటుక్కున ఆన్ చేసాను.

''కాన్స్యేరా!'' పిల్చాను.

''ఎస్. భయంకర్! ఇక్కడ పరిస్థితి గందరగోళంగా ఉంది. మనచే చంపబడిన యిద్దరు గార్డులు కనబడకపోవడంతో అధికారుల్లో అనుమానం వచ్చింది. సెర్చింగ్ సాగింది. మేము యిక ఫెన్సింగ్ లోపలకి ప్రవేశించి హైరెక్టుగా రంగంలోకి దూకక తప్పలేదు. ప్రస్తుతం ఓ తీపుని కవర్ చేసుకుని కాల్పులు సాగిస్తున్నాం. ఇప్పటి వరకూ ఎటువంటి ప్రమాదం జరగలేదు. నో ఇంజరీస్'' గబగబా చెప్తోంది కాన్స్యేరా కాల్పులు సాగిస్తూనే.

''కాన్స్యేరా! మనం వచ్చిన పని సక్సెస్ అయింది. ప్రొఫెసర్ హాంయాంగ్ హా అంగీకరించారు.''

"ఈజిట్ భయంకర్! వాట్ గ్రేట్ ప్లెషర్! నాలో ఉత్సాహం ఉరకలు వేస్తోంది" అంది శాన్యోరా.

"నువ్వొక పని చేయాలి. ఎలాగైనా, జాగ్రత్తగా ఈ బిల్డింగ్ వెనక ఉన్న ఒకే ఒక చైనీస్ టాంకులోకి మీరు ముగ్గురూ క్షేమంగా చేరుకోవాలి. టాంకు నడపడం వచ్చుకదూ నీకు?"

"ఎస్. మేజర్. ట్రైనింగ్ పీరియడ్‌లో శిక్షణ ఉంది."

"రైట్! ఆ టాంకులో ప్రొఫెసర్ కనబడతారు. మీరింకేమీ సందేహించకుండా, హరిహర బ్రహ్మాదులు దిగి వచ్చినా లక్ష్యం చేయక — అతి వేగంతో తిన్నగా సులేమాన్ స్థావరం చేరుకోండి. అక్కడ్నుంచి హెలికాప్టర్‌లో పారిపోవాలి. ఈలోగా నేను యిక్కడి యిబ్బందుల్ని ఎదుర్కొని యెలాగో మిమ్మల్ని కలుసుకుంటాను. అర్థమైందా?"

"భయంకర్! నువ్వు మాతో రాకపోవడమేమిటి? నేను ఒప్పుకోను" గాభరాగా పల్కింది శాన్యోరా కంఠం.

"డోంట్ టాక్ నాన్సెన్స్ శాన్యోరా! ఎక్స్‌ప్లనేషన్స్ అడగకూడదని ముందే చెప్పాను. ఎస్. డబ్ల్యు. ఓ. హెలికాప్టర్‌కి ప్రొఫెసర్‌ని చేర్చేవరకూ ఆయన బాధ్యత అంతా నీదే. ఈలోగా నేను తప్పక వచ్చి సులేమాన్ స్థావరంలో కలుసుకుంటాను. ఓ. కే?"

రెండు క్షణాలు మౌనం.

"ఓ. కే. మేజర్! మేము యిప్పుడే టాంకుని చేరుకునే ప్రయత్నాల్లో ఉంటాం."

సర్క్యూట్-క్లోజ్ అయింది.

"గుడ్ లక్ ప్రొఫెసర్!" హోయాంగ్ హోతో కర చాలనం చేసాను. "నా రక్షణ విషయం నేను చూసు కుంటాను. మీరు వెంటనే వెనక ఉన్న టాంకులోకి చేర కోండి."

సిగరెట్ ముట్టించుకొని, బీరువాలోని కొన్ని కాగి తాలు తీసుకొని, కోటులోపల దోపుకొని దమ్ము పీలుస్తూ బయటికి వెళ్ళిపోయాడు ప్రొఫెసర్ హోయాంగ్ హో.

* * *

ధన్ ... ధన్ ... ధన్ ... ధన్ ...

ఎడారిలో ఒంటరిగా ఉన్న ఆ బిల్డింగ్ చుట్టూ కాల్పులు—మృత్యువిహారంలా వినపడుతున్నాయి.

భవనంలోను, బయటి ఆవరణలోనూ ఒక్కసారిగా అన్ని లైట్లు వెలిగి ఆ ప్రాంతాన్ని ప్రకాశవంతం చేసాయి. సిగరెట్ కేసులాంటి మినీ బైనాక్యులర్స్ కళ్ళ ముందు పెట్టుకొని రెండో అంతస్తునుంచి క్రిందకి చూసాను.

కాన్స్టోరా, ఆమె వెనుక సులేమాన్, ఖాన్, మెషిన్ గన్‌లతో కాల్పులు సాగిస్తూ బిల్డింగ్ వెనకవైపు వెళ్ళ డానికి ప్రయత్నిస్తున్నారు.

ముగ్గురూ అస్తవ్యస్తంగా ఆగిఉన్న, జీపులనీ, ట్రక్కు లనీ, అడ్డుగా పెట్టుకుంటూ ముందుకు కదులుతున్నారు.

చైనీస్ సైనికులు ఆమెను నాలుగువేపులనుంచీ చుట్టు ముట్టే ప్రయత్నంలో ఉన్నారని ఊహించాను. అప్పటికే రెండువైపుల చేరి కాల్పులు సాగిస్తున్నారు. దాంతో, కాన్స్టోరా ఒక వేపు, ఖాన్, సులేమాన్ రెండో వేపు ఎటాక్ ఎదుర్కోవడం ప్రారంభించారు.

వాళ్ళని కాపాడాలి.

ఎలాగో టాంకువద్దకు చేరుకునేట్లు సహాయపడాలి!

నా మెదడులో ఓ ఆలోచన తట్టింది.

హడావుడిలో ఈ ఆలోచన శాన్యోరాకి వచ్చి ఉండదు.

అక్కడ ఉన్న రెండు ఎలక్ట్రిక్ స్తంభాలమీద నా దృష్టి నిల్చిపోయింది. బాల్కనీ గోడమీద మెషిన్‌గన్ ఎక్కుపెట్టి రెండు నిముషాలపాటు పిచ్చిగా ప్రయోగించాను.

ధన్...ధన్...ధన్...ధన్...

మృత్యు గొలుసులా ధ్వనిస్తోంది మెషిన్‌గన్.

రెండు ఎలక్ట్రిక్ పోల్స్‌కి ఉన్న ఫ్లోరసెంట్ దీపాలు భళ్ళుభళ్ళున ప్రేలాయి.

శాన్యోరా అప్పటిదాకా ఉన్న ప్రాంతం చీకటి అయిపోయింది.

"శాన్యోరా! రన్ ఫాస్ట్!" అని అరుస్తూ మొలవద్ద నుంచి హాండ్ గ్రెనేడు తీసాను.

ఇంతకుముందు గుంపులు గుంపులుగా వెంటాడిన సైనికులుండే ప్రదేశాన్ని గుర్తుపెట్టుకొని, లివర్ నోటితో లాగి బలంగా చీకట్లోకి విసిరాను హాండ్ గ్రెనేడు!

అంతే!!

ఢడాలున పెద్ద విస్ఫోటం!

ఓ జీపు "ఫట్" మంటూ పేలింది.

కెవ్వున...ఆర్తనాదాలు.

దాదాపు పదిమంది చైనీయుల మృతదేహాలు ముక్కలు ముక్కలుగా గాలి కెగిరాయి!!

చైనీస్ మేజర్ చావో, క్రింద ఎక్కడో ఉండి కేకలు పెడుతున్నాడు. "యూ బ్లడీ యిడియట్స్! పైనుంచి

యెవరో కాలుస్తున్నారు. కొంతమంది బిల్డింగ్‌లోకి ప్రవేశించండి. క్విక్!''

థాంక్ గాడ్!

నా ఊహ ఫలించింది.

ఇప్పుడు వాళ్ళ దృష్టి నామీద పడింది.

దీనితో—శాన్యోరావైపు ఒత్తిడి తగ్గవచ్చు.

మెషిన్‌గన్‌తో వరండాలోని లైట్లు టపటపా పేల్చాను!! ఇప్పుడు నే నున్న వరండా చీకటయ్యింది...

కొద్దిక్షణాల్లో సైనికులు పైకి వస్తారు.

* * *

నా కళ్ళు మూలగా వున్న స్టెయిర్‌కేస్‌ని ఆకర్షించింది.

గబగబా మెట్లెక్కి పైకి వెళ్ళాను.

ఓపెన్ టెర్రేస్!

డాబాలో అంతా ఖాళీగా ఉంది. టెర్రేస్ మీంచి క్రిందికి చూసాను.

నేలమీద—కాల్పులు వినబడుతున్నాయి.

ఉన్నట్టుండి నా హృదయం ఆనందంతో పరవశించిపోయింది.

బిల్డింగ్ వెనక వేపు...

టాంక్...

బలిష్టమైన చైనీస్ టాంకు, ఫెన్సింగ్‌ని ఛేదించుకొని, ఇసుక బస్తాలమీదుగా, అవలీలగా బంకర్లు దాటీ, విజయగర్వంతో ఎడారిలోకి దూకుతోంది.

వాకీ-టాకీ ఆన్ చేసి శాన్యోరాని పిల్చాను.

"ఎవ్విరిథింగ్ ఈజ్ ఓ. కే. మేజర్! ప్రొఫెసర్‌తో బయలుదేరుతున్నాం. ప్లీజ్. భయంకర్! నువ్వూ వచ్చెయ్."

"ప్రస్తుతం చాలా కష్టం. కాన్యోరా! నీకు నా అభి నందనలు! నీ ప్రాణాలు ఒడ్డయినా ముందడుగు వేసి— ఎలాగోలా ప్రొఫెసర్, ఎడారిదొంగల నాయకుడు సులేమాన్ స్థావరాన్ని చేరుకోవాలి. ప్రొఫెసర్‌తో నువ్వు బయలుదేరిన విషయం వైర్‌లెస్‌లో—నైరోబీకి చెప్పు. నేను ఎలాగో కష్టపడి శత్రువులకు 'మస్కా' కొట్టి అక్కడకు చేరుకోడానికి ప్రయత్నిస్తాను. కాని నా గురించి నువ్వు వేచి చూడొద్దు. ప్రొఫెసర్‌తో పోర్టు సుడాన్ బయలుదేరు. ఓవర్" అని సర్క్యూట్ క్లోజ్ చేసాను.

యధాలాపంగా క్రిందికి చూసి, ఉలిక్కిపడ్డాను. ఇద్దరు సైనికులు, పారిపోతున్న టాంకు కేసి తమ మధ్య ఉన్న ఆయుధానికి గురి చూస్తున్నారు.

అది యాంటిటాంక్ గన్!

అందులోంచి 'షెల్' దూసుకువెళితే-టాంక్ చైన్ లింక్ విడిపోయి టాంకు ఆగిపోయే ప్రమాదం ఉంది.

మెషీన్‌గన్ క్రిందికి వంచి ఆ ఇద్దరు సైనికుల్ని టప టపా కాల్చాను. వాళ్ళు గింగుర్లు తిరుగుతూ నేలకూలి పోయారు నిర్జీవంగా.

ఇంతలో—

"మేజర్ చావో! ప్రొఫెసర్ కనపడటంలేదు" అన్న సైనికుల కేకలు నా చెవులకు సోకాయి.

మళ్ళీ రెండో అంతస్థులోకి పరిగెత్తాను.

"అంతా మోసం! ప్రొఫెసర్ కూడా ఆ టాంకులో

పారిపోయుంటాడు. లేదా తీసుకుపోబడి ఉంటాడు. ఫూల్స్! మీ అందరి కళ్ళు మూసుకుపోయాయి. ఈ ఎడారిలో ఎక్కడున్నా సరే! జీపులో ఆ టాంకును వెంటాడాలి. యాంటిటాంక్ గ్రెనేడ్స్‌తో కొంతమంది నాకూడా రండి_మరి కొంతమంది వెళ్ళి తలవుపెట్టి మందుకొట్టి పడుకున్న కెప్టెన్ చుంగ్‌మిన్‌ని నిద్రలేపండి. క్విక్ ఎవరిబడీ!'' అన్న కేకలు క్రిందనుంచి వినబడుతున్నాయి.

నా గుండె లదిరాయ్!

మరో ప్రమాదం_ఎక్కడో ఉన్న టాంకుకు.

నన్ను వెతకడానికి పైకి చొచ్చుకువస్తున్న చైనీస్ సిపాయిల్ని అడ్డు తప్పించుకుంటూ రివ్వున మెట్లు దిగసాగాను.

లైటు పగలగా__బయటినుంచి వచ్చే అర కాంతిలో, ఆ గలాభాలో__చైనీస్ గార్డ్ దుస్తుల్లో ఉన్న నన్నెవరూ అనుమానించలేదు.

సులభంగా బిల్డింగ్ బయటికి వచ్చాను.

మేజర్ చావో ఆధ్వర్యంలో అప్పుడే ఓ జీపు హెడ్‌లైట్ల కాంతితో ఒక్క జర్కులో ముందుకు కదిలింది.

నాలో తటాలున పిశాచం ఆవహించింది!!

చీకట్లోకి గెంతాను...

నా చేతిలోని మెషీన్‌గన్ ''గజ్...'' మంటూ మ్రోగింది...అంతే!!

జీపు వెనుక టైరు బుస్సుమంటూ గాలిపోయిన బెలూన్‌లా అణిగిపోవడం, మరో నాలుగు బుల్లెట్లు మేజర్ చావో_తలలో దూరిపోవడం...క్షణాల్లో జరిగిపోయాయి.

చావో, కిక్కురుమనకుండా జీపుమీంచి నేలమీదకి దబ్బున పడ్డాడు.

''మేజర్ మరణాన్ని చూసిన, జీపులోని మిగిలిన చైనీస్ సైనికులు భయంగా...''కాప్టెన్ చుంగ్ మిన్!
''కాప్టెన్ చుంగ్ మిన్!''
అంటూ అరవడం ప్రారంభించారు.

చోటు మార్చి, సురక్షితమైన ఓ చీకటి ప్రదేశంలో నక్కి, పరిసితి పరికించసాగాను.

అంతలో సుమారు ఇరవై ఎనిమిది సంవత్సరాలుగల యువకుడు అటువైపు, కాస్త తూలుతూ, తలవిదిలించు కుంటూ హడావుడిగా వచ్చాడు.

అతన్ని చూసి అందరూ శాల్యూట్ చేసారు. అతనే కాప్టెన్ చుంగ్ మిన్ అయివుండాలి.'' ఇప్పుడే మెసేజ్ వచ్చింది. మనలో భయంకర్ అనే ఇండియన్ మిలిటరీ మేజర్ వున్నాడు. మనమధ్యే వుండి మనల్ని చంపు తున్నాడు. మారువేషంలో వుండివుంటాడు. ముందు అతని గురించి వెతకండి. బిల్డింగ్ లోపలా, బయటా గాలించండి. క్విక్!'' అంటూ అసహనంగా, చిందులు వేయసాగాడు చుంగ్ మిన్.

''ఇండియన్!'' అన్నారంతా ఆశ్చర్యంగా. తర్వాత తమ పక్కవాళ్ళ ముఖాలకేసి, ప్రతి ఒక్కరూ అను మానంగా చూడసాగారు. అందరూ అటు, ఇటు చెల్లా చెదరయ్యారు.

వున్నట్టుండి ఆకాశంలో మేఘాలు దట్టమయ్యాయి. మరో క్షణంలో చిన్న జల్లుతో వర్షం ప్రారంభమై-మరు నిముషాన్నే వేగం పుంజుకొంది.

వర్షంలో తడుస్తూ, మామూలు సైనికుడిలా ముందుకి నడుస్తూ కాప్టెన్ చుంగ్ మిన్‌ని దూరంగా ఫాలో అవ సాగాను.

* * *

అది భవంతి వెనకవైపు వున్న—

ఓ చిన్న అవుట్ హౌస్...

కాప్టెన్ చుంగ్ మిన్ ఔట్ హౌస్ లోపలవున్నాడు. ఎవరితోనో ఏదో మాట్లాడుతున్నాడు...

కిటికీ గడ, చిన్న ఊచతో పైకెత్తి, సన్నగా తలుపు లోపలికి తెరిచి—ఆ గదిలోకి చూడసాగాను...

లోపల రాడార్, మొదలైన రకరకాల మిలిటరీ యంత్ర సామగ్రీ—కనబడ్డాయి. చుంగ్ మిన్ కాక, ఇద్దరు వ్యక్తులున్నారు లోపల. "ఫూల్స్! మావో మరణించాడని తెలియగానే, సంతాపం పేరులో, మీరంతా నిద్రపోయి నా పీకలమీదకు తెచ్చారు." అంటూ అధికారదర్పం వుపయోగించి, ఆపరేటర్స్‌ని బూతులు తిట్టడం ప్రారంభించాడు కాప్టెన్ చుంగ్ మిన్.

దండకం ఆపి కాప్టెన్, ఓ టెలివిజన్‌లాంటి యంత్రం ముందుకు వెళ్ళాడు.

ఆ యంత్రంమీద వున్న అక్షరాల్ని చదివి అదిరి పడ్డాను...

సెల్ఫ్-టాంక్ ఇండికేటర్.

అంటే తమ స్వంత టాంకులు ఏఏ ప్రదేశాల్లో ఎంత దూరంలో వున్నాయో ఆ టెలివిజన్‌లాంటి యంత్రం, గుర్తిసుంది. బహుశా ఆ టాంకుకి—సెల్ఫ్ టాంక్ ఇండికేటర్‌కి సంకేతాలు పంపే ఆటోమాటిక్ యంత్రమేదో అమర్చబడి వుంటుందన్నమాట.

"యంత్రం స్క్రీన్ మీద వెల్గిన పచ్చబల్బు చూసి బూటుకాలు, నేలకేసి తన్నాడు కాప్టెన్ చుంగ్ మిన్. "డామిట్! టాంక్ అప్పుడే యాభైమైళ్ళు దాటిపోయింది. ప్రొఫెసర్‌ని యిండియన్స్ చేతుల్లో ప్రాణాలతో వదిలి

పెట్టడానికి వీల్లేదు. రేంజి సరిగ్గా కాలిక్యులేట్ చేసి చెప్పు." అరిచాడు కోపంగా కేప్టెన్.

"మనటాంక్ అరవై ఐదు మైళ్ళ దూరంలో వుంది సార్. దిశ — సౌత్." అన్నాడు మొదటి ఆపరేటర్.

"అతి వేగంతో ప్రయాణించి వుండాలి. సార్!" అన్నాడు రెండో అతను చేతులు నలుపుకుంటూ.

"గుడ్. లాంచింగు పాడ్ కి వెళ్ళి, అడిగ్రీలు ఎక్స్ప్లయిన్ చేసి —, మినీ మిస్సయిల్ ని పంపించి టాంకుని ఢీకొట్టమని చెప్పు..." అంటూ యింకా ఏదో చెప్పసాగాడు.

నాకిక, ఏమీ వినపడ్డంలేదు.

గుండె ఒక్కక్షణం కొట్టుకోడం మానేసింది.

కాన్వోయ్ అరవై ఐదు మైళ్ళు ప్రయాణించింది. ఇందుకు ఓవిధంగా సంతోషిస్తుంటే మళ్ళీ ఈ మిస్సయిల్ రాకెట్ ప్రమాదమా?

నా కంట్లో పిచ్చి ఆవేశం రగులుకొంది.

వర్షం జోరున పడుతూనే వుంది. నిలువునా తడుస్తూనే వున్నాను. ప్రక్కకు కదిలి, వెలుగులోనికి వచ్చి — బోట్ హౌస్ తలుపు గడియపెట్టాను.

జర్కిన్ లో చేతులుపెట్టి రెండు హాండ్ గ్రెనేడ్లు బయటికి లాగాను.

మరుక్షణం వాటి పిన్నుల్ని నోటితో తెంపి, కిటికీ ఊచలకు వ్రేలాడగట్టాను.

తలుపులు దబదబ బాదుతున్నాడు కాప్టెన్. చుంగ్ మిన్ పిచ్చికేకలు వేస్తూ. చీకట్లోకి పరుగెత్తి మెషీన్ గన్ కిటికీవైపు గురిపెట్టాను. అంతే!...

"బజ్..." మంటూ పిచ్చిగా మ్రోగింది నా చేతిలోని మెషిన్ గన్.

"ఢ్...ఢ్...ఢ్..."

బుల్లెట్లు ఒకదాని వెనక ఒకటిగా వెళ్ళి, కిటికీని వ్రేలాడుతున్న గ్రెనేడులను సూటిగా తాకాయ్.

అంతే!

భళ్ళున ప్రేలింది బోట్ హౌస్.

ఆపరేటర్లు, కాప్టెన్ చుంగ్ మిన్ దేహాలు, ఇటుక ముక్కలతో బాటు, ముక్కలు ముక్కలుగా గాల్లోకి ఎగిరాయ్.

ఇంతలో వెనుకనుంచి అడుగుల చప్పుడు వినవచ్చి నట్లయింది. అనుమానంగా వెనక్కి తిరగబోతుండగా ప్రక్కలో ఏదో గ్రుచ్చుకున్నట్లుంది...

అర్ధచీకటి...వర్షం...

అతను చైనీస్ సైనికుడిగా ఊహించాను.

"రాడార్ హౌస్ ఎందుకు పేల్చావ్?" అన్నాడతను క్రూరంగా.

"ఫూల్. ఆంగులో యింతవరకూ మనల్ని చీల్చి చెండాడిన ఇండియన్ ఉన్నాడు" అన్నాను ధైర్యం కూడగట్టుకుంటూ.

అతనికి అనుమానం వచ్చినట్లయింది. ఎడిచేయి కదిపి, టార్చితీసి నా ముఖంమీద వెల్గించాడు.

మరుక్షణం...

"నువ్వు.. నువ్వు..." అంటూ నోరెళ్ళబెట్టాడు.

"అవును. నేనే మేజర్. భయంకర్!—ఫ్రమ్ ఇండియా!" అంటూ సటాలున చెయ్యెత్తి అతని నెత్తి మీద మెషిన్ గన్ తో మోదాను.

అంతే!

చిన్నగా మూల్గి, నేలమీదకు బరువుగా వాలిపోయాడతను.

ఆ ఆవేశంలో, దగ్గర్లో ఉన్న రెండు లైట్లు భళ్ళున పేల్చేసాను.

దగ్గర్లో ఉన్న ట్రక్కులో కూర్చొని, ఇగ్నిషియం తెంపి, వైర్లు కలిపి, వాహనాన్నే స్టార్టుచేసి బిల్డింగ్ వెనక ఉన్న ఫెన్సింగ్ మీదకు ఉరికించాను. ఫెన్సింగ్ కూలిపోయి, ఇసుకలో కూరుకుపోగా ట్రక్కు చరచరా ముందుకు కదిలింది.

అప్పటికే నా శరీరం తడిసి ముద్దయింది. వర్షం నిముష నిముషానికి తీవ్రస్థాయి నందుకుంటూ కుంభవృష్టిగా మారింది.

ఫర్లాంగు దూరం దాటిన తర్వాత మేము అంతకు ముందు ఉపయోగించిన జీపు ఒంటరిగా కనబడింది. ట్రక్కు ఆపి ఆ జీపులోని రెండో వైర్లెస్ సెట్ అందుకొని మళ్ళీ ట్రక్కుని ముందుకి కదిలించాను.

ఉరుములు... మెరుపులు!!

వాతావరణం, గందరగోళంగా, భయానకంగా తోచింది.

సైంటిస్ట్ హోయాంగ్ హో మాట నెరవేరింది. అతను ఫిక్స్ చేసి వదిలిపెట్టి వెళ్ళిన ప్రయోగ ఫలితమే ఈ కుంభవృష్టి.

ఇలాంటివే ఇంకో నాలుగు వర్షాలు పడితే, ఈ ఎడారిలో పచ్చని మొక్కలు మొల్చినా ఆశ్చర్యపోనక్కరలేదు.

హెడ్ లైట్ల కాంతిలో సర్రున ముందుకు పరుగెత్తుతోంది హెవీ మిలటరీ ట్రక్కు!!

అప్పుడు శాస్త తేలిక దొరికినట్లయింది. ఓ సిగరెట్ ముట్టించి, గట్టిగా దమ్ములాగి ఆక్సిలేటర్ అదుక్కుంటూ తొక్కాను.

సివంగిలా పరుగెట్టసాగింది ట్రక్కు.

* * *

మరో పదిహేను నిముషాలు గడిచాయి.

వర్షం జోరున కురుస్తూనే వుంది.

ట్రక్కు కాబిన్ మీద దబదబా వర్షపు చప్పుడు.

ఆకాశంలో భయంకరమైన మెరుపులు...ఉన్నట్టుండి—

ఉలిక్కిపడ్డాను.

ట్రక్కు ఎదురుగా ఫర్లాంగు దూరంలో—

ఆకాశంలోంచి...

పెద్ద మెరుపు!!

క్రిందకు, రివ్వున దిగుతోంది.

నా గుండెలు దడదడలాడాయి...

ఆ కాంతి...

ఆ విద్యుత్ రేఖ...!!

భగవాన్!!

అయోమయం—

చూ ళ్ళేకపోతున్నాను...

అంతే!

కాంతి రేఖ భూమికి తాకి...భడాలున శబ్దం...

ఆటమ్-బాంబ్ పగిలినట్టు చప్పుడు...

దిశదిశలు—దద్దరిల్లే శబ్దం...

నా శరీరం ఒక్కసారి గడగడా వణికింది...

అవును...ఏమయింది నాకు!?

భగవాన్! యిది నిజమేనా???

నా కళ్ళు...క...న...పడటం లేదు!!

ఏవిటి?

హెడ్ లైట్ల కాంతి కనబడటంలేదు!!

నేను... నేను...గుడ్డివాడ్నయిపోయాను!!

అంటే!

అది...పిడుగు!!

పిడుగు కాంతి...

గజగజ వణికిపోతున్న శరీరంతో, ఎలాగో ట్రక్కు బ్రేకు నొక్కాను. ట్రక్కు ఆగింది.

ఎదురుగుండా ఏమీ కనబడ్డంలేదు. కళ్ళు నులుముకుని చూసాను...ఊహుఁ! ఏమీ కనబడ్డంలేదు.

కళ్ళముందు కేవలం కాటుకలాంటి అంధకారం!...

నాకు ఏడుపు వస్తోంది...

యిది నిజమేనా?—

శరీరం చమటలు పడుతోంది...

వణుకుతున్న చేతులతో, జర్కిన్ లోపల తడుముకుని అగ్గిపెట్టె బైటికి తీసాను.

పుల్ల గీసాను...

సర్...అగ్గిపుల్ల అంటుకున్న చప్పుడు...

కాని...

కానీ...

అగ్గిపుల్ల కాంతి_అణుమాత్రమైనా_కనుపాపలకు కనబడ్డం లేదు...

చలిజ్వరంలాంటిదేదో, నా శరీరంలోకి అణువణువునా వ్యాపించింది...

"అయ్ హావ్ బికమ్ బ్లైండ్"

"అయామె బ్లైండ్ మాన్!..."

"నేను గుడ్డివాడ్ని!"...

పిచ్చెక్కినట్టు అరిచాను...

కళ్ళకెదురుగా కాటుక చీకటి...

ఎదురుగా చీకటేమిటి?

కళ్ళకే చీకటి!

కళ్ళే చీకటి!

చీకటిపడిన కళ్ళు...

నిన్న నేను చూసిన పగలే, ఆఖరి పగలు...

మరో అయిదు గంటల్లో రాబోయే సూర్యకాంతిని నేను చూడలేను.

అదొక్కటే కాదు!

జీవితాంతం సూర్యకాంతిని చూడలేను.

నేనిప్పుడెక్కడికి వెళ్ళాలి?

ఎలా వెళ్ళాలి??

అగ్గిపుల్లలన్నీ టపటపా గీసిపారేసాను.

ఊహుఁ—'సర్' మంటూ అంటుకున్న చప్పుడే వినబడుతోంది.

సందేహం లేదు...

నేను గ్రుడ్డివాణ్నయిపోయాను. ఇప్పుడేం చెయ్యను?

అంతలో ... కుడివేపు ... కొంతదూరం వెనుకగా వాహనం కదిలిన అలికిడి.

"షూట్ హిమ్! అదుగో ... వాడే మన కాప్టెన్నీ! మేజర్ని చంపిన బ్లడీ యిండియన్ - మేజర్ భయంకర్ పిచ్చికుక్కలా కాల్చండి..."

ఆ కంఠం వెనకే గజగజా మ్రోగిన మెషిన్ గన్ చప్పుడు. "అబ్బా!" కెవ్వున అరిచాను. కుడిభుజంలోను, పొట్ట కుడిభాగంలోను, కుడి తొడలోను దాదాపు పది

పోను కాలిన యినుపకణికలు దూరాయ్. ప్రాణం పోతోంది. నోరార్పుకపోతోంది. ఎడంభుజాన్ని నీరసంగా కదిపి సీటు ప్రక్కలో వున్న మెషిన్ గన్‌ని అందు కున్నాను. "రాస్కెల్స్! ముడ్డివాడ్ని చంపుతున్నారు!" పళ్ళు పటపటా కొరికి, మాటల శబ్దం వచ్చిన స్పాట్ ఊహించి...ధన...ధనా... మోగించాను.

ధన్...ధన్...ధన్...ధన్...అటూ ఇటూ త్రిప్పు తున్నాను...దాదాపు పది నిముషాలు మెషిన్ గన్ మ్రోగుతూనే వుంది.

కెవ్వున ఆర్తనాదాలు...

వాహనపద్దాలు పగిలిన చప్పుడు...నాలుగు వందలు పైగా బుల్లెట్లు ఖర్చయ్యాయి. ఖాళీ అయిపోయి, వేడెక్కిన మిషన్‌గన్ విసిరికొట్టాను. జర్కిన్‌లో మిగిలిన మరో రెండు హాండ్ గ్రెనేడ్లు కసిగా విసిరాను...

ధడేల్...ధడేల్...

కాసేపు తర్వాత ఆ ప్రదేశం నిర్మానుష్యమైనట్లు నిశ్శబ్దం...

కేవలం!

సన్నటి చినుకులచప్పుడు...!!

చెవులు రిక్కించాను రెండు నిముషాలపాటు...

నో రెస్పాన్స్!...

ఎదురు కాల్పులు లేవు...

చచ్చారు వెధవలు! నోరార్పుకపోతుంటే చీకట్లో మెల్లిగా కదిలాను. అంతే! కుడివేపు డొక్కలో కరకర ఏదో కలికబడుతూ కదిలినట్లు తట్టింది...

కుడిచెయ్యి పని చెయ్యడంలేదు...ప్రాణం జిల్లార్చుకు పోతోంది...రక్తపు మడుగు, సీటుక్రింద చిక్కగా, జిగు రుగా తగిలింది...

తుది నిముషాలు ..

బయటికి సాచిన ఎడంచేతిలో కాసిని వర్ష పుచుక్కలు పడ్డాయి. దానితో పెదాలు తడుపుతున్నాను.

తిరిగి అదే చేత్తో తడుముకుంటూ వైర్ లెస్ సెట్ అందుకొని ఆన్ చేసాను.

"డిసీజ్ ...డిసర్టు...హంటర్ ..."

"హల్లో భయంకర్! నైరోబీని మాట్లాడుతున్నాను. కంగ్రాచ్యులేషన్స్! ఇక ప్రమాదం తప్పింది. కాన్స్టేరాతో నువ్వు కల్సి వెళ్ళలేదట. ఎందుకని? ఇప్పుడు ఎక్కడున్నావు?"

ఆయాసంతో ముందుకు తూలిపోతూ యెడంచేత్తో దేనినో పట్టుకున్నాను.

"ప్లీ...జ్ ...నైరోబీ...ప్రశ్నలు...వద్దు...హౌ... ఈజ్ కాన్స్టేరా?"

"షీ ఈజ్ ఓ. కే. మిస్టర్ భయంకర్! ఇప్పుడు ఆమె, ప్రొఫెసర్ హోయాంగ్ తో హెలికాప్టర్లో సుడాన్ వైపు ప్రయాణిస్తున్నారు. మరో అర్థగంటలో వారిని రిసీవ్ చేసుకుంటాను. ఎంత ఆలస్యమైనా మీరు సులేమాన్ స్థావరాన్ని చేరుకోకుండా తాను బయలుదేర నని చాలసేపు కాన్స్టేరా మొండికెత్తిందట!మా పైలట్ బలవంతంగా లాక్కొస్తున్నాడు. ప్లీజ్ భయంకర్!మీరు యెక్కడ వున్నారో చెప్పండి. ఈ ఎస్సయిన్ మెంట్ విజయవంతంగా నెరవేర్చి మరో ప్రపంచ సంస్థ యొన లేని సహాయాన్ని చేశారు. ముందు చెప్పండి! వేర్ ఆర్ యూ?"

పేలవంగా నవ్వాను.

నొప్పి...

పొట్ట బలంగా పట్టుకొని పెదవులు కదిపాను.

"ఎక్కడ ఉన్నానో... చెప్తాను... వినండి. మరో ప్రపంచానికి... ముఖ... ద్వారంలో..."

"వాట్ డు యూ మీన్ మేజర్ భయంకర్?"

"ఎస్... మిస్టర్ నైరోబీ... ఐయామ్ గోయింగ్... టు డై... మరో నిముషంలో చావబోతున్నాను... పొట్టలో... భుజాల్లో... తొడల్లో కలిపి దాదాపు యిరవై... బుల్లెట్లు... కాళ్ళ క్రిందా... చేతుల క్రిందా రక్తపు... మడుగు జిగటగా తగులోంది..."

"భయం... కర్!"

అవతలివైపు కేక!

"ఒక్క విషయం... చెప్పండి నైరోబీ... వారిద్దరూ... క్షేమంగా... క్షేమంగా... ఉండి... యా...?"

"ఆ విషయంలో సంకోచం అవసరంలేదు... నేనే స్వయంగా మారువేషాల్లో కాన్వోర్యా, ప్రొఫెసర్ లతో బయలుదేరి ఇండియా చేరతాను. కాని మిమ్మల్ని ముందు బ్రతికించుకుని."

"నో... మిస్టర్ నైరోబీ... వీల్లేదు... అం... మీ విధి... నిర్వహణలో మీరు నిమగ్న... మవ్వండి. కనీసం నా శవాన్ని వెతికించడానికి టైం వేస్టు చేసినా... నా మీద ఒట్టే... అది సరే... వాకీటాకీలో, అంత యెత్తులో దూరంగా ఉన్న... కాన్వోర్యా... తో మాట్లాడలేను... ఆమెతో... చివరి... సారిగా... రెండేరెండు... మాటలు..."

"డోంటో వర్రీ మేజర్! హెలికాప్టర్ వైర్ లెస్ కి నా వైర్ లెస్ కనెక్షన్ యిస్తాను. అరనిముషంలో ఆమె కంఠం మీకు వినబడుతుంది..."

ఎగిసిపడే గుండెల్లో బరువుగా వెనక్కి వాలాను.

ఒకటి...

రెండు... సెకన్లు... భారంగా గడుస్తున్నాయి.

ఉన్నట్టుండి నా శరీరం తేలికపడుతున్నట్లయింది...

తల గిర్రున తిరుగుతున్న అనుభూతి...

తెలివి తెచ్చుకోబోయి తల విదిలించబోయాను...

నా ప్రయత్నం ఫలించలేదు.

లోపల ఏదో—లాగుతుంది.

గుండె ఆగిపోతున్నట్టు...

ఊపిరితిత్తులు ఖాళీ అవుతున్నట్టు...

భయంకరమైన అనుభూతి.

నోరావలించి గుటకలు మ్రింగాను.

గాలిలో తేలిపోతున్నాను.

"భయంకర్! భయంకర్! నేను శాన్యోరాని! ప్లీజ్ టాక్!" శాన్యోరా కేకలు మైక్‌లో లీలగా వినబడుతున్నాయి.

జవాబివ్వాలి...

జవాబివ్వాలి...

"శా..." నోరావలించి, అర్ధస్పృహలో...

ప్రక్కకి కదలబోయి ట్రక్కు డ్రైవింగ్ సీటులో నచ్చి నేలమీద దబ్బున పడ్డాను.

శాన్యోరా, బార్బరా, జోనా నా స్మృతిపథంలో ఒక్కసారి మెదిలారు...

ఆ తర్వాత ఏమైందో నాకు తెలియదు.

—: సమాప్తం :—

